# ఎం. ఎల్. ఏ. ఆత్మకథ

( హాస్యరచన )



ర చ న

మన్నవ గిరిధరరావు Ex. M.L.C.



ప్ర చు ర ణ

యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ

కృష్ణనగర్, గుంటూరు - 522 006

ప్రథమ ముద్రణ : 1956
ద్వితీయ ముద్రణ : 1967
తృతీయ ముద్రణ : 1994

మూల్యము : **30** రూపాయలు

ముఖచిత్రం : 'బాపు'

— ముఖ్యగమనిక —

ఈ పుస్తకములోని పాత్రలూ, ప్రదేశాలూ, సంఘటనలూ కేవలం కల్పితాలు - ఎవరినీ ఉద్దేశించినవికావు.

—రచయిత

ప్రతులకు :

మన్నవ గిరిధరరావు
పార్కురోడ్డు, కృష్ణనగర్
గుంటూరు - 522 006.

ముద్రణ :

శ్రీ లక్ష్మిగణపతి ఆర్ట్ ప్రింటర్స్
మునిసిపల్ కాంప్లెక్స 5/1, బ్రాడీపేట, గుంటూరు-2

# సమర్పణ

తమదు బాధ్యతలను తప్పించుకొనజూచు
పతిత మానవులకు పథము జూపు
"గీత" నొసగినట్టి కేశవ విభున కీ
చిన్ని పూవు కాన్క జేయువాడ !





## ఆశీస్సు

రాజమహేంద్రవరం
5—10—1956

వర్తమాన సాంఘిక ప్రమేయాలను ముచ్చటించడం ద్వారా, శాశ్వతమైన సానందబోధ ఆంధ్రులకు సిద్ధాంచాలని ఉద్దేశించే శ్రీ మన్నవ గిరిధరరావుగారి యత్నాంకురం పాదుకొని పెరిగి విరివిగా ఫలించాలని ఆశీర్వదిస్తున్నాను.

(సం॥) భమిడిపాటి కామేశ్వరరావు.

# మూడవ ముద్రణకు ముందు మాట

ఏకలవ్యునికి ద్రోణాచార్యులు ఎలాంటివారో నాకు శ్రీ సుధాకర్ సి. రాజే అలాంటివారు!

వారు బరోడాలో ఎం. ఏ. ఎల్ ఎల్. బి. డిగ్రీ పుచ్చుకున్నారు. విజ్ఞానము, దానిని మించిన నమ్రతగల వ్యక్తి. వారు ఢిల్లీనుండి వెలువడే "ఆర్గనైజర్" వారపత్రికలో అనేక హాస్య రచనలు చేస్తూవుంటారు. నాకు హాస్యంమీదా, వ్యంగ్యంమీదా, అభిలాష జనించడానికి వారి రచనలే ముఖ్య కారణం. వారి మార్గాన్ని అనుసరిస్తూ స్వయముగా తెలుగులో రచనావ్యాసంగం మొదలు పెట్టాను. ఈ సందర్భంగా శ్రీసుధాకర్ రాజే గారికి నా హృదయపూర్వక నమస్సుమాంజలు లర్పిస్తున్నాను.

ప్రసిద్ధ హాస్యరచయిత శ్రీభమిడిపాటి కామేశ్వరరావు గారు నన్ను ఆశీర్వదించడం నా మహద్భాగ్యం. వారి వాత్సల్యానికి నా కృతజ్ఞతలు తెలుపుకున్నాను.

పందిరి ఉంటేగాని లతఅల్లుకోదు. నా హాస్యరచనలను చాలాసంవత్సరాలుగా "జాగృతి" సంపాదకులు శ్రీతూములూరు లక్ష్మీనారాయణగారు ప్రచురిస్తూ వచ్చారు. వారి ప్రోత్సాహం క్రమంగా ఈ గ్రంథరచనకు దారి తీసింది. వారికి నాధన్యవాదాలు.

1956 లో ఈగ్రంథాన్ని తొలిసారిగా వెలువరించిన పిదప దీనిని చదివి మా గుంటూరు హిందూకళాశాల కార్యదర్శి శ్రీకలవగుంట నరసింగరావుగారు నన్ను అభినందిస్తూ లేఖ వ్రాశారు. ట్యూటరుగా పని చేస్తున్న నన్ను మిగుల అభిమానంతో లెక్చరర్‌గా నియమించారు వారి మన్ననలు లభించడానికి ఈ పుస్తకం దోహదమైనది.

1967 లో ద్వితీయ ముద్రణ వెలువడింది. అప్పుడు దీనిని ఆసక్తితో చదివిన ఉపాధ్యాయ మిత్రులు ఎందరోవున్నారు. వారికి నాపైఏర్పడిన అభిమానం 1968 లో నేను ఎమ్. ఎల్. సి. గా నిలబడి గెలుపొందడానికి మిగుల సహకరించింది. కేవలం నానిర్లక్ష్యం వలననే పునర్ముద్రణ జరుగకుండా చాలాకాలం గడిచిపోయింది అనేకమంది. బంధుమిత్రుల ప్రోత్సాహంతో మూడవముద్రణ వెలువరుస్తున్నాను. పాఠకులు సహృదయంతో స్వీకరిస్తారని ఆకాంక్షిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని అత్యమితంగా అభిమానించి తమ అభిప్రాయం వ్రాసిన సహృదయ సాహితీ మిత్రులు శ్రీ ఏటుకూరి(?)పాటి అనంతరామయ్య గారికి మనసారా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను. ముఖచిత్రముతో పుస్తకాన్ని అలంకరింపజేసిన 'బాపు' గారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

అత్యంత సుందరముగా గ్రంథ ముద్రణగావించిన శ్రీలక్ష్మిగణపతి ప్రింటర్స్ యజమానులు శ్రీ బి.వి. సుబ్రహ్మణ్యశాస్త్రి కి ధన్యవాదాలు.

1-7-1994 —మన్నవ గిరిధరరావు

# తొలి తెలుగు హాస్యరచన

'ఆంధ్రవ్యాస' 'కవికులరత్నదీప'
ఏలూరిపాటి అనంతరామయ్య
హైదరాబాదు

ఎం.ఎల్.ఏ. ఆత్మకథకిది మూడవ ముద్రణ.

దీని రచయిత సుప్రసిద్ధులయిన ముప్పవ గిరిధరరావుగారు. వీరు నిష్ణాతులయినవారు. విద్యార్థిగా వల్లభజోస్యుల సుబ్బారావుగారి వంటి ప్రసిద్ధులకు శిష్యులయ్యారు. చరిత్రలో పరమపట్టభద్రులయి, ఇతరత్రా కూడా చేసినా, గుంటూరు హిందూకళాశాలలో చరిత్రశాఖాధ్యక్షులుగా చిరకాలం పనిచేసి వేలాది శిష్యులలో ఉత్తమసంస్కారబీజాలు వెదజల్లి వయస్సు వచ్చిన కారణంగా పదవినుంచి విరమించినారు. ఉపాధ్యాయప్రతినిధిగా ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభ్యులయి విద్యారంగానికే చిరస్మరణీయమైన సేవచేసినవారు.

వీరు వ్యక్తిగా సత్యభావమూ చక్కని నడవడీ కలిగి స్థిమిత శాంత గంభీర మధురవాక్కులతో విద్యార్థులనూ విశేషజ్ఞులనూ, సహచరులనూ సజ్జనులనూ, పరిచితులనూ ప్రముఖులనూ చక్కగా సరిగా-సమంగా ఆకర్షింపగలిగినవారు. వెకిలితనంలేని చమత్కారమూ, పలుచదనంలేని పరిహాసమూ, గ్రుచ్చుకొన్నా నొప్పిలేని ఎత్తిపొడుపూ వీరిపలుకుల ప్రత్యేకతలు.

"యువభారతి"వంటి పలు చిన్న పత్రికలకు వీరు సంస్థాపకులుగా సంపాదకులుగా ఆంధ్రదేశానికి మేలుచేసే సద్భావాలనెన్నింటితో ప్రచారం

చేసి తాము సేవాసుకృతమూ విచక్షణుల హృదయాలలో విశిష్టమయిన సాధనమూ మాత్రం సంపాదించుకున్నారు. కంచిస్వాములవారి ప్రోత్సాహంతో గుంటూరు శ్రీశంకర సేవాసమితివారు ప్రచురిస్తున్న "భారతీయ మార్గా"నికి ఆదినుంచి సంపాదకులుగా ఉంటూ ఆ పత్రికను చిన్న అయినా మిన్న అన్నట్లుగా చక్కగా తీర్చిదిద్దుతున్నారు.

చరిత్ర క్షుణ్ణంగా పరిశీలించినవారు కనుక చరిత్రలో మహనీయుల జీవితాలలో, వివిధ విశ్వభాషా మహారచయితల రచనలలో గల చరిత్ర నిర్మాణానికి అవసరమయిన సంఘటనలనూ సూక్తులనూ సేకరించడంలో వాటిని సకలజనాభరణాలయిన పుస్తకాలుగా తీర్చి కూర్చి అందించటంలో సిద్ధహస్తులు. వీరి పుస్తకాలు చాలావరకూ పలుముద్రణలు పొందినవే. వీరు విద్యార్థిగా ఉన్నప్పటినుంచీ వివిధ సమస్యల గురించి వేరు వేరు ప్రసిద్ధ పత్రికలలో ఎన్నో అమూల్యమయిన వ్యాసాలు మొదలయిన రచనలు వెలువరిస్తూ వస్తున్నారు.

తెలుగులో ఇట్టి రచనలకిది తొట్టతొలి పుస్తకం. అలా రచించి ప్రచురించినదీ ఎం.ఎల్.ఏ. ఆత్మకథ. స్వాతంత్ర్యానికిపూర్వం ఈదేశంలో రాజకీయాలంటే దేశంకోసం త్యాగాలు. స్వాతంత్ర్యానంతరం భోగాలు. ఈ క్రొత్త పరిస్థితులకు అనుగుణంగా మారలేని పాతవారు చాలామంది క్రమంగా కనుమరుగైపోయారు. అలాఅయిపోతున్న సంధిదశలోని క్రొత్త శాసనసభ్యుల ఉత్పత్తి-వృద్ధి-వ్యవహార-పరిణామసరళిని పట్టి ఇస్తున్నదీ ఆత్మకథ.

ఇది కేవలం కల్పితమేసుమా అని రచయిత హెచ్చరించినా, ఇలాంటి రచనల విషయంలో ఇలాంటి హెచ్చరికలకు అర్థాలువేరు. ఇందులో ఈ ఎం.ఎల్.ఏ. పార్టీ ప్రభుత్వం అవిశ్వాస తీర్మానం నెగ్గినందు

వల్ల పడిపోతుంది. దీని ప్రథమ ముద్రణం 1956లో అయింది. అంతకు పూర్వం ఈ రాష్ట్రంలో ఏ ప్రభుత్వమైనా అవిశ్వాసతీర్మానంవల్ల పడి పోయిందేమో కుతూహలమూ కొంచెం ఓపికా కలవారు ఆరాతీస్తే ఆ సంఘటనకు మూలం తెలుస్తుంది. ఈ కథలోని ఆ తీర్మానాన్ని ఒక ఆండగులపార్టీ ఆకస్మికంగా సమర్థించి ప్రభుత్వం పడిపోవటానికి ప్రధాన కారణమవుతుంది. 1956కి పూర్వకాలంలోని ఏదైనా ప్రభుత్వంలో అంత వరకూ పాలు పంచుకొన్న ఏ పార్టీ అయినా అట్టిపని చేసిందా అని పరిశీ లిస్తే అలా అనిపించుకున్న ఆ పార్టీ ఏదో తెలుస్తుంది. ఇందులోని సంఘ టనలు మొదలయినవి అభూత-అసత్య-కల్పనలూ నేలవిడిచిన సాములూ కావనటానికేకాని ఈ వివరాలు మరెందుకూ కాదు. లోకాన్ని పరిశీలించి అందులోని తనకు నచ్చని అవకతవకలను అపహాస్యభాజనములుగా చిత్రీ కరించటంద్వారా లోకాన్ని మరమ్మత్తు చెయ్యటం హాస్యరచయిత పని. ఆ పని చెయ్యటంలో ఇందులో మంచి పనితనం కనిపిస్తుంది.

ఎన్నికలలో తాము గెలవటంకోసం గాక నిలబడేవాళ్ళూ, స్వప్ర యోజనాలకోసం ఇతరులను ములగచెట్టెక్కించేవాళ్ళూ ఇందులో అడు గడుక్కీ కనిపిస్తారు. చదువులూ పరీక్షలూ ఎలా విపరీతఫలప్రదాలుగా పరిణమించాయో తెలుస్తుంది. అధికారం-ప్రజాసేవ-వీటినిగురించిన చక్కని ఆలోచనల నీపుస్తకం ప్రేరేపిస్తుంది. ప్రజలకు సేవచేయటానికి అధికారం మాత్రమే మార్గమనుకొంటున్నారు చాలామంది. అధికారంకోసం రాజకీ యాలూ అక్రమసంబంధాలూ అవసరమవుతున్నాయి. ప్రతివాడూ ఎదుటి వాని అధికారవాంఛను దూషిస్తున్నాడు, ఎదుటివాని రాజకీయం తూలనాడు తున్నాడు. కాని ఆ వాంఛతోనే అట్టిపనులే తానూ చేస్తున్నాడు. అధికారం ఆదిలో కాంక్షించేవారంతా దుర్మార్గులే అనుకోనక్కరలేదు. ఆ దోషం

అధికారంలోనే సహజంగా ఉంది. ఒకసారి అధికారం లభించాక దాన్ని వదులుకోవటం కష్టం. కనుక అధికారం చిక్కించుకోటానికి, దక్కించుకొనటానికి అనేకమయిన అవాంఛనీయ కార్యాలు చేయవలసివస్తున్నవి. అందువల్ల అధికారం దేనికో సాధనమన్నది మరచి అదే సాధనమూ సాధ్యమూ అవుతున్నది. అందువల్ల అనేకమైన అనర్థాలు ఉత్పత్తిల్లుతున్నాయి. అంతరంగం పనిచేసేవారు వాటిని హర్షించలేరు. తేనెటీగలన్నీ కలసి తేనె ప్రోగుచేస్తే, అది ప్రోగుచేసిన ఈగలకూ చేయించిన ఈగకూ కాక పొగపెట్టి తుట్టె కొల్లగొట్టినవారి పరమయినట్టే, అధికారలాభంకూడా అలా అలా లోభపెడుతూ, మభ్యపెడుతూ, శ్రమచేయిస్తూ, అందరిచేతులూ మారుస్తూ, సాధించినవారిని సాధనకాలంలోనూ రక్షాప్రయత్నంలోనూ బలితీసుకుంటూ, కొందరినిమాత్రం కొంతకాలం బాగుచేస్తూ, బాగు ఓగనిపిస్తూ ఓగుబాగనిపిస్తూ, పరస్పరనాశనప్రణాళిక దీర్ఘసత్రంలా సాగిపోతూ, ప్రాప్యమయిన ప్రజల మేలుమాత్రం అప్రాప్యంగానే ఉండిపోతూ ఉంటుంది.

కనుక, ప్రజలకు మేలుచేయటానికి అధికారమే అక్కరలేదు. అధికారంకంటె సేవ ఉత్తమ సాధనం అన్న తల్లి చేసిన తొలి ఉపదేశం చివరకు మిగులుతుంది. అధికారం వినా అన్యులకు మేలుచేయాలనేవారు అధికసంఖ్యాకులుగా ఉన్న సమాజంలో అధికారాన్ని అంటుకొని ఉన్న మకిలికూడా తొలగిపోయే అవకాశం ఉంటుంది. ఎన్ని అనర్థాలు కనిపించినా చివరికి నిష్కామ నిశ్చలబుద్ధితో సేవచేసే మనుష్యులు తయారు కావటమూ, అట్టివారిని తయారుచేయటమూ ఒక్కటే తరుణోపాయమన్న సూచనతో మాజీ ఏం.ఎల్.ఏ. స్వగ్రామానికి పయనం కావటంతో ఈ కథ పూర్తి అవుతుంది. పాడైపోయిన పనిముట్లతో పని సరిగా సాగదు.

సాధ్యమైనంతలో సరిగానో అరకొరగానో ఉన్న పనిముట్లతోనో పని మాత్రం సాగిస్తూ క్రొత్త మంచి పనిముట్లు తయారుచేసుకొనటమొక్కటే ప్రత్యామ్నాయం.

సరికొత్త పనిముట్లను సరయిన మార్గంలో తయారుచేయటం పనిగా కళాశాలోపాధ్యాయులుగా జీవితం ప్రారంభించిన గిరధరరావుగారు, ఈ సత్యం గ్రహించికూడా తామేమైనా చేయగలమేమోఅని, ఆపని వదల కుండానే ఎం.ఎల్.ఏ. కాకపోయినా ఎం.ఎల్.సి. అయినారు. తమతొలి పరిశీలనమే విలువయినదిగా గుర్తించి తొలిపనిలోనే కొనసాగారు.

నాలుగు గోడలమధ్య బెంచీలమీద కూర్చున్న విద్యార్థులను తీర్చి దిద్దే అవకాశం తప్పినా, అంతకుముందునుంచీ అలవరచుకొన్న ప్రసంగ-పత్రికా గ్రంథ రచనలద్వారా అన్నికాలాలకూ అన్ని ప్రాంతాలకూ అన్ని వృత్తులకూ చెందినవారందరినీ తీర్చిదిద్దే కార్యక్రమాన్ని మాత్రం కొన సాగిస్తూనే ఉన్నారు.

ఎం.ఎల్.ఏ. ఆత్మకథద్వారా అధికారమార్గంకంటె క్రొత్త పని ముట్లను తయారుచేసే కార్ఖానా పని మంచిదని ఈ పుస్తకంలో తేల్చిన గిరిధరరావుగారు ప్రస్తుతం ఆ కార్ఖానాలెలా ఉన్నాయి ? పనిముట్ల తయా రీలో పనివాని పనితనాని కెంతవరకూ అవకాశమున్నది. సన్నాకచోటి నుంచీ సూక్ష్మాకచోటినుంచీ, రేకునాకచోటినుంచీ పెద్దాలాకచోట పొంది పించుకొని, వివిధపరిమాణాలూ, రంగులూ విలువలూ ప్రయోజనాలూకల విడివిడిభాగాలు వివిధ ప్రణాళికలననుసరించి తయారయివస్తే వాటినెవరో చెప్పినరీతిని కలిపి తయారుచేశామనిపించుకొనటమేనా ? ఇంకేమయినా ఉన్నదా ? ఆ కార్ఖానాలు వారి ఆశలకెంతవరకూ తగినవిగా ఉన్నాయి ? వాటిలో వివిధానుభవాలతో సంకుచిత విశాలరంగాలలో పనిచేసిన పరహిత

చింతకుడయిన ఉపాధ్యాయుని మనస్సు పదవీవిరమణానంతరం సంతృప్తముగా ఉండే పరిస్థితులే ఉన్నాయా ? ఉంటే అవి ఏవి ? లేకుంటే ఎందువల్ల ? ఉన్నవాటి స్వరూపమేమిటి ? అందుకు కారణాలేమిటి? ఉన్నవాటిలో పనికొచ్చేవి నిలుపుకొనటానికీ లేనివాటిని తెచ్చిపెట్టుకొనటానికీ చేయవలసినది ఏమి ఎవరు ఎలాచేయాలి ? ఇట్టి ప్రశ్నలకు సమాధానాలుగా ఏ "అయ్యవారి ఆత్మకథ"నో ఇదే ధోరణిలో ఎందుకు వ్రాయకూడదు ? వ్రాస్తే, అది ఇప్పటికే ఎన్నో ముద్రణలు అయి ఉండవలసిన ఈ ఎం.ఎల్.ఏ ఆత్మకథను మించిన మంచి పుస్తకమవుతుందని నా ఆశ.

మనకున్న మరీ కొలదిమంది-భాషలో భావవిన్యాసంలో సంస్కారంలో నాజూకుతనంగల - హాస్యరచయితలలో గిరిధరరావుగారొకరు, ప్రత్యేకతకల ముఖ్యులు. వారికింతవరకూ ఈ విషయంలో కల తెలుగు విశ్వవిద్యాలయంవారు హాస్యరచనలకిచ్చే శ్రీ ఋలుసు బుచ్చిసర్వారాయుడు స్మారకపురస్కారం చేరకపోవటానికి ఈ ఎం.ఎల్.ఏ. ఆత్మకథ బహుకాలంగా ఎవరికీ అందుబాటులో లేకపోవటం ఒక కారణం అనిపిస్తుంది. ఇపుడా అడ్డు తొలగిపోయింది.

—ఏలూరిపాటి అనంతరామయ్య

## విద్యార్థులు చదువవలసిన పుస్తకాలు

వెల స్వల్పం ! విలువ అధికం !!

| | | |
|---|---|---|
| 1. | కాంతి రేఖలు [మొదటి భాగం] | రు. 12-00 |
| 2. | కాంతి రేఖలు [రెండవ భాగం] | రు. 15-00 |
| 3. | కాంతి రేఖలు [మూడవ భాగం] | రు. 12-00 |
| 4. | మణి పూసలు [Telugu Quotations] | రు. 15-00 |
| 5. | మణి పూసలు-2 [ ,, ] | రు. 15-00 |
| 6. | పనికొచ్చే కథలు [మొదటి భాగం] | రు. 10-00 |
| 7. | పనికొచ్చే కథలు [రెండవ భాగం] | రు. 10-00 |
| 8. | చదువుకుంటే బహుమతి (23 నీతికథలు) | రు. 6-00 |
| 9. | సూక్తిసుధ (53 సూక్తులు, వివరణ) | రు. 7-00 |
| 10. | ఎలా చదవాలి ? | రు. 5-00 |
| 11. | Thoughts for all times | రు. 16-00 |
| 12. | అప్రస్తుత ప్రసంగం (హాస్యరచనలు) | రు. 20-00 |

రచన :

మన్నవ గిరిధరరావు, ఎం. ఏ (Ex.M.L.C.)

ప్రచురణ :

యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ (రిజి.)

కృష్ణనగర్ : : గుంటూరు-522 006.

# ఎం.ఎల్.ఏ. ఆత్మకథ

## ప్రస్తావన

ఎమ్మెల్యే ఆత్మకథ రాస్తున్నాడనగానే సాహితీ జీవులందరికీ ఒకటే ఏడుపు ! ఎమ్మెల్యే గూడ ఒక రచయితేనా అని; అతనికి తెలుగులో అక్షరాలెన్నున్నాయో తెలుసునా అని; అతడు గనక ఆత్మకథ రాసి లోకంమీదికి వదిలితే తెలుగు సాహిత్యం మంచం పట్టదా అని దెప్పుతున్నారు!

నాకు సాహిత్యంలో ఓనమాలు రానిమాట పచ్చి నిజం. ఒక ఖండ కావ్యంగాని, అఖండ కావ్యంగాని చదివిన వాణ్ణిగూడా కాదు. అంతమాత్రాన నేను ఆత్మకథ రాసినట్లయితే సాహిత్యం నీరుకారిపోతుందనుకోను. వచనాన్ని గేయాలుగా రాసి వదులుతుంటే కారని నీరు వచనాన్ని వచనంగా రాస్తే కారుతుందని నేను భావించడంలేదు.

అసలీ ఆధునిక యుగాన్ని ఆత్మకథల యుగమని చరిత్రకారులు కుండ బద్దలు గొట్టి చెపుతున్నారు. "చుట్ట తాగని ఇంగ్లీషువాణ్ణి చూశావ్?" అని ఆనాడు గిరీశం వెంకటేశాన్ని ప్రశ్నించాడు. "ఆత్మకథ రాయని పెద్దమనిషిని చూశావ్?" అని ఈనాడు నేను ప్రశ్నిస్తున్నాను. సాహిత్యంలోగాని, రాజకీయంలోగాని, కళారంగంలోకాని

ఆ మాటకొస్తే ఏ రంగంలోనైనా వేలుముడిచి చెప్పదగ్గ బారుమనిషి వున్నాడంటే ఆతడొక ఆత్మకథను స్వయంగా రాసి లోకంమీాదికి వదులుతున్నాడు.

పూర్వం ఈ బాధలేదు. రామకృష్ణ పరమహంస, బాలగంగాధరతిలక్, రామమోహనరాయ్ లాంటి వాళ్ళు వున్నారంటే, వాళ్ళు దాటిపోయిన మరుక్షణంలో అనేక మంది అనేక భాషల్లో వాళ్ళ జీవితచరిత్రలను పద్యాలుగా, వచనంగా పరిపరి విధాల వర్ణించి లోకానికి అందించారు. ఆ గ్రంథాలను గుట్టలు గుట్టలుగా జనం కొనుక్కొని చదివారు. ఆ మహాత్ములు బతికున్నపుడు గూడ తెలియని అనేక సంగతులు గతించిన తర్వాత జనానికి తెలిసినయ్.

ఆ విధంగా ఉత్తరోత్తరా ఎవరో మనల్ని గురించి రాసి ముద్రిస్తారని నమ్మలేకుండా వున్నాను. అలాంటి సూచనలు కానరావడంలేదు. అసలు నన్ను గురించి ఎవరికి తెల్సు రాయడానికి? ఒకవేళ తెలిసినా ఎందుకు రాస్తారూ? ఆ మాత్రం పరోపకార బుద్ధిఏదీ? లేదు. ఇవి కేవలం స్వశక్తి మీాద నిలబడి బతక వలసిన రోజులు. నన్ను గురించి నేనే రాసుకోక తప్పదు.

"నిన్ను గురించి నీవు చెప్పుకోకు. ఎందుకంటే మంచి చెప్పుకుంటే ఎవరూ నమ్మరు; చెడు చెపితే ఇంకెంతవుందో

ననుకుంటారు" అని ఎవరో రచయిత అన్నాడు. ఇదిగూడ ఆలోచించదగ్గ అంశమే.

ఆత్మకథ రాయబోయేముందు ఇది ఎంతవరకు సత్యమోనని గూడ ఆలోచించాను. నన్ను గూర్చి నేను మంచీ చెప్పగూడదు, చెడూ చెప్పగూడదు అని దీని తాత్పర్యం. ప్రతి విషయమూ మంచిదైనా అవుతుంది, చెడ్డదైనా అవుతుంది. రెండూ కాకుండా మూడోది అయ్యే సావకాశం లేదు. ఏతావాతా తేలిందేమంటే నన్ను గురించి నేను ఏమీ చెప్పుకోకూడదన్న మాట. సూక్ష్మంగా ఆలోచిస్తే ఇది లోక విరుద్ధమైన మాట. కరెంటు కట్టయితే లైట్లు ఆరిపోయినట్లు 'నేను' అనే మాటలేకపోతే ప్రపంచంలోని కార్య కలాపమంతా స్థంభించి పోతుంది. ఈ 'నేను' తోటే మన మనుగడంతా ముడిపడివుంది. కాబట్టి బహుశా అహంకారం కూడదని మాత్రమే పై మాటలోని భావం అయివుంటుంది.

అహంకారంమీద నాకెలాంటి మమకారమూ లేదు. నన్ను గూర్చి నేను స్తోత్రం చేసుకోవడం కోసం నేనీ ఆత్మకథ రాయడంలేదు. కేవలం ప్రజల కోసం, వారి ప్రయోజనం కోసం నేను కలంచేత బట్టాను. గాంధీ మహాత్ముడు కూడ ఆత్మకథ వ్రాశాడు. అహంకారంతో రాశాడా? లేదు. ఆయన తనలోని సుగుణాలనూ అవగుణాలనూగూడ మొహమాటం లేకుండా వర్ణించాడు. అందువల్ల లక్షలాది

మానవ మాత్రులు దాన్ని చదివి గుణపాఠాలు గ్రహిస్తా రని ఆయన సంకల్పం. అలాగే ఇపుడు ఎం.ఎల్.ఏ. అనే పదవిని అందుకోవలసిన 'ఉట్టి'గా లోకం గుర్తించింది. అందు చేత నేను శాసన సభ్యుణ్ణి కావడానికి ఎంత దీక్షతో కృషి చేశానో, ఎన్ని మాటలు పడ్డానో, ఎందరి సహకారం పొందానో, ఎన్ని మజిలీలు దాటానో, స్వానుభవంద్వారా తెలియజెప్పడం వల్ల రాబోయే తరాలవారికి మార్గదర్శ కంగా వుంటుందని ఇందుకు పూనుకున్నాను. అంతేగాని సాహితీవేత్తగా 'పై' నవుదామనే ఉబలాటం ఏ మాత్రం లేదు.

) — (

## పుట్టు పూర్వోత్తరాలు

నా జన్మదినం గురించి రాయాలంటే నాకే 'ఇది'గా వుంది. ఫలానా తేదీ ఇన్ని గంటల ఇన్ని నిమిషాలకు నేను జన్మించినట్లు మా నాన్నగారు ఎక్కడా వ్రాయించి వుంచిన దాఖలా లేదు. దాన్ని గూర్చి నేనంతగా పట్టించు కోనూలేదు. మొన్న మొన్నటి వరకు జన్మదినంతో ఆటే అవసరం లేకపోయింది. హైస్కూల్లో చేరేటపుడు ఉజ్జాయిం పుగా ఏదో ఒక తేదీ వేశారు. ఈ మధ్య ఎమ్మెల్యే అయిం

తర్వాత జన్మదినోత్సవమూ అదీ జరుపుకోవలసిన అగత్యం కనపడింది. ఇదమిత్థంగా తెలుసుకోవడం కోసం మా అమ్మగారినే అడిగాను నా జన్మదినమేదని. ఆమె క్రోధన నామ సంవత్సరమని ఖాయంగానే చెప్పింది. తిథి మాత్రం రోహిణీకార్తెలో వచ్చే అమావాస్య నాటి మధ్యాహ్నం ఒంటిగంటకని ఉజ్జాయింపుగా చెప్పింది. క్రోధన అంటే1925వ సంవత్సరమని తెలిసినవాళ్ళు చెప్పారు- బాగానే వుంది. కాని రోహిణీ కార్తెలో అమావాస్య అనగానే నాగుండె గుభేలు మన్నది. అమావాస్యనాడు జన్మించినవాడు జేబులు సర్దుతాడంటారు. అది వేరేసంగతి. రోహిణీకార్తెలో గనుక జన్మదినోత్సవం జరుపుకుంటే పక్షిగూడా ఆ ఛాయలకు రాదు. రోళ్ళు పగిలే ఎండల్లో జన్మదినం ఏమిటి నా మొహం !

అందుచేత నా ఆప్తమిత్రుడైన సుశీలారావు సలహా ప్రకారం దేశంలోని రాజకీయ నాయకుల జన్మదినాలన్నీ ఒక జాబితా వ్రాసి, ఆ పట్టికలో అటు పదిహేను రోజులూ ఇటు పదిహేను రోజులూ ఎవరి జన్మదినమూ పోటీకిరాకుండా చూసి, జనవరి 18 వ తేదీ సాయంకాలము 6 గంటల 12 నిముషాలకు నేను జన్మించినట్లుగా నిర్ణయించాము. ప్రాక్టికల్‌గా ఆలోచిస్తే ఇది సమంజసమైన నిర్ణయంగా తోచింది, ఊరేగింపు పూర్తయి సభాస్థలి చేరేసరికి ఎల్లా

లేదన్నా సాయంకాలం 6 గంటలవుతుంది. జన్మకాలం సరి యైనదని నమ్మటానికి వీలుగా 12నిముషాలు గూడాచేర్చాం. అంతకన్న మరేంలేదు.

తిమ్మాపురం ఫిర్కా బోడిపాలెం గ్రామమునసబు మా నాన్నగారు. 50ఎకరాల మాగాణి, 50ఎకరాల పసుపుతోట స్వంత వ్యవసాయం చేయిస్తూవుంటారు. ఐదుజతల ఎడ్లు,పది పదిహేను పశువులూ కొట్టాల్లోపడి నెమరు వేస్తుంటాయి. ఆయన గుఱ్ఱంమీద స్వారిచేస్తూ, బస్తీకి వెళ్ళివస్తుం టేపూర్వం రెడ్డిరాజులకాలంలో దండనాథులు గుర్తుకువచ్చేవారు. ఆఖ రికి రెవిన్యూ ఇన్స్పెక్టర్లు వచ్చినాసరే వాళ్లు మా నాన్న గారికి నమస్కారం చేయవలసిందేగాని మా నాన్నగారు వాళ్ళకుతలవంచి ఎరుగరు.మాఅమ్మగారు సత్యకాలంమనిషి. చుట్టాల్లో ఎవరి అమ్మాయి గర్భిణీ అయినాసరే ఇంటికి తీసు కొచ్చి నాలుగు నెలలు వుంచుకొని పురుడూ అదీ పోయించి పంపించేది ! విధీ విరామమూ లేకుండా రామాయణమూ, భారతమూ చదివించి వింటుండేది. ఆమెకు అవే అన్నపానీ యాలని అంటే అతిశయోక్తి కాదు. వచ్చే పోయే అతిథు లతో మా యిల్లు నిండుగాఉండేది. మాఅమ్మా నాన్నలకు కుమారుడినైనా కుమార్తెనైనా నేనొక్కడినే. చిన్నతనం నుంచీ నేను కొండమీద కోతి తెమ్మన్నా తెచ్చిపెట్టేవాళ్లు.

మా నాన్నగారి తండ్రి పేరు అప్పయ్య. మా తల్లి

తండ్రిపేరు వెంకయ్య. నాకు నామకరణం చేసేముందు ఎవరి తండ్రిపేరు వాళ్లు పెట్టాలని పట్టు బట్టారట. చివరకు ఇద్దరూ సమాధానపడి వెంకటప్పయ్య అనిపేరుబెట్టారు. మా అమ్మ నన్ను ముద్దుగా వెంకూ అని పిలిచేది. మా నాన్నగారు అప్పడూ అనేవారు.

నా ఆరోమాసంలో అన్న ప్రాశన చేశారట.ఆనాడు ఒక పీటమీద బంగారపు గొలుసు, రూపాయి నాణెము, మామిడిపండు, కలము, పుస్తకము, హ్యాటు పెట్టివుంచారట. మా అమ్మమాత్రం నేనా పుస్తకం పుచ్చుకుంటానని ఆశతో నిలబడిందట. ఆ హ్యాటు పుచ్చుకుంటానేమోనని నాన్న గారు చూస్తున్నారట. తీరా నేను పారాడుకుంటూ వెళ్ళి రూపాయి బిళ్ళను గుప్పిడితో తీసుకొని నోట్లోకి పోనిచ్చా నట. వెంటనే అక్కడున్న మా వెంకటాద్రి మామయ్య అన్నాడట"ఆరిభడవా!వీడు డబ్బుకుడబ్బే తినేస్తాడేవ్"అని!

నాకు ఊహ తెలిసీ తెలియనప్పటినుంచి ఈనాటివరకు కూడా అప్తమిత్రులైన వాళ్ళు ముగ్గురున్నారు. వీరిలో ముఖ్యుడు సుశీలారావు. అచ్చంగా బంగినపల్లి మామిడి పండులావుంటాడు. అతని కళ్ళలో అవతలి మనిషినిబుట్టలో వేసుకోగల ఒక విధమైనకాంతి నాకు గోచరమవుతుంటుంది. తెలివితేటల్లో అద్వితీయుడు. ఉన్నదాన్ని లేనట్లుగాను,లేని దాన్ని ఉన్నట్లుగాను నమ్మించగలడు.అతనంటే నాకు సహజ

మైన మమకారం వుండేది. మా వీధి మలుపు దగ్గర నిలబడి అతనొక ఈలవేస్తే అన్నంతినేవాణ్ణిగూడ చెయ్యి కడుక్కొని గడపలు దాటుకుంటూ పోయి అతన్ని కలిసేవాడిని. మావి ఒకటే హృదయం గల రెండు శరీరాలు.

సుశీలారావు తండ్రి మా వూళ్ళో చెయి తిరిగిన ప్రైవేటుదారు. చత్వారపు కళ్ళజోడు పెట్టుకొని సామాన్యులకు అర్థంకాని దస్తూరితో వ్రాయబడే దస్తావేజులను తదేక ధ్యానతో చదువుతుండేవాడు. ఆయన ఒక ధనవంతుణ్ణి బికారిగాను, ఒక నిర్భాగ్యుణ్ణి భాగ్యవంతునిగాను మార్చి వేయగల సమర్థుడు. ఎప్పుడూ మున్సబ్ కోర్టుతోనూ, జిల్లా కోర్టుతోనూ ఆయనకు లావాదేవీ లుండేవి. ఆయన జీవితంలో ఒకసారి మాత్రం హైకోర్టుదాకా వెళ్ళి కేసు గెల్చుకొచ్చాడు. ఆయనకు లోకంలో తెలియని సంగతులు లేవు. సాయంకాలంపూట రావిచెట్టుక్రింద కూర్చొని బిస్మార్కును గురించీ, కైజరును గురించీ కాశీమజిలీ కథల్లాంటి కథలు చెపుతుండేవాడు. ఆయనకు యెవరితోటీ విరోధం లేకపోయినా అందరూ ఆయనంటే హడలిచచ్చేవాళ్ళు!

నా రెండవ మిత్రుడు కొండయ్య. పాకానికి వచ్చిన నేరేడుపండులా వుంటాడు. అసలా పళ్ళంటే అతనికి యిష్టం గూడాను. అవి తినటంవల్లనో ఏమోగాని మాటలుస్పష్టంగా పలకలేడు. అక్షరాలు దిగమింగుతుంటాడు. అజానుబాహువు;

ఉక్కులాంటి శరీరం; నిప్పులాంటిమనిషి. అవతల వందమంది కఱ్ఱలు, కత్తుల్తో వచ్చినాసరే ఒంటరిగా ఒక బరిసెపుచ్చుకొని బయలుదేరి తరిమి కొట్టి రాగలవాడు. బుఱ్ఱ మాత్రం మందకొడిగా వుండేది. అయినా అతను నమ్మినవాళ్ళకు ప్రాణమిచ్చే మనిషి.

నా మూడోవమిత్రుడు మహాలింగం. ములక్కాడలాగ సన్నగా నిటారుగావుంటాడు. కాఫీపొడరు రంగులోఉంటాడు. మితభాషి. పదిమాటలు వింటే ఒక మాట మాట్లాడుతాడు. ఏమీా ఎరగనట్లు కనపడుతాడు. ప్రమాదం వచ్చేట్లుంటే చల్లగా తప్పుకోగలడు. అలంకార పురుషుడు. గుడ్డలు మాయనివ్వడు. చొక్కామీద కాకిరెట్ట పడితే గిలగిల్లాడుతాడు. డబ్బుదాహంగూడ బాగానేవున్నది. రావిచెట్టంత మేడ కట్టాలని చిన్ననాటినుంచీ కలలు కంటుండేవాడు.

ఏళ్ళు వచ్చినకొద్దీ సుశీలారావు సిత్యాగ్నిహోత్రీకుడైనాడు. కొండయ్య బహుపత్నీ వ్రతుడైనాడు. మహాలింగం రెండింటిలోనూ వేలుపెట్టినవాడేగాని లోతులుచూడ లేదు. తామరాకుమీాద నీటిబొట్టులాగ వర్తిస్తుంటాడు. నేను ప్రేక్షకుడుగా మాత్రం మిగిలిపోయాను. గిట్టని వాళ్ళు మా నలుగుర్నీ చతుష్టయం అని ఏడుపుగొట్టుతనంతో అనేవాళ్లు. మేమంతగా పట్టించుకోలేదు.

---

# "అప్పెందుకు తెచ్చుకోవాలి?"

ఐదోయేడు రాగానే నన్ను మేళతాళాలతో తీసుకెళ్ళి వీధిబడిలో దిగబెట్టి వచ్చారు. నేను అక్షరాలయినా నేర్చుకోకముందే రెండు సంవత్సరాలు చక్రం తిరిగినట్లు తిరిగిపోయినయ్. మునసబుగారి కొడుకునవటంవల్ల నేనంటే పంతులుగారికే భయముండేదిగాని ఆయనంటే నాకేమీ భయముండేదికాదు. అసలు నాకు పుస్తకం పుచ్చుకోగానే నిద్రయినా వచ్చేది; తప్పితే తలనొప్పి అయినా వచ్చేది. అందులోనూ లెక్కలంటే మరీ చుక్కెదురు.

ఒకనాడు పంతులుగారు తీసివేతలు చెపుతున్నాడు. పైన నాలుగుంది, క్రింద ఆరుంది. నాలుగులో ఆరు పోదు గనుక ఒకటి అప్పు తెచ్చుకోమన్నాడు! నిక్షేపంలా [illegible]టెకరాల ఆసామికి కొడుకునైన నేను అప్పెందుకు తెచ్చుకోవాలో తెలియలేదు. పైగా ఒకటి అనగా పది అనుకోమంటాడు. ఒకటిని ఒకటి అనే అనుకోవాలిగాని ఒకటిని పదిఅనీ పాతికనీ ఎందుకనుకోవాలో బోధపడలేదు.

కొన్నాళ్ళకు పంతులుగారు ఇంగ్లీషు చెప్పడం ప్రారంభించారు. ఇంగ్లీషు ఓనమాలు దిద్దపెట్టమంటే ఏబీసీడీ లు దిద్దపెట్టాడు. అదేమిటంటే ఇంగ్లీషులో ఓనమా లుండవన్నాడు! ఇంగ్లీషులో ఓనమాలు లేనేలేవో, అవి ఆయనకు రానేరావోనని ఆరోజున అనుకున్నాను. ఇంగ్లీషులో ప్రాయ

వలసివస్తే నాకు ప్రాణాంతకంగా వుండేది. "పుస్తకం పెట్టెలో వున్నది" అనటానికి మాటలన్నిటికీ ఇంగ్లీషు తెలుసుకొని "Book box in is" అని వ్రాసేవాడిని. పంతులుగారు అది తప్పు అన్నాడు. ఆయన మొహం నా మొహం ! నేను వ్రాసినదాంట్లో తప్పేమున్నది ?

చిన్నతనంలోకల్లా మరుపురాని విషయం తెల్లవారు జాము పండుగ. అది ఆశ్వయుజ మాసంలో పౌర్ణమి వెళ్ళిన తదియనాడు వస్తుంది. ఆనాడు మా మిత్రచతుష్టయమంటే వ్రాళ్ళోఅందరికీ హడల్. ఒక సారి పండుగ రేపనంగా నేను వెళ్ళి ఎండుపల్లేరు కాయలు ఒక మానెడు ఏరుకొచ్చి భద్రంగా దాచివుంచాను. సుశీలారావు ఒక పెద్దతాళమూ, చెవీ తీసుకొచ్చాడు. మహాలింగం డబ్బాతో ఒక గ్యాలన్ కిరసనాయిలు తెచ్చాడు. కొండయ్యమాత్రం ఏమీ తేలేదు. పండుగనాటి నడిరేయి రెండుగంటలకు నిద్రలేచి మాసాధన పరికరాలతోసహా రావిచెట్టుకింద చేరాం. అక్కడనుంచి సుశీలారావు అజమాయిషీ క్రింద వూరినడుమ నున్న మఱ్ఱి చెట్టు క్రిందికి పోయాం. చీకటి దట్టంగా అలుముకున్నది. ఆడపిల్లలు ఊగటం కోసం పది పదిహేను ఉయ్యాలలు గత సాయంకాలమే చెట్టు కొమ్మలకు వేయబడి వున్నాయి. నే తెచ్చిన మానెడు పల్లేరుకాయలూ చెట్టుకింద దట్టంగా చల్లాం. ఇక బయలుదేరి మరునాటి ఉదయం పల్లేరుకాయలు

నిర్వహించబోయే పాత్ర గురించీ, అవి గుచ్చుకుంటే జరుగ బోయే నాట్యభంగిమలను గూర్చీ ఊహించుకుంటూ మా వీథిబడి పంతులుగారింటికి పోయాం.

ఇంట్లోనుంచి గండుపిల్లులు కొట్లాడుకున్నట్లు పంతులు గారియొక్క, వారి సతీమణియొక్క గురకలు ఉచ్ఛస్థాయిలో విన వస్తున్నాయి. సుశీలారావు తలుపు దగ్గరకు వెళ్ళి బయట గొళ్ళెంపెట్టి తెచ్చిన తాళం కాస్తా దానికి వేశాడు. తాళం పడిందో లేదోనని బాగా లాగి చూచాడు. తాళం పడ్డట్లు బాగా నమ్మకం కుదిరినమీదట మరునాడు తలుపుతీయించు కోటానికి పంతులుగారు ఎంత తలక్రిందులు కావాలో తలచుకుంటూ వస్తున్నాం. ఆయన ఇంటికి వేరేదొడ్డివాకిలి లేకపోవటం మా ప్రయత్నానికి దిగ్విజయం సమకూరుస్తుంది. బహుశా ఆయన బాదంచెట్టు ఎక్కి వీథిలో పోయేవాళ్ళను 'నాయనా్నయన' అని బతిమలాడి దగ్గరకు పిలిచి తాళం పగులకొట్టించుకుంటాడులెమ్మని మహాలింగం అన్నాడు.

సరేననుకొని మావూరి పంచాయితీబోర్డు ప్రెసిడెంటు గారి దొడ్డివాకిలి దగ్గరకు వచ్చాం. ఈ ప్రెసిడెంటుగారు గ్రామంమీద ఏడాదికి అయిదువేల రూపాయల ఐవేజు వస్తున్నా ఒక్క రోడ్డునైనా బాగుచేయించిన పాపానపోలేదు. ఒక్కనుయ్యైనా పూడిక తీయించడు. బొజ్జమాత్రం పున్నమి నాటి చంద్రునిమాదిరిగా ఊరుతోంది. సుశీలారావు ఇత

నికి తగిన శాస్తి చేయదలచి మహాలింగాన్ని ప్రయోగించాడు. అతను హనుమంతుని మోస్తరుగా ఒక్క ఎగురు ఎగిరి దొడ్డిగోడను దాటి ప్రెసిడెంటుగారి దొడ్లోకి వెళ్ళి ఆ గ్యాలన్ కిరసనాయిలూ మంచినీటిబావిలో కుమ్మరించి మరుక్షణంలో వచ్చి మమ్మల్ని కలుసుకున్నాడు. సుశీలారావు మహాలింగాన్ని మెచ్చుకున్నాడు. మరునాటి ఉదయం ప్రెసిడెంటుగారు నలుగురు కూలివాళ్ళను పెట్టి బావిలోని నీరంతా తోడి పారపోయించటంవల్ల ఆ నలుగురికైనా కూలి గిట్టుబాటు అయిందనుకోండి.

ఇహ అక్కడనుంచి మేం నలుగురమూ ఎవరింటికి వాళ్ళం వెళ్ళి ఉదయం ఎనిమిది గంటలదాకా నిద్రపోయాం. మరునాడు ప్రతివాడూ మమ్మల్ని ఆడిపోయటం ఆరంభించాడు. ఎంతమంది తిట్టారో చెప్పలేం. అలాంటివాళ్ళకు మా అందరిపక్షానా సుశీలారావే జవాబిచ్చాడు.“అయ్యో! మేం నిద్ర లేచిందే ఇప్పుడుగదండీ ! మేం ఎలా చేస్తాం ఈ పాడుపనులు. అయినా బావిలో కిరసనాయిలూ ఇంటికి తాళమూ వెయ్యటానికి మాకు ఎవరితోనూ విరోధం లేదే. తుంటరివెధవ లెవరో చేసివుంటారు. నేనారాతీసి బయటకు లాగుతాలెండి” అన్నాడు.

---

# పరీక్షల విధి !

మా వెంకటాద్రిమామయ్య మాకు దాపులోవున్న తిమ్మాపురం అనే వూళ్ళో ఒక హైస్కూలు స్థాపించి ఆ కమిటిటీకి తానే అధ్యక్షుడుగా ఉంటున్నాడు. బోడిపాలానికి తిమ్మాపురం రైలుమీద ఎనిమిదణాల దూరం. రైలు స్టేషను మాకు ఆమడదూరంలో వున్నది. బస్సయితే ముప్పావలా దూరం. బస్సు దిగేచోటు మాకు ఆరుమైళ్లుంటుంది. నడిచిపోతే 30 మైళ్ళు వుంటుంది. కాలువలూ డొంకలూ దాటుకుంటూ పోవాలి. తిమ్మాపురం పెద్ద గ్రామంగానూ, చిన్న బస్తీగానూ వుంటుంది. హైస్కూలు స్థాపించినప్పటినుంచి ఆవూరు కాస్త పరిగణకు వచ్చింది. ఒక సినిమాహాలు, రెండు మూడు కాఫీహోటళ్ళు గూడ ఏర్పాటయినయ్. ఇపుడిది ఖాయంగా బస్తీ అయింది.

మామయ్యగారిది సొంతహైస్కూలు కావడంవల్ల పరీక్షలతోటీ మార్కులతోటీ నిమిత్తం లేకుండా చదువు పూర్తి చేయవచ్చుననే సదభిప్రాయంతో నేనూ, నా మిత్రులమూ కలిసి తిమ్మాపురం వెళ్ళాము. ఫలానా బోడిపాలెం మునసబుగారి తాలూకువాళ్ళమని తెలిసి హెడ్‌మాస్టరు మమ్మల్నే అడిగాడు ఏ క్లాసులో చేరుతారని. ఎద్దునడిగి గంతకట్టినట్లుగా వున్నదీ ప్రశ్న. రెండోఫారంలో చేరుతామని చెప్పాం. సరే క్లాసుకుపోయి కూర్చోమన్నాడాయన!

బోడిపాలెం వీధిబడిలో ఐదోతరగతి పూర్తి చేసిన మేము ఒకటో ఫారం చదవకుండా రెండో ఫారంలో చేరటం నామటుకు నాకు రూపాయి వస్తువు పావలాకు కొన్నంత ఆనందం కలిగించింది. సుశీలరావు డబుల్ ప్రమోషన్ అయి నంతగా సంతోషపడ్డాడు. మహాలింగానికీ వెంకటేశానికీ బరువు తెలియని ఆనందం కలిగింది.

హైస్కూల్లో ఓం ప్రథంగా అడుగుపెట్టగానే హెడ్ మాస్టరుగారి గదిముందు "ధర్మంచర-సత్యంవద" అని వ్రాసి వున్నది. సుశీలరావు నడిగాను ఈ మాటల భావమేమిటని. ధర్మం చెరపెట్టబడును, సత్యం వధింపబడును అని ఠకీమని అర్థం చెప్పాడు ! చాల రోజులవరకు అదే అర్థం నా మన సులో మెదలుతుండేది.

హైస్కూల్లో చేరిన కొత్తలో వేరుశెనక్కాయల తోటీ, ఐస్ ఫ్రూట్లతోటీ, ముంతకింది పప్పుతోటీ సరిపెట్టు కొనేవాళ్ళం. మరమరాలు, సెనగపప్పు, నిమ్మకాయరసం, ఉల్లిముక్కలూ, పచ్చిమిరపకాయలూ కలిపిన మసాలాను ముంతకిందపప్పు అని అంటారు. దాన్ని తిననిజన్మ ఒక జన్మ కాదని మేమునిర్ణయానికి వచ్చాం. నేను బడికైనా పోనిరోజు లున్నాయి గాని ముంతకిందిపప్పు తిననిరోజులు లేవు. దాన్ని చూస్తుంటేనే నోరు వులిసేది. ఎప్పుడు ఒంటేలుబెల్లు కొడ

తారా ఎప్పుడు దాన్ని నోట్లో వేసుకొని కొరుకుతూ నీళ్ళు తాగుదామా అనిపించేది.

ఇలా ఒక ఏడాది గడిచేసరికి ఈ తినుబండారాలన్నీ స్వల్పమైనవాళ్ళు తినేటువంటివనీ, కాస్త ఆత్మగౌరవమూ అదీ ఉన్నవాళ్ళు కాఫీక్లబ్బుల్లో కుర్చీలమీద కూర్చొని తినవలసిందేగాని బటానీలూ మరమరాలూ తినటం మర్యాదకు భంగకరమనీ అనుకున్నాం.అందుచేత మూడో ఫారంలో చేరినప్పటినుంచీ నేనూ సుశీలారావూ కలిసి కోమల విలాస్ లో ఖాతా పెట్టాం. ఆపాడు కాఫీ ఉప్పూ కారం లేకుండా, పులుపూ తీపీ లేకుండా, ఒక వెధవరుచితో వుంటుంది. పైగా నాలిక చుర్రుమనే వేడికాఫీ తాగితేనే తాగినట్లుట. దీనికంటె ఆ ఐస్ ఫ్రూటూ, ముంతకిందపప్పూ శతవిధాల నయంగా కనపడింది నా మనసుకు. సుశీలరావు కాదన్నాడు. కాఫీ తాగనివాణ్ణి మనిషిగా లెక్కకట్టరనీ, పల్లెటూరిముఖం అంటారనీ చెప్పాడు. అందుచేత విధిలేక కాఫీ అలవాటు చేసుకున్నాను.

కొండయ్య మిరపకాయ బజ్జీలను తప్ప మరి వేటినీ చస్తే ముట్టనని శపథం చేశాడు. మహాలింగం వేరుసెనక్కాయలను వదలిపెట్టలేదు. నేనూ సుశీలరావూ కాఫీ లేకుండా బతకటం దుర్లభమనే నిర్ణయానికి వచ్చాం. సుశీలారావు డబల్ హాట్ డబల్ స్ట్రాంగ్ కాఫీని గడగడ తాగడం ప్రాక్టీసు

చేశాడు. కోమలవిలాస్ యజమాని నటేశ మొదలియార్ మా ఆ ప్తకోటిలో చేరిపోయాడు. బడిలో జీతంకట్టడంకోసం తెచ్చిన డబ్బులు బడిదాకా చేరకపోవటం, ఏడాదిచివరకు ఇంటికి కబురు వెళ్ళటం జరుగుతుండేది.

తిమ్మాపురంలో చదివేకాలంలో మేము కొన్ని నాట కాలుగూడ వేశాం. వాటికి టిక్కెట్లూ అవీ లేవు గనుక వీని నాటకాలని చెప్పినా ఫరవాలేదు. సుశీలారావు డైరెక్టరు గానూ యాక్టరుగానూ వుండేవాడు. నాకు ప్రేక్షకులముందు నిలబడటం అంటే తగనిభయం. కాళ్లువణికి, కళ్ళుతిరిగి కూల బడేవాణ్ణి. వందలాది జనంలో ఎవరిముఖం చూస్తూ మాట్లా డాలో తెలిసేదికాదు. అందుచేత నేను ప్రాప్టరుగాను తెర లాగే పనిమీదను వుండేవాణ్ణి. ఒకసారి "శశిరేఖాపరిణయం" నాటకం వేశాం. కొండయ్య ఘటోత్కచుని పాత్ర అత్యద్భు తంగా నిర్వహించాడు. శశిరేఖ వేషంలో వున్న మహాలిం గాన్ని అమాంతం ఎత్తుకొచ్చాడు. సుశీలారావు అభిమన్యుడి పాత్రవేసి శశిరేఖను వివాహమాడాడు. కొండయ్య ఈ నాటకంలో కలిగిన అనుభవాన్ని తరువాత చక్కగా విని యోగించుకొని గాంధర్వ వివాహం చేసుకున్నాడు. సుశీలా రావు ప్రేమించి పెళ్ళి చేసుకోవాలని వాదించడమారంభించి ఒక హైస్కూలు అమ్మాయితో ఉంగరాలు మార్చు కున్నాడు. నాకు మాత్రం ప్రజానీకం ముందు నిలబడటానికి తెర లాగేపని తర్ఫీదు నిచ్చింది.

హైస్కూల్లో ఉపాధ్యాయులనుంచి మేము నేర్చుకున్నవంటూ అంతగా లేవు. కొంతమంది మేష్టర్లు మమ్మల్ని చూచివుండరుగూడాను. మాకు ఆ ప్తమిత్రుడు డ్రిల్లు మేష్టరొక్కడే.

హైస్కూలు చెడుగుడుటీములో మేమునలుగురమూ వుండేవాళ్ళం. సుశీలారావు నేర్పుగా పాయింటు తెచ్చేవాడు. ఇటు చూపించి అటు కొట్టి వచ్చేవాడు. మహాలింగం పొడుగాటి వాడవటంవల్ల నేలమీద అడ్డంగా పడి గీతను తాకేవాడు. కొండయ్య అవతల టీములో బాగా ఆడేవాడి కాలో చెయ్యో విరగ్గొట్టేవాడు. దాంతో అవతల టీము బలహీన మయ్యేది. నేను మాత్రం పాయింటు తెచ్చే వాణ్ణీకాదు, ఇచ్చే వాణ్ణీకాదు. మేం చదువుతున్నంతకాలం జిల్లాలో మా టీము గెలుస్తూవుండేది.

ఇలాంటి మేము పరీక్షలు ఎలా ప్యాసవుతూ వచ్చామనేది సామాన్యులకు తోచే ప్రశ్న. వెంకటాద్రిమామయ్య కమిటీ అధ్యక్షుడవటంవల్ల మాక్కులతో నిమిత్తం లేకుండా పైతరగతిలోకి పోయేవాళ్ళం. స్కూలు ఫైనలు మాకొక దుర్భేద్యమైన కోటగోడలా కనిపించింది. అయినా మేము నిరాశ చెందలేదు. ఔరంగజేబు గోల్కొండకోట జయించవలసివచ్చినపుడు కాపలావాణ్ణి తృప్తిపరచి లోపల ప్రవేశించాడని పుస్తకాల్లో చదివాము. ఎలాగైతేనేమి గోల్కొండ

జయించాడు... మేము స్కూలు ఫైనలు పరీక్షలప్పుడు ఒక సహకారోద్యమం లేవదీశాం. పరీక్షల్లో నెగ్గటం సందేహాస్పదంగా వున్న ప్రతి విద్యార్థి దగ్గరనుంచీ తలా వందరూపాయల చొప్పున "పరీక్షలనిధి" వసూలుచేశాం. నేనుమాత్రం రెండు వందలిచ్చి అందరికీ మార్గదర్శకుడనైనాను. మొత్తం మూడువేల రూపాయలు వసూలయింది. పరీక్షలకు ఇతర వూళ్ళనుంచి పదిమంది వాచర్లు రాగా, ఎవరివంతు వాళ్ళకు న్యాయంగా ఇచ్చివేశాం. కోమల విలాస్‌లో ఏమి పుచ్చుకున్నాసరే ఉచితం అని చెప్పాం. పరీక్షహాల్లో కూచొని చదువుకోటానికి తలా రెండుచక్కని నవలలుకొనియిచ్చాం. ఇక పరీక్షలకు వచ్చే ప్రతి విద్యార్థీ బళ్ళోకి వస్తున్నట్లుగా టైమ్‌టేబులు ప్రకారం పుస్తకాలూ అవీ తెచ్చుకొని పరీక్షలు వ్రాశాడు. పరీక్షల్లో మా హైస్కూలులో నూటికి 98 మంది ప్యాసైనారని అందరూ మా హెడ్‌మాష్టరును మెచ్చుకున్నారు. ఆ తప్పినవాళ్లు సుస్తీచేసి పరీక్షకు రాని రకమన్న మాట. ఏడాది పొడవునా దీపం బుడ్డిముందు కూర్చొని చదివినవాళ్ళకూ మాకూ ఫలితంలో మాత్రం తేడాలేదు !

---

# మంత్రోపదేశం

ఒకనాటి సాయంకాలం వూరివెలుపల కాలవ గట్టున మామిడిచెట్టు నీడలో నలుగురమూ కూచొనివున్నాం. కొండయ్య చెట్టెక్కి నాలుగు మామిడికాయలు తెంచు కొచ్చాడు. మహాలింగం జేబులోనుంచి మెల్లగా ఒక నూరిన ఉప్పుపొట్లం, ఒక ఎండుకారం పొట్లం తీసి బయటపెట్టాడు. సుశీలారావు చాకుతో మామిడికాయల్ని సన్న సన్నని ముక్కలుగాతరిగి నలుగురికీ అందేటట్లు మధ్యలోవుంచాడు. ఒకరినొకరు దిండుగా చేసుకొని నలుగురమూ సడుములు వాల్చి మామిడి ముక్కల్ని ఉప్పూకారంలో పొర్లించి నోట్లో జారవిడిచి చప్పరిస్తూ నములుతూ, నోస్తూ కొట్లలు వేస్తూవున్నాం. నోటిలో నీళ్లు వూరుతూనే వున్నాయి. పళ్లు పులుస్తూనే వున్నాయి. తినడం మాత్రం ఎవరూ ఆపలేదు. గాలి రంయ్ మని వీస్తున్నది. సుశీలారావు కాలరు రెప రెప చెంపకు వచ్చి కొట్టుకుంటున్నది. కొండయ్య జుట్టు వచ్చి కళ్ళమీద పడుతున్నది. నామనస్సు సముద్ర కెరటాల్లాగ తలలో తాను "డాషి"చ్చు కుంటున్నది.

సుశీలారావు ఉపక్రమించాడు. "అబ్బాయిలూ! ఏదోవిధంగా మనం స్కూలు ఫైనలు దాటివేశాం. ఇహ అందరిమాదిరి గొర్రెదాటు మోస్తరుగా ఏ కుంభకోణమో వెళ్ళి ఎఫ్.ఏ.లో ప్రవేశించుదామంటారో లేక ఇంతటితో మంగళహారతి పాడుదామంటారో తెమల్చండి. ఐతే ఒక్క మాట, ఏ పని చేసినా అందరం కలిసి కట్టుగా వుండాలిగాని

ఒకవు చదవడం, మరొకవు నౌకరీ అఘోరించటం, ఇంకోవు కుండల్లో గుత్తాలు తోలుతూ ఇంటి పట్టునకూచోటం- ఇలా చెట్టుకొక పిట్టగావటం మాత్రం నాకు సుతరామూ ఇష్టం లేదు. మునిగినా తేలినా నలుగురం ఒక్కచోటనే తడవాలి. ఇది నా ఉద్దేశం. ఇహ మీరు ఏం చెప్పదలచారో చెప్పండి" అని వూరుకున్నాడు.

కాసేపు నిశ్శబ్దం. తరువాత నువ్వు చెప్పమంటే నువ్వు చెప్పమనుకొని ఆఖరుకు కొండయ్య అందుకున్నాడు; "అరేయ్! మనకు వంటబట్టే లక్షణాలు గనుక ఏడిస్తే చదివినా ఫలంపాటు. ఈ వెధవ స్కూలుఫైనలు కే పితృదేవతలు దిగొచ్చారు. ఊతడవకు గట్టునపడ్డాం. వ్యవహారం కామెడీగా అంతమయింది. ఇదే గనుక ట్రాజడీ అయినట్లయితే తట్టా బుట్టా బుజానవేసుకొని కొంపకు చేరుకోవలసివచ్చేది. ఏమో మరి, మీా ఉద్దేశం ఎలావున్నా నేనుమటుకు చదవదలచలేదు. ఆ తరువాత మీా ఇష్టం" అన్నాడు. మహాలింగం 'తథాస్తు' అన్నాడు లేచికూచొని. నేను డిటోఅన్నాను.అదీగాక ఇద్దరు చెప్పిన మాటను కాదనడంగూడ భావ్యం కాదనుకున్నాను.

సుశీలారావుకు మనసులో చదవాలనేవుంది. ఒకవేళ చదివితే పరమపద సోపానపటంలో నిచ్చెన లందుకొని పాకిపోయినట్లు పరీక్షలు అల్లుకుంటూ పాసైపోగలడు. కాని చదివి బావుకు తినేదేమిటి డబ్బుదండగతప్ప!మహాత్ములంతా

డిగ్రీలవల్లనే గొప్పవాళ్ళయినారా! సహనం అనేది మనిషిలో వుండాలిగాని కాగితంముక్కలో ఏముంటుంది నల్లగీతలుతప్ప! అదీగాక మేము ముగ్గురం మిత్రులమూ చదవం అని మూతి ముడుచుకొని కూచుంటే సుశీలారావు ఒక్కడే బుజా లెగ రేసుకుంటూ కాలేజీలో చేరితే మటుకు వాడికి ఒక్కక్షణం తోస్తుందీ? ఒడ్డునపడ్డ చేపలాగ గిలగిల కొట్టుకోడూ ! ఏమోమరి. సుశీలారావు గూడ చదువుకు నామాలు దిద్ది మా మిత్రమండలికి నాయకత్వం వహించటానికిసిద్ధమైనాడు.

ఇహ చదవకపోతే ఏం చెయ్యాలి! మళ్ళీ మా వూరు పోయి ఎడ్లను ఛో ఛో అంటే పరువు కాస్తా దిబ్బకొట్టుకు పోదూ? ఆరునెలలు సాముచేసి మూసలిముండను చావబాది నట్లు ఇంత చదువూ చదివింది పగ్గాలు పుచ్చుకోడానికా? బొందిలో ఊపిరుండగా అంత అవివేకపు పని చెయ్యకూడదని నలుగురమూ ఏకగ్రీవంగా నిర్ణయించుకున్నాం.

మంత్రులకూ ప్లీడర్లకూ వుండవలసినబుద్ధి మా సుశీలా రావుకున్నది. వాడుగనుక పై చదువు చదివితే జడ్జీయో, కలె క్టరో అయ్యేవాడు. అతను నా భవిష్యత్కార్య క్రమాన్ని ముక్తసరిగా ముందుపెట్టాడు. "ఇదుగో వెంకూ! నీకు తిన టానికీ మరొకరికి పెట్టటానికీ చాలినంత వున్నది. ఇంకా రెండు తరాలవరకు నీ ఆస్తి పుష్కలంగా సరిపోతుంది. అలాంటివాడవు అందరిలాగ చిన్నినాబొజ్జకు శ్రీరామరక్ష

అన్నట్లు తిని తిరగడమే వృత్తిగా పెట్టుకోక ప్రజలకు సేవ చేయాలని ఎందుకనుకోకూడదూ? పదిమందీ నీపేరు గుర్తుంచుకొనేటట్లు ఎందుకు యత్నించకూడదూ ? "ఓ" అంటే "నా" రానివాళ్లుగూడ అధికారంలో ప్రవేశించి స్వారిచేస్తున్నారుగదా ! మనంమటుకు ప్రజల దగ్గరికి ఎందుకుపోగూడదూ? ఇది బుద్ధిమంతులు చేసే పనేగాని దుష్టకార్యం కాదు. అధికారం గనుక లభిస్తే నువ్వు మన వూళ్ళో రోడ్లు వేయించవచ్చు. చెరువులు తవ్వించవచ్చు. వంతెనలుకట్టించవచ్చు. ఆసుపత్రులు లేవదీయవచ్చు. ఫలానా పెద్దమనిషి చేయించాడని ప్రజలు అనుకుంటారు. మేము ముగ్గురమూ లక్ష్మణ, భరత, శత్రుఘ్నులలాగ నీకు చేతోడువాదోడుగా వుంటాం. నీవు మాత్రం ప్రజాసేవ చెయ్యడం కోసం నిర్ణయం చేసుకో" అన్నాడు.

అతని సలహా నా మనసుకు నచ్చింది. ధన సంపాదన కోసం ఎలాగూ తంటాలుపడ నవసరంలేదు గనుక పొరుగువాళ్ళకు ఇంత ఉపకారం కలిగించడంకోసం నేను పాటుపడటమే సమంజసం అని నాకు తోచింది. నలుగురమూలేచి నిలబడి గుడ్డలు దులుపుకొని ఇళ్ళ ముఖం పట్టాం.

ఏమనుకున్నాడో ఏమోగాని సుశీలారావు తిమ్మాపురం నుంచి అడపాతడపా పత్రికలకు వార్తలు పంపుతూ 'పత్రికా విలేఖరి' అని వాకిలిముందు చెక్క కొట్టించుకు

న్నాడు. మహాలింగం ఒక మేడమీద జానెడు గది అద్దెకు తీసుకొని 'రాత్రింబవళ్ళు ఫొటోలు తీయబడును." అని బోర్డు వేలాడగట్టాడు. కొండయ్య జరాసంధ వ్యాయామమండలిని స్థాపించి ఒక తాలింఖానా పెట్టి కుఱ్ఱవాళ్ళను కండలు తిరిగేట్లు తయారుచేస్తున్నాడు. వాళ్లు అప్పుడప్పుడు బలం పరీక్షించుకుంటూ వుంటారు. నేనుమాత్రం 'తిమ్మాపురం సినిమా ప్రేక్షకుల సంఘం' అనే దాన్ని స్థాపించి అధ్యక్షుడుగా వుంటున్నాను. దాని కార్యదర్శి సుశీలారావే.

ఈ విధంగా ఒక ఏడెనిమిది నెలలపాటు మా కార్యకలాపాలు నడుపుకుంటూ వచ్చాం.

---

## "గూడుపుఠాణీ" శతదినోత్సవం

ఊళ్ళోకి "గూడుపుఠాణీ" సినిమా వచ్చింది. జనం వేలం వెఱ్ఱిగా వెళ్ళిచూస్తున్నారు. రోజూ మ్యాట్నీ వేస్తున్నారు. మొదటి పదిరోజులూ రోజుకు నాలుగాటలు కూడ వేశారు. పల్లెటూళ్ళ జనం బళ్లు కట్టుకువచ్చి చూసి పోతున్నారు. బొందిలో ప్రాణంవున్నంతవరకు సినిమాలు చూడమని ఒట్టు పెట్టుకున్న వాళ్లు కూడ వచ్చి చూశారట. అందులో కథ ఏమీ లేదు మాటలకంటె పాటలూ, పాటలకంటె డాన్సులూ

హృదయాలను లాక్కుంటున్నాయి. డాన్సు చేసిన ఆవిడ పేరు విలాసిని. కథానాయకుడుగా నారాయణరావు అమోఘంగా నటించాడు. శంభులింగం కడుపుబ్బ నవ్వించాడు. తెర వెనుక పాటలు పర్ణశాల వారివి.

"గూడుపుఠాణీ" 100 రోజులు కష్టపడి ఆడింది. చిత్రం శతదినోత్సవం చేసుకో దలచిందని సుశీలారావు ముందుగా ఆఘ్రాణించాడు. సినిమా ప్రేక్షకసంఘం తరఫున అతను పై వాళ్ళకు రాసి ముందు ఏర్పాట్లు చేశాడు. ఉత్సవం మేము జరిపేటట్లు, ఆ తరువాత డిస్ట్రిబ్యూటర్లు మా ప్రేక్షక సంఘానికి 1000 రూపాయల నిధి నిచ్చేటట్లు ఒప్పదం కుదిరింది. మా మటుకు మాకు రూపాయలసంచి దొరికినంత సంతోషం కలిగింది. క్షణం తీరిక లేకుండా శతదినోత్సవం కోసం భారీఎత్తున ఏర్పాట్లు ఆరంభించాం.

శతదినోత్సవ సభకు సుశీలారావు ప్రోద్బలంమీద నేను అధ్యక్షుడుగా వుండటానికి ఒప్పుకోక తప్పిందికాదు. నేను ఇదివరలో పదిమంది ముందు నిలబడి మాట్లాడినవాణ్ణి కాను. అమాంతం ఒక్కసారి వేలాది ప్రజలయెదుట నిలబడటం నాకొక అగ్నిపరీక్షగా పరిణమించింది. పల్లెటూరిమనిషి ఇంజక్షనఅంటే ఎలా కంగారు పడతాడో నేనంత గాభరాపడ్డాను. ఈ పని మరెవ్వరికైనా వప్పగించమని సుశీలారావును ప్రాధేయపడ్డాను. అతను నా మొర ఆలకించలేదు. సుగ్రీ

వాజ్జలా నన్నుదబాయించి ఒప్పించాడు. ఆ సమయానికి ఏ జ్వరమైనావస్తే బాగుండు ననిపించింది. కాని లాభం లేక పోయింది. సుశీలారావు ఒక పావుతావు కాగితంమీద ఒక ప్రక్క నాలుగు వాక్యాలు చిన్నచిన్నవి వ్రాసియిచ్చాడు. వాటిని నోటికి వచ్చేట్లు చదివి అధ్యక్షోపన్యాసంగా చెప్ప మన్నాడు. ఆ సభలో ప్రజలందరి వంకాచూస్తే గుండె దడ పుడుతుందనీ, అలాచేయక వేదికముందరనే మన కొండయ్య మహాలింగం కూచుంటారనీ, వారిద్దరి ముఖాలు చూస్తూ – సభలో వారు తప్ప మరెవ్వరూ లేరనుకొని మాట్లాడేయ మనీ బోధించాడు.

శతదినోత్సవం నాటి మధ్యాహ్నం నారాయణరావు, విలాసిని, శంభులింగంగార్లు కుంభకోణం నుంచి చిన్న కాపు వేసుకొని మావూరువిచ్చేశారు. నేనూ సుశీలారావు ఇత్యాది వాళ్ళం ఎదురెళ్ళి పూలమాలలతో సత్కరించి తీసుకు వచ్చాం. సుశీలారావు నన్ను వాళ్ళకు పరిచయం చేశాడు. వాళ్ళతో వ్యవహరిస్తుంటే నామటుకు నాకు భూమికి అడుగు న్నర ఎత్తున నడుస్తున్నట్లుగా వుంది. విలాసిని ముఖం సిని మాల్లో వున్నంత అందంగాలేదు. మిగతా ఇద్దరి ముఖాల లోనూ తెచ్చుకున్న అందం చాలా వుంది. వాళ్ళు కారు దిగంగానే కొండయ్య ద్రాక్షరసం అందించాడు. శంభులింగం మాత్రం జంకులేకుండా మరో గ్లాసు తెప్పించమన్నాడు. మహాలింగం గబగబా వాళ్ళను ఫొటోల్లో దింపివేశాడు. ఒక

పాతిక ముప్ఫైమంది స్కూలు ఫైనల్ విద్యార్థులు నోటు బుక్కులుపుచ్చుకొని ఆటోగ్రాఫులకోసం ఎగబడ్డారు. సుశీలా రావు వాళ్ళను దగ్గరకుపిలిచి సాయంకాలం మూడుగంటలకు రమ్మని సముదాయించి పంపివేశాడు. ఊళ్ళో పురప్రముఖుల ఇళ్ళనుంచి బూరుగుదూది పరుపులు ప్రత్యేకంగా తెప్పించి అతిథులకు వప్పగించాం. అతిథులు విశ్రమించారు.

ఆరోజు హైస్కూలుగూడ మూసివేశారు. సినిమా హాలుకు నాలుగువైపులా ఫర్లాంగు మేర రంగుకాగితాలతో అలంకరించాం. రెండుమూడు వేలమంది పట్టే హైస్కూలు గ్రౌండ్సులో పెద్దవేదిక తయారుచేయించి బహిరంగ సభ ఏర్పాటు చేశాం. సాయంకాలం ఐదుగంటలకు వూళ్ళోవున్న రిక్షాలూ, గుఱ్ఱబ్బళ్లు, ఎద్దుబళ్లూ అన్నీ హైస్కూలు ఆట స్థలానికే పరుగులు తీస్తున్నాయి. వెళ్లేబళ్లేగాని వచ్చేబళ్లులేవు. ముసలీముతకా, సిన్నా పెద్దా ఇత్యాది యావన్మందీ చేతు లూపుకుంటూ వస్తున్నారు. జనం నడవడం కంటె ఎక్కువ వేగంతోనూ పరుగెత్తడం కంటె తక్కువ వేగంతోనూ "దొర్లుడు నడక"తో పోతున్నారు. ఊళ్ళోని పెద్ద పెద్ద వాళ్ళంతా అరగంట ముందుగానే వచ్చి కుర్చీలను భర్తీ చేశారు. తాసిల్దారు, సర్కిల్ ఇన్‌స్పెక్టరు, పోస్టుమాస్టరు, స్టేషన్‌మాస్టరు, హైస్కూలు హెడ్‌మాష్టరు మొదలైన ప్రముఖులంతా ముస్తాబు చేసుకొని ముందుగానే వచ్చారు.

వేదికమీద నుంచి లతామంగేష్కర్ రికార్డులు గగ్గోలుగా వినబడుతున్నాయి. అయినున్నరకల్లా నటీనటులతో కలిసి వేదికమీదకు వెళ్ళాను. అందరూ గల్లంతుగా చప్పట్లు చరిచారు.

మొదట సినిమా హాలు యజమాని వచ్చి స్వాగత వాక్యాలు పలికాడు. అతని జన్మకిదే శివరాత్రి అయివుంటుంది! హాంసపాదులూ కొట్టివేతలూ చాలా వున్నాయి మాటల్లో. అతనికంటె నేను బాగామాట్లాడగలనని ధైర్యం చిక్కబట్టుకుంటున్నాను. అతని ఉపన్యాసం పూర్తికాక ముందే సభికులలోంచి ఈలలు వినబడుతున్నాయి. ఇక దిగు అని వాటి అర్థం అయివుంటుంది. తరువాత సుశీలారావు వచ్చి నాలుగైదు నిముషాలు మాట్లాడుతూ సభికులకు నటీనటులను, నన్నూ పరిచయం చేశాడు. ప్రతి వాక్యంలోనూ హాస్యం మిళితమైవుండటంవలన సభికులు చేతులు కందేటట్లు హర్షధ్వానాలు చేశారు. విలాసిని, నారాయణరావుగార్లు రాధాకృష్ణుల వలెను, రతీ మన్మథులవలెను మనోహరంగా నటించి చిత్రాన్ని విజయవంతం చేశారని అతడన్నపుడు నటీనటులుగూడ చప్పట్లు కొట్టారు. నన్ను పరిచయం చేస్తూ ప్రజాసేవలో నూతనంగా అడుగుపెట్టిన యువకుడనీ,వయస్సు చిన్నదైనా బుద్ధి పెద్దదనీ అన్నాడు.

తర్వాత నటీనటులు ముచ్చటించారు. తాను చదివిన

హైస్కూల్లోనే తనకు సన్మానం జరగటం తల్లి పుట్టిల్లు మేనమామ దగ్గర పొగిడినట్లయిందని శంభులింగం అన్నాడు. విలాసిని కులుక్కుంటూ మైకుదగ్గరకొవచ్చి అరవ తెలుగులో మాట్లాడుతూ "నాను మీా అందరికీ రొంబ కృతఘ్నురాలను" అని చెప్పికూచుంది. సభలో అంతాఘొల్లుమన్నారు. నారాయణరావు వచ్చి ఆమె అన్న మాటలోని పొరబాటును సవరిస్తూ ఆమె చాలా కృతజ్ఞురాలని వివరించాడు. "గూండు పురాణీ" చేసిన మేమంతా ఇక్కడే వున్నామనీ, మమ్మల్ని పిలిపించినందుకు అందరికీ వందనాలనీ అన్నాడు.

ఆఖరుకు నేను నిలబడి ఇలా ఉపన్యసించాను: "సోదరీ సోదరులారా! ఇక్కడ ఇంతమంది కళమీాద అభిమానం గలవారు సమావేశం కావటం ఆనందకరమైన విషయం. మన గ్రామంలో ఇంతమంది కళావంతులుండటం చాలగర్వించదగ్గ సంగతి. (సభలో చప్పట్లు) "గూండుపురానీ" సినిమా 100 రోజులు ఆడిదంటే దాని ప్రభావం ఎన్నివేలమంది ప్రజల మీాద పడివుంటుందో మనం గమనించాలి. ఈ సభకు ఆహ్వానించగానే వారికి షూటింగు వగైరా ఎన్ని పనులున్నప్పటికీ సందుచేసుకొని మన గ్రామం దయచేసినటువంటి నారాయణరావు, విలాసిని, శంభులింగం గార్లకు మీా అందరి తరఫునా కృతజ్ఞతా పూర్వక వందన సహస్రము లర్పిస్తున్నాను."

సభ జయప్రదంగా ముగిసింది. వేదికమీద రాళ్లు విస రాలనే కుతూహలం ఎవరికీ కలుగలేదు. శరీరానికి ఎలాంటి ముప్పం లేకుండా విలాసిని వగైరాలు రివ్వునకారుల్లో కుంభ కోణం దోవపట్టారు. నా ఉపన్యాసం నాలుగు వాక్యాలే గనుక చెడగొట్టకుండా అనగలిగాను.

ఈ శతదినోత్సవంవల్ల కలిగిన ప్రయోజనంకాస్త వివ రించవలసి వుంది. గ్రామంలోని పెద్దపెద్ద ఆఫీసర్లంతా కింద కుర్చీలలో కూచొని ఆలకిస్తుంటే నేను వేదిక ఎక్కి అధ్యక్ష పీఠం అలంకరించే అవకాశం కలిగింది. ఇందువల్ల నన్ను అనే కులు ఎరిగుండ గలిగారు. దోవనపోతుంటే సబ్ ఇన్స్పెక్టరు కనిపించి "గుడ్ మార్నింగ్" అన్నాడు. రైలుస్టేషన్‌లో టిక్కెట్టుకొందామని వెళితే స్టేషన్ మాష్టరు గదిలోకి తీసి కెళ్ళి కాఫీ తెప్పించి మర్యాద చేశాడు. ఏదో పనిమీద తాసిల్‌దార్ దగ్గరకు పోతే తాను లేచినిలబడి నాకు కుర్చీ చూపించి, నేను కూర్చున్న తర్వాత తాను కూర్చున్నాడు. ఈ విధంగా వూళ్ళో మనకు స్థానబలం ఏర్పడడం ఆరంభ మయింది. వెధవ "గూడుపురాణీ" శతదినోత్సవంలో ఇంత మహిమ వుంటుందని నేను కలలోనైనా అనుకోలేదు!

## హితోపదేశం !

నన్ను నిలుచున్న పాళంగా పిలుచుకు రమ్మని ఒక రోజున మా అమ్మగారు మనిషిని పంపింది. ఆ వచ్చినవాడు నన్ను చిన్నప్పటినుంచీ ఎత్తుకు తిరిగిన గోపయ్య. నన్ను పిలిపించటంలో ఆంతర్య మేమిటని గోపయ్యను అడిగి తెలుసుకొన్నాను. నేను పరీక్షలయిన తర్వాత రికామీగా తిమ్మాపురంలో వుంటున్నానని మాఅమ్మగారికి తెలిసింది. ఈ మధ్య సినిమా ప్రేక్షకుల సంఘంతరఫున సినిమావాళ్ళను పిలిపించి ఉత్సవాలు చేశానని గూడ విన్నదట. నే నేదో సావాసాల వల్ల చెడిపోతున్నా ననుకొని కాస్త దోవలో పెడదామని నన్ను రమ్మనివుంటుందని చూచాయగా గోపయ్య చెప్పాడు.

సమయానికి సుశీలారావు ఊళ్లో లేకపోయాడు. నాకు ఏమీ పాలుపోలేదు. సరే. అమ్మగారిని చూచి వచ్చినట్లూ అవుతుంది; ఆమె మాటమీాద గౌరవంవుంచినట్లూ అవుతుందనుకొని గోపయ్యతో కలసి బోడిపాలెం బయలుదేరి వెళ్ళాను.

చాలాకాలంతర్వాత మా వూరు వెళ్ళటం వల్లనైతే నేమి, మా అమ్మగారికి నేను ఏకైకపుత్రుడ నవటంవల్లనైతే నేమి, నాకు అన్ని మర్యాదలూ యథావిధిగాను, కాస్తఅధికంగాను గూడజరిగాయి. ఆమె నాకు స్వయంగా వడ్డిస్తుతూ ఉమ్మకు నీటితో తలంటిపోసింది. గుత్తివంకాయ కూరతోనూ, నీగడ

పెరుగుతోనూ ఆప్యాయంగా భోజనం పెట్టింది. చెయి కడు క్కొని మూతి తుడుచుకుంటూవచ్చి పడక కుర్చీలో కూచు న్నాను. ఆమె నాకు దగ్గరగా పీటవేసుకొని కూచున్నది.

"నాయనా! వంట్లో వుసులుగా వున్నదా! భోజనం అదీ బస్తీలో సరిగా అమరుతున్నదా ? మరీ మనవూరు రావడం మానేశావేం ? తిమ్మాపురంలో ఏమైనా పను లున్నాయా? నిన్నుచూడాలని కళ్ళు కాయలుకాస్తున్నాయి. అందుకని ఒకసారి వచ్చిపొమ్మని కబురుచేశాను" అన్నది.

నేనేదో తప్పుచేసిన వాడిలాగ గుటకలు మింగుతూ కూచున్నాను. పశ్చాత్తాపంవల్ల కంట్లో నీరుచేరకుండా నిగ్ర హించుకుంటున్నాను. ఇది ఇలా వుండగా నాకు ఆమె చేసిన మర్యాదలవల్లనైతేనేమి, నన్ను పడకుర్చీలో కూచోపెట్టి తాను పీటమీద కూచోటంవల్లనైతేనేమి ఆమె నా మీద నైతికంగా "అధికారం" చెలాయిస్తున్నదని తోచింది. ఏమి జవాబు చెప్పి ఆమె మనస్సువికలం చేస్తానోనని నాకుభయం పుట్టింది. అయినా నన్ను ప్రేమించే తల్లే కాబట్టి పొర బాటు మాట్లాడినాప్రమాదంవుండదు లెమ్మని ఇలా చెప్పాను- "అమ్మా! నా ఆరోగ్యానికి ఎలాంటి లోపమూ లేదు. ఏదో స్నేహితులంతావుండమంటే తిమ్మాపురంలో నేవుంటున్నాను. మా మిత్రులు ఏవో సమాజాలూ, సమితులూస్థాపించి అపు డపుడు సభలూ, సమావేశాలూ జరుపుతున్నారు. వాటి ద్వారా ప్రజలకు సేవచేయాలని మా అభిమతం. అందుచేత

ఆ పనులు చూచుకుంటూ నేనక్కడే వుండిపోయాను. అంతకంటె మరేం లేదు" అని జంకుతూ చెప్పాను.

ఆమె నా మాటలు విని తలవంచి దీర్ఘంగాఆలోచిస్తున్నట్లు కనిపించింది. ఒక క్షణం ఆగి నా వైపుకుమళ్ళి "నాయనా! నేనేమీ చదువుకున్నదాన్ని కాను. నాకీ సమాజాలను గురించి అంతగా తెలియదు. అయినా నీ క్షేమం కోరేదాన్ని గనుక నాలుగు మాటలు నీ చెవున వేస్తాను... నీవు పై చదువుకు పోలేదని నేనేమీ విచారించటంలేదు. ఎందుకంటే మనకు భూమి పుష్కలంగా వున్నది. ఎలా లేదన్నా ఏటా పాతిక వేల ఆదాయంవస్తుంది. తిండికీ గుడ్డకూ యిబ్బంది లేదు. మన యిల్లు నిలుపుకొని పది యిళ్లు నిలుపవచ్చు. అందుచేత ప్రజలకు సేవచేయాలని తలపెట్టడం నాకు అత్యంత ఆనందకరమైన విషయం.

కాని నాయనా! నీవు ప్రజాసేవ కోసం సమాజాలూ సమితులూ స్థాపించానని చెప్పావు. వాటి తరఫున సభలు జరుపుతున్నానని గూడ చెప్పావు. ఆ విషయమే నా కర్థం కావడంలేదు. సభలు జరపడంవల్ల ప్రజలలో పలుకుబడి రావచ్చు. నిన్ను అందరూ కీర్తించవచ్చు. పదిమందికి నీవు ఎరుక కావచ్చు. అంతేకాని ప్రజలకు అందువల్ల సేవ ఎలా జరుగుతుందో నాకు తెలియటంలేదు. ఏ ప్రజకు ఇందువల్ల వాళ్ళ బాధలనుంచి రక్షణ కలుగుతుందో అర్థమవటం లేదు". అని సున్నితంగాను సరళంగాను నన్ను ప్రశ్నించింది.

ఆమె వేసిన ప్రశ్న నాకూ ఒక ప్రశ్నగానే తయారయింది. సమయానికి సుశీలారావు లేకపోయాడే అని నాలిక కొరుక్కున్నాను. కించిత్తు బాధపడ్డాను. నాకు తోచిన జవాబు చెప్పటం నా ధర్మ మనుకొని ధైర్యం చేసి యిలా అన్నాను.

"అమ్మా! నాకు కూడ నీవడిగిన ప్రశ్నకు తగు సమాధానం తోచడంలేదు. నా స్నేహితు లందరూ కలిసి ఏవో ప్రయత్నాలు చేస్తున్నారు గనుక నేను వారికి చేదోడు వాదోడుగా వుంటున్నాను. బహుశా ఈ విధంగా సభల ద్వారా ప్రజలలో పలుకుబడి గనుక సంపాదిస్తే తర్వాత సులభంగా పంచాయతీ బోర్డులాంటి వాటిల్లోకి ఎన్నుకోబడి అధికారంలోకి రావచ్చునని మా మిత్రుల వుద్దేశం అయి వుంటుంది. అలా అధికారంలోకి వచ్చిన తర్వాత ప్రజలకు ఉపయోగకరమైన అనేక పనులు చేయవచ్చునని వాళ్ళ భావం కావచ్చు" అని చెప్పివేశాను.

మా అమ్మ మళ్ళీ కొద్ది క్షణాలు ఆలోచనలో పడింది. తరువాత నావంకకు తిరిగి "వెంకూ! నీ ఆలోచనయే బహుశా నీ స్నేహితుల ఆలోచన గూడ అయివుంటుంది. ఇదంతా పంచాయితీ బోర్డులో ప్రవేశించటానికే అనువుగా వున్నది. ఆ విధంగా అధికారంలోకి పోవచ్చునని నేనుకూడ అనుకుంటున్నాను...కానినాయనా! అధికారంలోకి పోవటం అనేది చాలా సంకటాలకు కారణ మవుతుంది. ఒకసారి

అధికారంలోకి పోయినవాడు ఆపదవిని నిలుపుకోటంకోసమే తన శక్తియుక్తుల్ని వ్యయం చేస్తాడు. అంతేగాని ప్రజాసేవ చేయగలుగుతాడని నేననుకోను. ఒకవేళ ప్రజాసేవ చేయాలనే కోరిక వున్నప్పటికీ అతనికి అందుకు తగుసమయంగాని, అవకాశంగాని లభించదు. అదీగాక అధికారంసజ్జనులనుగూడ కల్మషపరుస్తుందని మా నాన్నగారు అంటుండేవారు..."

కొద్దిసేపుఆగి మళ్ళీ ప్రశ్నించింది. "వెంకూ! ఇంతకూ నీ ఆశయం అధికారంలోకి పోవడమా లేక ప్రజాసేవ చేయడమా? నిశ్చితంగా చెప్పు తెలుసుకుంటాను"అని అడిగింది.

నా మీద పిడుగుపడ్డంతపని అయింది. ప్రశ్నించటం అయిపోందేమో ననుకుంటే ఇంతకుముందు అడిగిన దానికంటె క్లిష్టమైనసమస్యనే నా మీదప్రయోగించింది. అసలు రహస్య మేమంటే ఏదో సుశీలారావు నడవమంటే నడుస్తున్నానుగాని అధికారంగురించీ ప్రజాసేవగురించీ నా కంతగా తెలియదు. ఇవి రెండూ వేర్వేరు విషయాలని అసలు నేననుకోవటంలేదు. అధికారం గలవారే ప్రజాసేవకులనీ, ప్రజాసేవకులే అధికారంలో వున్నారనీ నా అంచెనా. కాని మా అమ్మగారు వీరిద్దరినీ విడదీసి మాట్లాడడంవల్ల నా కేమి చెప్పటానికీ తోచలేదు.

నా కేమీ తెలియదనటం గూడ శ్రేయస్కరంగా కన్పించలేదు. ఏదో ఒక జవాబు చెప్పటమే ఉత్తమం అని పించింది. ఐనా ఏం జవాబు చెప్పాలి?... కాస్త ఆలోచించి

చూస్తే "అధికారం" అనే మాటకంటె "ప్రజాసేవ" అనే మాటే బాగున్నట్లు తోచింది. అందులోవున్న "కారం" నా మనస్సుకు కొట్టవచ్చినట్లు కనిపించింది! ఇందులోవున్న "సేవ" నాకేగాక మా అమ్మవంటి సజ్జనురాలికి గూడ నచ్చవచ్చు. అందుచేత ప్రజాసేవ చేయటమే నా పరమావధి యని ఆమెకు మనవి చేశాను.

ఆమె నా సమాధానానికి చాల ఆనందించినట్లుగా కన్పించింది. నుదుటిమీద చెమటను చీరచెరగుతో తుడుచుకొని, పీటను నాకు అభిముఖంగా తిప్పి సావకాశంగా కూచొని మళ్ళీ ఉపక్రమించింది. "వెంకూ! నీవు చెప్పినమాట నాకు ముచ్చటగా వున్నది. నీవు బాగా ముందు వెనుకలు ఆలోచించే ఆ మాట అన్నట్లు నాకు అనిపించింది. చాల సంతోషం. కాని నాయనా! నేనేమీ చదువుకున్నదాన్ని కాను. పదిమందిని ఎరిగున్నదాన్ని కాను. అయినా నా మనసుకు తోచిన నాలుగు సంగతులు నీ చెవున వేస్తాను. నా కడుపున కల్గినబిడ్డ ప్రజలకు సేవ చేస్తానంటుంటే నాకు అంతకంటె ఏమికావాలి? పుష్కలంగా మనకు ఆస్తిపాస్తులున్నాయి గనుక నీవింకా ధనం సంపాదించాలని నేను కలలోనైనా కోరను. తూర్పు పడమరలు తెలియక జీవితంలో అడుగడుగునా సంకటాలను ఎదుర్కొనే జనసామాన్యం నీవలన ఉపకారం పొందుతుంటే కన్నులపండువుగా చూచి సంతోషించాలని వుంది. పిన్నలూ పెద్దలూ నీవలన మేలు

పొంది చిరునవ్వులతో తిరిగి వెళుతుంటే వాళ్ళ ఆనందాన్ని చూచి ఆనందించాలని వుంది.

"కానీ వెంకూ! ఈ ప్రజాసేవ చేయటం గూర్చి నేను మరొకరకమైన సౌధాలు కట్టుకుంటున్నాను. వాటిని నీ ముందుంచుతాను. నీకు నచ్చినట్లయితే నాఅభిప్రాయాలను పరిశీలించు.

"మన తాలూకా ఆంధ్రప్రాంతంలోకల్లా వెనుకబడ్డ ప్రాంతమని మా నాన్నగారు చెబుతుండేవారు. ఇది వెనుకబడ్డ ప్రాంతమని నేనేమీ విచారపడను. ఎందుకంటే వెనుకబడ్డ ప్రాంతం గనుకనే ఇక్కడి ప్రజలకు సేవ జేయడానికి పుష్కలంగా అవకాశాలు దొరుకుతాయి. ఇక్కడి ప్రజలు కృతజ్ఞత కలిగివుంటారు. చాలా నమ్మకస్తులుగా గూడా వుంటారు. అందుచేత ఇలాంటిచోట ప్రజలకు సేవ చేస్తున్న కొద్దీ ఇంకా ఇంకా చేయాలనిపిస్తుంది. మనిషి స్వార్థాన్ని మరచిపోయి సేవలో మునిగిపోయి తనను తాను మరచిపోవచ్చు గూడాను.

"అయితే ప్రజాసేవ అంటే ఏమిటనేదే ప్రశ్న. నాకు తోచిన విషయమేమంటే— ఏ చర్యవలన అమాయక ప్రజల ముఖాల్లో చిరునవ్వూ కృతజ్ఞతా కలుగుతాయో అదే ప్రజాసేవ అనుంటాను. ఏ చర్యలవల్ల జనులలో హర్షధ్వానాలూ, అభినందనలూ ఆరంభమవుతాయో అది ప్రజాసేవ అనిపించుకోదు, ఇంకేదో అనిపించుకుంటుంది. బహుశా దాన్ని ప్రజా

నాయకత్వం అనవచ్చునేమో. నా కోరిక ఏమంటే నీవు ప్రజా నాయకుడవుగాక ప్రజా సేవకుడవు కావాలని".

అప్రయత్నంగా నా కళ్ళల్లో నీరు చేరుతున్నాయి. ముఖం మరొకవైపు తిప్పుకున్నాను. మా అమ్మగారు నిప్పుల్లో వేసి బంగారంయొక్క కత్తిని కనిపెడుతున్నట్లనిపించింది! ప్రజా నాయకుడూ, ప్రజాసేవకుడూ అనే ఇద్దరు బలాఢ్యులు నా మెదడులో ప్రవేశించి సత్తువ చూచుకుంటున్నారు! వాళ్ళ ప్రతిబింబాలు నా హృదయంలో చేరి మీసాలు దువ్వుకుంటున్నాయి!... నిజం చెప్పాలంటే నా హృదయంలో ప్రజా సేవకునిదే పై చెయ్యిగా వున్నది. నా మనస్సులోమాత్రం ప్రజానాయకుడే నెగ్గేటట్లున్నాడు. ఈ ఇద్దరినడుమ నేను నలిగిచస్తున్నాను.

మా అమ్మగారు చెప్పుకుపోతున్నది: "మొన్న మన చాకలి వీరాయ పెండ్లాము సుబ్బులు ప్రసవించి గుణ్ణపువాతం కమ్మితే సమయానికి డాక్టరు లేకపోయాడు. తిమ్మాపురం తీసుకెళ్ళేలోగా వాతం కమ్మి చచ్చిపోయింది. నే నెరిగున్నంతలో మన ఒక్క వూళ్ళో ఏడెనిమిది ప్రాణాలు మందులేక ఈ లోకం వీడినయ్. ఇంత ఆస్థి మనకున్నదిగదా! ఒక్క ఏడాది ఆదాయంతో చక్కని ఆసుపత్రి కట్టించక పోతిమే అని అనుకున్నాను. నాయనా! నీవుగనుక నూరు నూటపాతిక మంచాలు గలిగిన ఆసుపత్రి గనుక కట్టిస్తే నేను ప్రతిరోజూ మధ్యాహ్నంపూట వెళ్ళి పండ్లూ, ఫలాలు తెచ్చి పెడుతూ

మనస్సుకు ఆనందకరమైన సంగతులు చెపుతూ రోగులకు ఉపచర్యలు చేస్తూ నా జన్మ తరింప చేసుకోవాలని వుంది.

"పోనీ నీకది నచ్చకపోతేమన గ్రామంలో ఒకఉన్నత పాఠశాలను, విద్యార్థులకోసం ఒక వసతి గృహాన్ని కట్టించు. ఈ రోజుల్లో పాఠశాలల్లో పరీక్షలకు అవసరమైన సంగతులు మాత్రమే చెపుతున్నారు. వివేకవంతుడైన పౌరుడుగా తయారు చేయగల పరిజ్ఞానం అందజేయటంలేదు. అలా కాక నీవుగూడ ఒక ఉపాధ్యాయుడుగావుంటూ తగిన నీతిబోధనా తరగతులు ఏర్పాటుచేసి, చక్కని నడవడిగల మెరికల్లాంటి బాలురను తయారుచేయవచ్చు. వసతి గృహానికి అధిపతిగా వుంటూ వాళ్ళకు మంచి సంస్కారాలు కలిగించవచ్చు.

"పోనీ ఇదిగూడ నీకునచ్చని పక్షంలో మరొక పని చెయ్యి. నాకు తెలిసినంతవరకు మనప్రాంతంలో తల్లిదండ్రులు లేని బిడ్డలను పెంచే అనాథశరణాలయం ఒకటి గూడాలేదు. బిడ్డను కని తల్లి చనిపోతే ఆ బిడ్డను పెంచేవాళ్ళు లేరు. అలాంటి పసిపాపలకోసం ఒక శరణాలయం గనుక నీవు ఏర్ప రచి ముగ్గురునలుగురు దాదులను నియమిస్తే నేనుస్వయంగా నా కాలమంతా ఆ శరణాలయంలో గడుపుతూ పిల్లలకు చక్కని ఆటపాటలతోటీ, కథలతోటీ, ఉత్సాహాన్నీ వివే కాన్నీ కలిగించాలని నాకొక సరదావుంది. ఆ బాలబాలిక లలోనుంచి ఉత్తమ పౌరులను తయారుచేయాలని నాకొక అభిలాష వున్నది. నీకు గనుక ఇష్టమైతే ఇలా చెయ్యి.

"ఆలోచించుకుంటూపోతే ఇలాంటిఅవసరాలు ఎన్నో వున్నాయి, ఉదాహరణకు పశువుల పెంపకంమీద శ్రద్ధ లేక పోవటం వలనా. మాంసంకోసం పాడిపశువులను చంపటం వలనా, మనవూళ్ళలో పాలకూ పెరుగుకూ కరువైపోతున్నది. మందులోకైనా ఆవుపాలు దొరకటంలేదు. పాలపిండి వాడ వలసినగతి పడుతున్నది. కల్తీలేని నెయ్యి కలికానికైనాదొర కటంలేదు. అందుచేత మనం రెండుమూడువందల గేదెలను, ఆవులను కొనితెచ్చి భారీఎత్తున పాలపరిశ్రమ ఆరంభించి, పచ్చికకోసం కొంత పొలాన్ని కేటాయించి వుంచినట్లయితే చుట్టుపట్ల గ్రామ ప్రజలకైనా సమృద్ధిగా పాలు సరఫరాచేసి ఆరోగ్యం బాగుగా వుంచగలుగుతాం. అదీగాక నోరులేని జంతువుల్ని పెంచటంలో ఎంతో ఆనందం వున్నది."

ఆమె ఇలా చెప్పుకు పోతుంటే ఏమి జవాబివ్వాలో నాకు తోచటంలేదు. మా అమ్మగారు చెప్పేవాటిలో ఏ ఒక్కటీ నాకు చెడ్డదిగా కన్పించలేదు. పైగా అవి నేటిప్రజల అవసరాలను అద్దంలో చూపినట్లు కనిపింప చేస్తున్నాయి. ఆమెను నేను "కాద"న లేకపోతున్నాను. కాని నామిత్రులు నిర్మిస్తున్న ఊహాసౌధాలతో పోల్చిచూస్తే మా అమ్మ గారు నా ముక్కుకు తాడుగట్టి పెడదారి పట్టిస్తున్నదనిబెంగ వేస్తున్నది. మా అమ్మగారి మాటలన్నీ నన్ను "కార్నర్" చేస్తున్నాయ్. ఓరి భగవంతుడా అనుకున్నాను.

ఆమె నా మానసిక పరిస్థితిని ఇట్టే కనిపెట్టివేసింది.

"నేనేదో తెలిసీ తెలియనిదాన్ని. నాకు తోచిన సంగతులు చెప్పాను. నేను చెప్పిందే దేశసేవ అవుతుందనీ, మరొకటి కాదనీ నేనుకోను. నీ స్నేహితులు అన్నిటినీ ఎరిగినవాళ్లు కావచ్చు. నీవు వాళ్ళతో సంప్రదించు. నీ హృదయానికి ఏది సవ్యమనితోస్తే ఆ పని చెయ్యి. కాని ఇందాక నీవు వాగ్దానం చేసినట్లు అధికారంకోసం ప్రాకులాడకు. ప్రజాసేవ చేసే మార్గం యోచించు. ఇంతకంటె నేనేమీ కోరను. నీవలనసహాయంపొందిన వ్యక్తుల ముఖారవిందాలలో చిరునవ్వును చూసి నేను తరిస్తాను." అని చెప్పి తాను భోజనం చేయటంకోసం వంట ఇంట్లోకి మెల్లగా వెళ్ళింది.

హా!... అనుకున్నాను. ఒక్కసారి చేతులు పైకెత్తి ఆవులించాను. మా అమ్మగారే నన్ను రక్షించింది. నేను చెప్పబోయే జవాబు ఆమే చెప్పి నాకు వున్నదని నే ననుకుంటున్న "పరువు"ను నిలబెట్టింది!

మరునాటి ఉదయం కాలకృత్యాలు తీర్చుకున్నాను. రెండు కాగుల వేడినీటితో తనివితీర స్నానంచేశాను. గేదె పెరుగుతో ఊరగాయ నంజుకుంటూ అన్నంతిని రెండెడ్లబండి ఎక్కాను. మా అమ్మగారు నా కోసమూ, నా మిత్రుల కోసమూ కమ్మని నేతితో తయారుచేసిన పంచదారలడ్లనూ, నోట్లోవేసుకుంటే నాసిపోయేటువంటి పకోడీలనూ స్వయంగా వచ్చి బండిలో కూచున్న నాచేతి కందించింది. మా నాన్నగారు వీధిగుమ్మంలో చుట్టకాలుస్తూనిలబడి "అదే అప్పుడు!

సంకురాత్రి పండక్కి నీ స్నేహితుల్ని గూడ వెంబడేసుకు రారా! ఏం?" అన్నాడు. వినపడీ వినపడకుండ 'అలాగే' నన్నాను.

బండి కదిలింది. ముత్తైదు ఎదురుగా వస్తోంది. ఆమె మా పిన్నికూతురు. అది మా అమ్మగారు ముందుగానే చేసిన ఏర్పాటన్నమాట! "అరే వెంకూ ! పుట్టిన వూరు మర్చిపోకురోయ్" అని నవ్వుకుంటూ దాటిపోయింది. మా అమ్మ మాత్రం వీథిగుమ్మంలో నిలబడి బండి మలుపు తిరిగే వరకు నా వంక చూస్తూనే వుంది. దూరంనుంచి కనిపించింది- చీర చెరగుతో కన్నీరు తుడుచుకుంటూ!... నాకు గూడా అప్రయత్నంగా నీరు నిండినై... కన్నీరు కార్చే సమయాలు ఎంత మధురమైనవో గదా!

---

## కత్తిలేని మంగలి !

"కొంప మునిగిందిరా బాబూ" అన్నాడట సుశీలారావు - నేను మావూరు వెళ్ళానని విని. తరువాత మహాలింగం నాతో చెప్పాడు.

నేను తిమ్మాపురం చేరగానే మిత్రులు ముగ్గురూ నా దగ్గరికి వచ్చారు. ముగ్గురిలోనూ ఆతురత కనపడింది. నేనెలాంటి బాంబులాంటి కబురు పీూదవిసురుతానోనని.

వాళ్ళకు ఆశాభంగం కలిగించడం కోసం నేనెలాంటి కబురూ చెప్పకపోగా పెట్టెలో నుంచి గారడీవాడు తీసినట్లు లడ్ల పొట్లాన్నీ, పకోడీల పొట్లాన్నీ తీసి నడిమిలో పెట్టాను. కొండయ్యకు పరమానందం కలిగింది. ధోవతి వదులు చేస్తున్నాడు. మహాలింగం పొట్లాలు విప్పదీస్తున్నాడు. సుశీలారావు మటుకు స్వభావం ప్రకారం ఆలోచనలు చేస్తూనే మామూలుగా కనపడాలని యత్నిస్తున్నాడు. నలుగురమూ నాలుగు చేతులూ వేసి సునాయాసంగా పనిపూర్తిచేశాం. కొండయ్య మాత్రం సంతుష్టి కనపరచలేదు. లడ్లపొట్లంలో మిగిలిన పొడినిగూడా నోట్లోకి దులుపుకుంటూ కాగితానికి అడుగున వేలితో రెండు దెబ్బలు వేశాడు. కాగితాన్ని మడిచి దూరంగా పారేశాడు-ఇక నీపని అయిపోయిందిపో అన్నట్టు!

సుశీలారావు ఉపక్రమించాడు: "సోదరా! మన కార్యకలాపాలను గురించి సి.ఐ.డి. రిపోర్టులు వెళ్ళడం వల్ల మీ అమ్మగారు నిన్ను 'వారంటు' పంపి పిలిపించిందని విన్నాను. నీవు వెళ్ళిన తర్వాత జరిగిన సంగతులన్నీ సవిస్తరంగా చెప్పు. వినాలని కుతూహలంగా వున్నది" అన్నాడు. మహాలింగం కొండయ్యలు డిటో అన్నట్లు కళ్ళు పెద్దవి చేసుకొని నా వంక చూస్తున్నారు.

మా అమ్మగారు నన్నడిగిన యక్ష ప్రశ్నలూ, నేను చెప్పిన సమయానుకూల సమాధానాలూ పూసగుచ్చినట్లు చెప్పాను. నేను ప్రజాసేవ చేయటం ఆమె కిష్టమేనట! కాని

అధికారంకోసం ప్రాకులాడటంమాత్రం ఆమెకు సుతరామూ గిట్టదనీ, నేను ప్రజాసేవ చేస్తానుగాని అధికారంకోసం ఆరాట పడనని ఆమెకు వాగ్దానం చేశాననీ చెప్పాను.

ఈ మాట నేన నేసరికి సుశీలారావు నాలిక కొరుక్కు న్నాడు. చెవులు నిక్కపొడుచుకొని నా కళ్ళలోకి చూస్తు న్నాడు. మా అమ్మగారు ప్రజాసేవకూ ప్రజానాయకత్వా నికీ యిచ్చిన నిర్వచనాలనుగూడ వాళ్ళకు అప్పగించివేశాను. ప్రజాసేవ చేయటంకోసం ఆమె కొన్ని పద్ధతులు సూచించిం దనీ, ఒక ఆసుపత్రిగాని, ఆదర్శవంతమైన పాఠశాలనుగాని, అనాథ శిశుసంరక్షణాలయాన్నిగాని స్థాపించమనీ లేదా కొన్ని వందల పాడి పశువులను కొని భారీయెత్తున పాడి పరి శ్రమ ఆరంభించమనిగూడ చెప్పిందని వివరించాను.

సుశీలారావు విస్తుపోయాడు. "మీ అమ్మగారు ఏమైనా చదువుకున్నదా" అని అడిగాడు. మా అమ్మగారు ఏమీ చదువుకోలేదుగాని దయార్ద్రమైన హృదయమూ, తోటి మానవులమీద అనంతమైన ప్రేమ, అనుభవపూర్వక మైన వివేకమూ వుండటంవలన చల్లని మాటలతో అవతల మనిషిని తనవైపు మళ్ళించుకోగలదని గర్వంగా చెప్పాను.

సుశీలారావు మాట్లాడడం ఆరంభించాడు. చిన్నతనం నుంచీ అతన్ని నేను అంటిపెట్టుకొని వుండడంవల్లనైతేనేమి, అతని కళ్ళలోని వర్చస్సువల్లనైతేనేమి, అనేక సందర్భాలలో అతను నా అండగా వుండటంవల్లనైతేనేమి సుశీలారావంటే

నాకు అనురాగంతో గూడిన అభిమానం. అతనివాదంగూడ ఓపికతో వినదలిచాను.

"వెంకటప్పయ్యా! మీ అమ్మగారు సత్యకాలపుమనిషి. ఆమె చదువుకోనటువంటి జ్ఞాని. ఆమె మనస్సు బాణంకంటె నిశితంగా కనిపిస్తున్నది. ఆమె హృదయం అప్పుడు తీసిన వెన్న పూసలాంటిది. ఆమె చెప్పిన విషయాలు సామాన్యులబుద్ధులకు తట్టనివి.

"కాని మిత్రమా! మనం ఇరవయ్యో శతాబ్దంమధ్యలో వున్నాం. మనం తేలియాడుతున్న ఈ సముద్రంలో మైనులు నాటబడి వున్నాయి. మనం నడిచే వీథుల్లో గడ్డి కప్పబడిన బావులున్నాయి. మనంనిద్రించే పడకగదిలో టైంబాంబులు పెట్టబడ్డాయి. మనం ఆడుతున్న ఈ జీవితనాటకంలో విలన్ పాత్రలే అనేకంగా ఉన్నాయి. ప్రపంచంలో దొంగల్ని పట్టుకునే వినూతన పరికరాలు కనిపెడుతున్నారు. కానిదొంగలు కూడ దొంగలించటానికి అధునాతన పరికరాలు ప్రయోగిస్తున్నారు. ప్రపంచం నానాటికీ నూతన ప్రయాణసాధనాల ద్వారా చిన్నదైపోతున్నమాట నిజమేగాని ప్రజలబుద్ధులు గూడ ఇంకా ఇంకా చిన్నవవుతున్నాయి."

ఇలా చెప్పుకుపోతుంటే దిగ్భ్రాంతుడనైవింటున్నాను. సుశీలారావు మరింత ఉత్సాహంతో చెపుతున్నాడు. మహాలింగం, కొండయ్యలు తలలను అటునుంచి ఇటూఇటునుంచి అటూఊపుతున్నారు..."అందుకనిమనం వాస్తవికదృష్టితో

ఆలోచించాలి. గాలిలో మేడలు కట్టగూడదు. వాస్తవికతకు దూరం కాకూడదు. లోకాన్ని అతిగా విశ్వసించగూడదు. శత్రువు వున్నా లేకపోయినా కవచం ధరించటం మంచిది. క్షేమమును ఎంచిన తర్వాతనే మేలెంచవలసివుంటుంది. సత్య కాలం వచ్చినతర్వాత మీా అమ్మగారి మాటలు వేదవాక్యా లవుతయ్. నీ కంటె ముందు నేనే వాటి నాచరిస్తాను.

"కాని అంతవరకూ వున్న దే-ఆ సత్యకాలం వచ్చేవరకు -ప్రజలకు అర్థమయ్యే భాషలోమాట్లాడాలి. కరుణ, ప్రేమ, దయ అంటే ఇదేదో చేతకానితనం అనుకొని నాలుగు గులక రాళ్ళు గురిచేస్తారు గాని సరిగా అర్థం చేసుకోరు. పోలీసు ఉద్యోగి వచ్చి మనకు సలాం కొడుతున్న రోజున ప్రజలు గూడ మనమాట వింటారు. అంతేగాని మనం పద్మాస నంలో కూర్చొని ధర్మపన్నాలు వల్లిస్తుంటే ఒక కానీ దిబ్బ నలో వేసి లెంపలేసుకు పోతారేగాని ప్రయోజనముండదు.

"కనుక తీరా నేను చెప్పవచ్చిం దేమంటే - కత్తిలేని మంగలి వల్ల ఏమి లాభం? ఏమీా లాభం లేదు. దమ్మిడీకి కొరగాడు. గోళ్ళు భుజిస్తూ చెట్టుకింద కూచోవాలి. ఉప కరణం లేనివాడు వ్యర్థుడు. అలాగే ప్రజాసేవ అనేది చేయా లంటే ఉపకరణం ఏమిటి?

"నీదగ్గర తాతలు యిచ్చిపోయిన ఆస్తివున్నది గదా అని అనుకుంటున్నావేమో!...ప్చ్...లాభంలేదు. దేశంలో జనసంఖ్య ఎంతున్నది ? నీ డబ్బు ఎంతున్నది ? పోల్చి

చూడు... సముద్రంలో కాకిరెట్ట ! నీ దగ్గర లక్షో రెండు లక్షలో వున్నదనుకో. అది ఆరిపోవడానికి ఆరు నెలలు పట్టదు... అది పద్ధతి కాదు. నేను చెపుతున్నానుగా, అది పద్ధతి కాదు...గంగానదీ జలం మోస్తరుగా ఇంక నటువంటి దాన్ని మనం పట్టుకోవాలి. వ్యక్తి అల్పాయుష్కుడు. వ్యక్తి ఆస్తిగూడ ఎంతో కాలం వుండదు. నీటి బుడగ మోస్తరు. నీ వొకసారి భూప్రదక్షిణం చేసివస్తే నీఆస్తి దమ్మిడీలలోకి దిగుతుంది...సమాజం అలాంటిదికాదు.అన్నికాలాలలోనూ సమాజం వుంటుంది. సమాజానికి నాశనంలేదు. సమాజపు డబ్బుగూడ యెన్నటికీ యింకిపోయేదికాదు. ప్రజలు పన్ను లిచ్చే సత్తువనుబట్టి ఆ ఆస్తితరుగుతూ పెరుగుతూవుంటుంది. ప్రజాసేవ చేయదలచినవారు ప్రజల డబ్బుతోనే చేయాలి. ఇది రూలు. అంతేగాని వ్యక్తి డబ్బు ప్రజలకోసం గాని, ప్రజల డబ్బు వ్యక్తికోసంగాని ఖర్చుచేయగూడదు.అదితప్పు.

ఐతే ఈ ప్రజల డబ్బు ప్రజాసేవకుల చేతుల్లోకి ఎలా వస్తుంది? దానికి ఒకటే రాజమార్గం-అధికారం.అధికారాన్ని హస్తగతం చేసుకోవాలి. అందుకోసం స్థానిక సంస్థలలోనూ, శాసన సభలలోనూ, ప్రవేశించాలి. కాబట్టి ప్రజా సేవ చేయటం కోసమే అధికారంలోకి రావాలి. తప్పదు...అధికారం కత్తివంటిది. అధికారంలేకుండా ప్రజాసేవ చేస్తాననడం కత్తిలేని మంగలి బాపతు!"

కాస్తతమాంచి మళ్ళీ అన్నాడు. "మన ఉద్దేశం మీ అమ్మగారికి నీవు వాగ్దానం చేసినట్లు ప్రజాసేవ చేయడమే. కాని అందుకు అధికారంలోకిపోయి ప్రజల డబ్బుతో ప్రజాసేవ చేయాలని మనమంటాం. సొంత డబ్బుతో ప్రజాసేవ చేయాలని మీ అమ్మగారంటారు. ఇంతే తేడా! అయినా మనమూ ఆలోచించాలి. నీ స్వంత డబ్బుతో అయితే ఒక హైస్కూలో, ఒక ఆసుపత్రో కట్టించి పూరుకోవలసివస్తుంది. అలాగాక నీవు జిల్లాపరిషత్ అధ్యక్షుడవో మరేదో గనుక అయితే జిల్లాలో పాతిక హైస్కూళ్లూ, పాతిక వంతెనలూ, పది పదిహేను ఆసుపత్రులూ కట్టించొచ్చు. ఇంతకూ మూల సూత్రం ఎక్కడున్నదంటే కత్తిలేనిమంగలి ఎంత నిరర్థకుడో, అధికారంలేని ప్రజాసేవకుడు అంత నిష్ప్రయోజకుడు."

అరటిపండు వలిచి చేతిలో పెట్టినట్లుగా వుంది సుశీలా రావు చెప్పిన విషయం. ఇంతకు ముందు నాలో ప్రవేశించిన సందేహాలన్నీ మబ్బువిచ్చి పోయినట్లు నివృత్తి అయినయ్. మా మిత్రులు నిర్దేశించిన కార్యకలాపాలలో మరింతఉత్సాహంతో కృషిచేయడానికి నేను నిశ్చయించుకున్నాను. ఆనాటి రాత్రి మేము నలుగురం కలిసి సినిమాకు వెళ్ళాం.

## శుభవార్త

"శుభవార్త తెచ్చాను. ఏమిస్తావ్"అన్నాడు సుశీలా రావు. "ఏమిస్తాను నా మొహం? నాకు నేనే యిచ్చుకున్నానుగా! చీట్ల పేకలో జోకరులాగ వాడుకొంటుంటివి. ఇక నే నివ్వవలసిందేముందీ?" అన్నాను సరదాగా.

"వెంకటప్పయ్యా! మా అమ్మమీద ఒట్టుపెట్టుకు చెబుతున్నాను. నిన్ను నేను ఎన్నడూ వాడుకోను. నిజానికి మనవిరెండూ ఒకేఆత్మగల రెండుశరీరాలని నేననుకుంటాను. మనలో క్షేమంగాని మేలుగాని ఎవరికి జరిగినా అది యిద్దరికే జరిగినట్లేనని నేను భావిస్తాను" అన్నాడు దీనంగా. అతని మనస్సు నొప్పించినందుకు నేను చాల నొచ్చుకున్నాను.

"పోనీలే. ఏదో నోరుజారి అనేశాను...ఒక కంచంలో తిని ఒక మంచంమీద నిద్రించిన మనలో మనకు సందేహాలేమిటి...సరేగాని...ఆ శుభవార్త ఏమిటో చెప్పావుకావు" అన్నాను.

"అ సంగతే నీ చెవున వేద్దామని వచ్చాను. ఇవ్వాళ 'మసాలా' దినపత్రిక కార్యాలయంనుంచి అధికార పూర్వకమైన లేఖ వచ్చింది. అందులో నన్ను తిమ్మాపురం పట్టణం తరఫున విలేఖరిగా వుండవలసిందిగా వ్రాశారు. ప్రతినెలా నేను ఇక్కడనుంచి పంపే వార్తలనుబట్టి డబ్బు చెల్లిస్తూ వుంటారు" అన్నాడు.

నా కత్యంత ఆనందం కలిగింది. సుశీలారావు పత్రికా విలేఖరిగా నియమించబడిన శుభసమయంలో మిత్రులం నలుగురమూ చేరి భోజనంతో తుల్యమైన అల్పాహార విందు ఆరగించాం. కొండయ్యను కూర్చోపెట్టి గులాబ్ జాముల పందెంపర్చాటుచేశాం. 36గులాబ్ జాములను సునాయాసంగా తన చిరు బొజ్జలో యిమిడ్చి వేశాడు. అలా కష్టపడుతున్న సమయంలో మహాలింగం అతనిని విసనకఱ్ఱతో విసురుతూ ఆదుకున్నాడు. టీ పుచ్చుకొని పార్కులోకి బయలుదేరాం.

సుశీలారావు పత్రికా విలేఖరి అయినంత మాత్రాన ప్రత్యక్షంగా ప్రయోజన మేమిటో నాకర్థం కాలేదు. అత నినే అమాయకంగా అడిగాను చెప్పమని. అతను చాల ఓపి కతో చెప్పాడు.

"ఈ ప్రపంచం యిదివరలో గాలి, నీరు, భూమి, అగ్ని, ఆకాశమనే పంచభూతాలవలన నడిపించబడుతుండేది. ఇపుడు కాలం మారింది. భూతాలు పోయి దేవతలు వచ్చారు. దినపత్రిక, సినిమా, రేడియో అనే త్రిశక్తులు నేడు లోకాన్ని ఒక కొలిక్కి తీసుకువస్తున్నాయి. ఈ మూటిల్లో దేన్ని చేప ట్టినా మనకు మహారాజయోగం ఖాయమే! ప్రస్తుతం దిన పత్రికగూర్చి విచారిద్దాం. దేశంలో దినపత్రిక చేయలేనిపని ఏముంది? పడిపోయే ప్రభుత్వానికి ఆయుష్షు పోయగలదు. తన కిష్టంకాని రాజకీయ పార్టీని శిథిలం చేయగలదు. తలచు కుంటే ప్రజలలో ఉద్రేకాలను రెచ్చగొట్టసూగలదు; లేదా

మన్నుతిన్న పాముల్లాగ సజీవిస్తుంచనూ గలడు. లేనిదాన్ని వున్నట్లు చూపించనూ గలడు; వున్నదాన్ని లేనట్లు ఋజువు చేయనూగలడు. దినపత్రిక సంపాదకుడిచేతిలో దేశంయొక్క జాతకం వున్నది. అతని కలంలో మనుషుల ముక్కులకు తాళ్లుగట్టి ఈడ్చుకెళ్ళే మాంత్రిక శక్తి వున్నది. అతని చేతిలో సమస్యలను సృష్టించటానికీ, పరిష్కరించటానికీ గూడా ఉపకరించే తాళం చెవులున్నాయి.

దిన పత్రికలకు దేశమంతటా అన్ని ముఖ్య నగరాల లోనూ విలేఖరులుంటారు- జిల్లాకలెక్టర్లకు ప్రతి గ్రామం లోనూ మునసబు లున్నట్లు. మునసబులు శిస్తు వసూలుచేసి కలెక్టరుకు పంపినట్లుగా విలేఖరులు వార్తలు సేకరించి సంపా దకునికి పంపుతుంటారు. భర్తయొక్క మానసిక వైఖరులను గుర్తించి భార్య ఎలాగైతే తను చెప్పవలసిన సంగతులకు ఒక రూపమిస్తుందో, అలాగే సంపాదకుని ప్రియాప్రియాలను కనిపెట్టి విలేఖరి వార్తలను పొందుపరుస్తుంటాడు. నేను ఇంత వరకూ ఒక సామాన్య పత్రికా రచయితగా వార్తలనుపంపే వాడిని. ఇకనుంచి 'మసాలా' దినపత్రికకు అధికార పూర్వ కంగా విలేఖరి నయ్యాను".

మహాలింగం ఎదురుప్రశ్న వేశాడు. "నీవు చెప్పిన దంతా బాగానే వుంది. ఐతే నీవు విలేఖరి కావడంవల్ల మనకు ఒరిగే ప్రయోజనం ఏమిటో అంటాను?"

"మంచిమాట అడిగావు. అదే చెప్పబోతున్నాను.

ఈ రోజుల్లో మెడమీద తలగల ప్రతి ప్రాణికీ పబ్లిసిటీ కావాలి. చీమ చిటుక్కుమంటే పేరు పేపర్లో పడాలి. ఒక్కొక్క సభ జరిగితే ఉపన్యాసకులున్నంతమంది ప్రేక్షకులుండరు. బ్రహ్మాండంగా సభ జరిగిందని పేపర్లో పడుతుంది. ఒక్కొక్క సమాజం వారు ఫొటోలోదిగితే ఆఫొటో పేపర్లోపడేవరకు వాళ్ళకు అన్నం సయించదు. ఈ విధంగా పట్టణంలో "పైకిరావా"లనే మహదాకాంక్షగలవాళ్ళంతా పత్రికా విలేఖరి ముందర ఐదు పదిచేసి నిలబడతారు. పురోహితుడికి స్వంతఇంట్లో భోజనం చేసే అగత్యం లేనట్లు పత్రికా విలేఖరికి స్వగృహంలో ఫలహారంచేసే అవసరం అంతగా ఉండదు! ప్రజలు నేరుగా పంపే వార్తలను పత్రికల వాళ్ళు సరిగా వెయ్యక పోవచ్చు. విలేఖరులుపంపే ప్రతి అక్షరమూ పత్రికలో చోటుచేసుకుంటుంది. అందుచేత లోకం మరమ్మతుకోసం విరగబడే ప్రతివాడూ మొదట విలేఖరికి దగ్గరగా జరుగుతాడు. నారద మహర్షి ఎంత నిర్విరామంగా పర్యటిస్తూ వుంటాడో విలేఖరి అంత "బిజీ"గా కనపడుతాడు. ఇపుడు ఇక్కడున్న వాడు మరుక్షణంలో ప్లాటుఫారంమీద పచార్లుచేస్తుంటాడు. కనపడ్డ వారందరినీ అప్పుడిలాగ పలుకరిస్తాడు. నిజానికి దినపత్రిక సంపాదకుడొక్కడికే అతను అప్పుడు."

సుశీలారావు మాటల్నిబట్టి అతనికి, అతని ద్వారా మాకందరికీ భేషైన జాతకం ముందున్నదని అనిపించింది. అతనికి విలేఖరిపదవి వచ్చినందుకు తోడుపెళ్ళి కొడుకుల్లాగ

మేమంతా ఆనందించాం. పట్టణంలో ఎక్కడ ఏ వింతజరిగినా ఆదరా బాదరాగా వెళ్ళి సంగతి తెలుసుకొని సుశీలారావు చెవున వేస్తుండేవాళ్ళం. ఒకసారి స్కూలు ఫైనలు పరీక్షలు జరుగుతుండగా పరీక్ష హాల్లో ఆన్సరు చెప్పనందుకు ఒక విద్యార్థి వాచరును ముందు పళ్లు రాలేటట్లు కొడితే ఆ వార్తను సుశీలారావు టెలిగ్రాంద్వారా పంపించాడు. మరు నాడు తెల్లవారేసరికి మావూరి హైస్కూలు ప్రతిభ పత్రిక మొదటి పేజీలో దర్శనమిచ్చింది!

ఒకమారు కల్లుతాగి బూతులు తిట్టుకుంటూ ఇద్దరు పోలీసులు సైడు కాలువమీదపడి పొర్లాడుతున్నారు. సుశీలా రావు ఆ అపూర్వదృశ్యాన్ని చూచి పరమానందభరితుడై మహాలింగాన్ని పిలిపించి వాళ్ళనెంబర్లుగూడ పడేటట్లు రెండు ఫోటోలు తీయించాడు. సుశీలారావు వాటి కాపీలను తీసి కెళ్ళి సబ్ ఇన్స్పెక్టరుకు చూపి "ఇదుగో మీ పోలీసులు. యూనిఫారంలో వుండి కల్లుకాగి తందనాలు తొక్కుతు న్నారు. ఈ ఫోటోను వార్తతోసహా పత్రికకుపంపితే నాకు మంచి ప్రమోషనువస్తుంది... వెళ్ళివస్తాను"అని వచ్చేశాడు.

అతను ఇంటికివచ్చిన అరగంటకల్లా పోలీసులిద్దరూ సుశీలారావు దగ్గరకు వచ్చి చేతులు పుచ్చుకొని "బాబూ! ఇవి చేతులు కావు కాళ్ళనుకోండి. ఏదో బుద్ధి గడ్డితిని తప్ప తాగాం. మద్యనిషేధం అమలులో వున్న ఈ సమయంలో మీరు గనుక ఆ ఫోటోలను పత్రికకుపంపితే మానోటిదగ్గరి

కూడు తీసివేసిన వారవుతారు. ఆలుబిడ్డలు అల్లాడిపోతారు. బాబ్బాబూ! ఈ బహుమతి పుచ్చుకొని మమ్మల్ని మీరు రక్షించాలి” అని చెరొక వందరూపాయలనోటూ చేతులో పెట్టి నమస్కారం చేశారు.

సుశీలారావు లాటరీలో గెలిచినవాడిలా ఒక్కనవ్వు నవ్వి, “ఏమియ్యా! నేనెవరి ననుకున్నారు లంచం పుచ్చుకోటానికి? తీసుకోండి. మీ డబ్బుమీరు తీసుకొని ఇంటికిపోయి పిల్లలకు కొత్త గుడ్డలు కొనివ్వండి. నేనుమాత్రం ఈతెడవకు పత్రికకు వార్త పంపను. ఇక వాళ్ళు దగ్గరుంచుకొని మెలగండి” అన్నాడు.

కాని వందరూపాయలూ పుచ్చుకోక పోవటంవల్ల పోలీసులకు భయంగా వుంది సుశీలారావు ఎప్పటికైనా ఫొటో పంపవచ్చునని. అందుకని వాళ్లు దాన్ని పుచ్చుకోమని బతిమలాడారు. సుశీలారావుకు కోపంవచ్చి “ఇలాగైతే నాకు లంచమివ్వటానికి ప్రయత్నించారని గూడ వార్త పంపిస్తాను సుమా”అన్నాడు. దాంతో పోలీసులకు తారెత్తినోట్లుమడిచి జేబులో పెట్టుకొని “బాబ్బాబు! మన్నించండి. మీ సహాయం ఎన్నటికీ మరువం. వార్త మాత్రం పంపకండి” అని ప్రాధేయపడి వెళ్ళిపోయారు.

సుశీలారావు ఆ వార్తను పంపలేదు. పోలీసులు మాత్రం శాశ్వతంగా సుశీలారావుకు శిష్యపరమాణువులై పోయినారు. ఇతను కనపడితే చాలు గార్డ్ఆఫ్ఆనర్ లాంటిది

ఇస్తుంటారు. ఇతనంటే వాళ్ళకు భయముతో గూడిన గౌరవం ఏర్పడింది.

పత్రికా విలేఖరిగా సుశీలారావు బాగా రాణిస్తున్నాడు. మా తాలూకాకు మంత్రులు గనుక పర్యటనకు వస్తే సుశీలారావును అన్ని హంగులతోటీ వాళ్ళ వెంట తీసుకు వెళుతారు. తిమ్మాపురంలో పెద్దపెద్ద ఆఫీసర్లంతా సుశీలారావును ఎరుగుదురు. దేవతలు నారద మహర్షిని గౌరవించినట్లుగా వాళ్ళు సుశీలారావును మర్యాదచేస్తుంటారు. ఏదైనా వూరుపోవాలంటే బస్సులో ఫ్రంటుసీటు ఖాళీచేయించి ఇప్పిస్తారు. సినిమాలకూ, నాటకాలకూ కాంప్లిమెంటరీలు పంపిస్తారు. బెల్లు, బ్రేకు, మడ్గార్డు, లేనటువంటి సైకిలుమీద సుశీలారావు వూళ్ళో సంచారం చేస్తూవుంటాడు!

---

## సంక్రాంతి

సంక్రాంతిపండుగకు సుశీలారావు నెలరోజుల ముందర నుంచీ పథకం వేస్తున్నాడు. ఏదో చిత్రవిచిత్రంగా సంబరం జరపాలనీ వూరంతటినీ గుప్పిట్లోకి తీసుకురావాలనీ అతని ఊహ. మా కొండయ్య జనసంఘ వ్యాయామమండలి అనే దాన్ని నడుపుతున్నాడని ఇదివరలో మనవి చేశాను. దాని ఆధ్వర్యాన సంక్రాంతి పండుగలకు ఆటలపోటీలు నిర్వహించ

బడ్డాయి. అందుకోసం అన్ని పోటీలలోను ప్రథమ, ద్వితీయ శ్రేణులలో గెలుపొందినవారికి భీమార్జున పతకాలు బహూకరిస్తామని వాడవాడలా ప్రచారం జరిగింది. అనేక వూళ్ళ నుంచి ఆటగాళ్ళు వచ్చారు. చెడుగుడు, కుస్తీపట్లు, 100 గజముల ముణుగీత, టెంకాయ విసిరివేయటం, చేతులువదలి పెట్టి సైకిలు తొక్కటం, మనిషిమీద మనిషి చొప్పున ఎక్కి తాటికాయ లందుకోటం, నిలువులోతు చెరువులో అక్కడక్కడ విరజిమ్మబడిన గుండ్రాళ్ళను వెదికి పట్టుకురావటం—— ఈ పోటీలు నిర్వహించబడ్డాయి. చీట్లపేకలోనూ చదరంగంలోనూ పోటీలు పెట్టవలసిందిగా వూళ్ళో ఆఫీసర్స్ క్లబ్బువారు వచ్చి ప్రాధేయపడ్డారుగాని అవి శారీరిక పోటీల కిందికి రావు గనుక వీల్లేదని చెప్పాం.

దాదాపు రెండువందలమంది ఆటగాళ్లు వీటిలో పాల్గొన్నారు. పొరుగూరునుంచి వచ్చినవారికోసం కన్యకా పరమేశ్వరీ సత్రంలో విడిదిఏర్పాటుచేశాం. ఉదయమూ, సాయంకాలమూ, నేనూ సుశీలారావూ కలిసి సత్రంలోకెళ్ళి, వచ్చిన అతిథుల్ని పరామర్శచేసి వచ్చేవాళ్ళం. ఆటలలో పక్షపాతం జరగకుండా వుండటంకోసం కుంభకోణంనుంచి బలాఢ్యుడైన డ్రిల్లు మేష్టరును పిలిపించాం. నూతనమూ, అపూర్వమూ అయినటువంటి పోటీలు నిర్వహించటంవల్ల వేలకొలది జనం సర్కసు కోసం వచ్చినట్లు వచ్చారు. ఈజనాన్ని అదుపులో పెట్టడానికి పోలీసు సహాయంగూడ కోరవలసి వచ్చింది.

సంక్రాంతి పండగ మూడో రోజున బహుమతులు పంచి పెట్టటంకోసం బ్రహ్మాండమైన బహిరంగసభ ఏర్పాటు చేశాం. దానికి తాసిల్దారుగారిని అధ్యక్షులుగా తీసుకువద్దా మని నేనన్నాను. సుశీలారావు ముక్కుమీద వేలు వేసు కున్నాడు. ఈనగాచి నక్కలపాలు చేస్తామా? అన్నాడు. "నేగీచిన గీతలోవుండు. నిన్ను అధ్యక్షుడుగా పెడుతున్నాను. ఇదిగో అధ్యక్షోపన్యాసం. దీన్ని నిదానంగా వల్లెవేసి సభకు రమ్మం"టూ కాగితం చేతికందించాడు.

సభకు జనం బాగానే వచ్చారు. మొదట కల నిజ మాయెగా, కోతీబావకు పెళ్ళంట, అదుగో ద్వారక, బావ నాకేసి ఒకసారి ఇత్యాది రికార్డులు చెవులు గింగురు మనేటట్లు వినిపించారు. పాటలకోసం వచ్చిన జనం సభలో వుండటం మర్యాద అనుకొనివుండిపోయారు. సభలో మొదటి అర్ధ గంటసేపూ తళతళ మెరిసే ఖడ్గంపుచ్చుకొని కొండయ్య కత్తిసాము ప్రదర్శించాడు. అసలే ఉగ్రనరసింహమూర్తివంటి విగ్రహం. అలాంటివాడు కళ్ళు చెదిరేటట్లు కత్తిసాము చేయ టంవల్ల వచ్చిన జనం ముక్కుమీద వేలు వేసుకున్నారు. ఉండుండి హర్షధ్వానాలు చేశారు. ఊపిరి సలుపనివ్వకుండా కత్తిని చక్రం తిప్పినట్లు తిప్పటంతో ప్రేక్షకులు విభ్రాంతులై నారు. మరునాటినుంచీ కొండయ్యప్రతిష్ఠ సందుసందునా పాకిపోయింది. అతను కనిపిస్తే ప్రతివాడూ కాస్త దూరంగా తొలగిపోయేవాడు. పూళ్ళో అదివరకు పేరు మోసిన రౌడీలు

గూడ కొండయ్యతో మైత్రి చేసుకోవటం కోసం దగ్గరకు రావడ మారంభించారు.

కొండయ్య భుజబలంతో సంపాదించిన ప్రతిష్ఠ నాకు గూడ కొంత సోకించాడు. ఎలాగంటే, ఆ సభలో జరాసంధ వ్యాయామమండలి కార్యదర్శిగా కొండయ్య చిన్న ఉపన్యాసం వదిలాడు. అతను తడుముకుంటూ నట్టునట్టుగాను, చెప్పిన మాటే చెపుతూను మాట్లాడాడు. ఒక్కొక్క వాక్యంపూర్తి కావటం బ్రహ్మప్రళయంగావుంది. అతను చెప్పిన పదినిమిషాల ఉపన్యాసంలో ఇరవై "అన్నమాటలు" వున్నాయ్. అయినా జనం నోరు మెదపలేదు. బహుశా అది అతను ప్రదర్శించిన కత్తిసాముయొక్క మహాత్మ్యం అయివుంటుంది. అతను మాట్లాడుతూ నన్ను ఆకాశానికెత్తాడు. ఈ కత్తిసాము నా దగ్గరే నేర్చుకున్నానని కోశాడు! నేను యువలోకానికి చంద్రునివంటి వాడిననీ, నా చల్లని కిరణాలతో యువకుల తపన ఆపగలననీఅన్నాడు. గెలుపొందినవారినీ, పోరుగూళ్ళనుంచి వచ్చినవారినీ అభినందించాడు.

నేను బహుమతులు పంచిపెట్టాను. అందరూ భీమార్జునులవలె దృఢ కాయులుగాను, శక్తివంతులుగానూ వుండటమేగాక వారివలె అన్యోన్యంగాగూడ వుండాలనిచెప్పాను. భీముడిలోని భుజబలమూ, అర్జునుడిలోని బుద్ధి బలమూ అలవరచుకోవాలంటూ ఉపన్యాసం ముగించాను.

ఈ సంక్రాంతి ఆటలపోటీలవలన జనసామాన్యంలో కొండయ్య, అతనివెనుక నేనూ జోరపడగలిగాము. కొండయ్య నాగాలేకుండా ప్రతిరోజూ తాలింఖానాలో కసరత్తు చేసేవాడు. కోడిగుడ్లను జామపళ్ళ మాదిరి సునాయాసంగా పుచ్చుకొనేవాడు. ఇదిగాక ఉదయమూ సాయంకాలమూ సోలెడు బాదంపాలు పుచ్చుకుంటాడు. అతను నడుస్తుంటే నేల గుంటలుపడేది. అతని శరీరం నిగనిగలాడుతూ తోమిన రాగిచెంబులా ప్రకాశిస్తుండేది! అతన్ని చూస్తే ఇహ మా వంటిమీద ఎవరూ చెయ్యి వెయ్యలేరని ధీమాగావుండేది.

## మొదటి మజిలీ

బంగాళాఖాతంలో వాయుగుండం ఏర్పడితే గనుక చెట్లను విరిచే గాలితోటీ, ముంచుకువచ్చే మబ్బులతోటీ, గుండెలు అవిసే వురుములతోటీ కుంభవృష్టి ఆరంభమైనట్లు ప్రభుత్వంవారు వుంటుండిజారీచేసిన తాఖీదు ప్రకారం కేవలం ఒక్కమాసం వ్యవధిలో మావూరి మీద పంచాయతీ ఎన్నికలు వచ్చిపడ్డయ్! ఊళ్లో ఈ వార్త యుద్ధవార్త మాదిరిగా పొక్కిపోయింది. మనుషుల ముఖాలు చేటంత అయినయ్. బుర్రలు వేడెక్కినయ్. ఇద్దరిద్దరు మనుషులు ఒకచోట చేరి గుసగుస లారంభించారు. అందరూ చెవుల్లో

మాట్లాడటం, ఆదరాబాదరాగా నడవటం, తలకాయ ఎగర
వేయటం, గడ్డంకింద చెయిపెట్టుకొని ఆలోచించటం ఆరంభిం
చారు. పిలిస్తేపలకటానికిగూడ ఎవరికీతీరిక లేకుండాపోయింది.

ఈసందర్భంలో నా మటుకు నేను ప్రేక్షకుడుగావుండి
ఆనందించాలనుకున్నాను. సుశీలారావు మాత్రం అందుకు
సుముఖంగా లేడు. వివాహ సమయంలో పురోహితుడి
మోస్తరుగా నానా అవస్థ పడుతున్నాడు. వాళ్ళతో
మాట్లాడి, వీళ్ళతో మాట్లాడి, మధ్యలో మహాలింగంతో
మంత్రాలోచన చేస్తూ, నాలుగైదు రోజులు పథకనిర్మాణం
లోనే నిమగ్నుడైనాడు. ఆఖరుకు ఆరవనాటి ఉదయం
కొండయ్యనూ, మహాలింగాన్ని వెంటబెట్టుకొని నా గదిలో
ప్రత్యక్షమైనాడు.

"ఏమో చెప్పాననుకోబోకు వెంకటప్పయ్యా! ఈ
పంచాయితీ ఎన్నికలనేవి వూరియొక్క ఐదేళ్ళ జాతకాన్ని
నిర్ణయిస్తాయి. నిన్నటిదాకా పదవిలోవున్న రామిరెడ్డి గనుక
గెలిస్తే ఇక వాడికి పట్టపగ్గాలుండవు. ఊరిని ఒక కొలిక్కి
తీసుకొస్తాడు. ఊళ్లో ఖూనీలు చేయించి మాపు చేయించ
గలడు; ఇష్టం కాని వాళ్ళమీద వారంట్లు పుట్టించగలడు.
ఇకపోతే ఆ గోపాలరావు మంచివాడే. ముక్కుకు సూటిగా
పోయేరకం. కాని అతనికి ఓట్లు పడవు. అతని కులస్థులు
వంద గడపకంటె లేరు. అతను ఓడటం ఖాయం. ఈ పరి
స్థితిలో నీవు తప్ప యింకో గత్యంతరం కనిపించటం లేదు

నీవు గనుక ముందుకొస్తే గోపాలరావు తగ్గుతాడు. మనకు ప్రజల్లో మంచి స్థానం వున్నది. మనం గోదాలోకి దిగుతున్నామని తెలిస్తే రామిరెడ్డిగూడ లంగోటా బిగించటానికి జంకవచ్చు. ఈ సమయం గనుక మనం వదులుకుంటే ప్రజలకు అపకారం చేసిన వాళ్ళమవుతాం. ఇక నీ యిష్టం" అన్నాడు.

ఊళ్ళో ఏ వీధిలోకి వెళ్ళినా ప్రజలు రామిరెడ్డిని అసహ్యించుకుంటున్నారనీ, వెంకటప్పయ్యగారు నిలబడతారా అని అడుగుతున్నారనీ, మహాలింగం అన్నాడు. కొండయ్య నేనేమి చెప్పుతానోనని నా వంక ఆశగా చూస్తున్నాడు. నాకు ఏమి చెప్పడానికీ పాలుపోవటం లేదు.

"అనుభవం లేనివాణ్ణిదిగితే ఏమవుతుందో" అన్నాను.

"దిగకపోతే అనుభవం రాదుగా!" అన్నాడు సుశీలారావు.

"మనం కుఱ్ఱవాళ్ళం. మనకు ఓట్లెవరిస్తారు?"

"రామిరెడ్డిమీద ప్రజలకున్న అసహ్యమే మనబలం. అతన్ని ద్వేషించే వాళ్ళంతా మనకు ఓట్లిస్తారు."

"అయినా మనకేమంత పలుకుబడి వుంది?"

"మనకు కాకపోతే ఎవరికున్నది పలుకుబడి? శతదినోత్సవంవల్లనైతేమి, ఆటలపోటీలవల్లనైతేమి మన పేరు వీధివీధినా ప్రతిధ్వనిస్తున్నది...... ఇంతకూ అసలు సంగతి చెప్పవేం? డబ్బు దగ్గర వెనకాడుతున్నావా?"

సుశీలారావు కీలెరిగిన మనిషి!

"డబ్బు దగ్గర ఎన్నడూ సంకోచించను. ...సరే గాని అన్నిటికీ తగినవాడవు నీవే నిలబడరాదా సుశీలారావ్?"

"నేను నిలబడితే ఓట్లు పడవుగా! కారణం తరువాత చెపుతా" నన్నాడు.

స్నేహితులమాట కాదనలేక, ఫలితం ఎటుపోయి ఎటొస్తుందోననే బెంగతో-మొదటిసారిగా చెఱువులో స్నానం చేయడంకోసం వచ్చినవాడు తలను నీటిలో ముంచటానికి సంకోచిస్తూ, తోటివాళ్లు ఏమనుకుంటారోనని నరాలు బిగబట్టి ఒక్క మునుగు మునిగినట్లు - నేను పంచాయితీ బోర్డు అధ్యక్ష ఎన్నికల్లో పోటీ చేయడానికి అంగీకరించాను!

నేను నిలబడతాననేవార్త-ప్రపంచయుద్ధంలో జపాను ప్రవేశించిందన్ని వార్త మాదిరిగా-ఒక్క గంటలో తిమ్మాపురమంతటా అలుముకున్నది. కాఫీహోటళ్ళలోనూ, రీడింగు రూముదగ్గరా, పార్కులో చెట్లకింద, ప్రతిఇద్దరు మనుషులు కలిసినచోటా నన్ను గురించే అనుకుంటున్నారు. రైలులో ప్రయాణీకులు రైలు చప్పునఆగంగానే వెనక్కుతూలినట్లుగా రామిరెడ్డి నేను నిలబడుతానని తెలియంగానే 'ఆఁ'! అన్నాడట. చాలామందికి నేను నిలబడటం ఆశ్చర్యం కలిగించింది. ఇక రామిరెడ్డి వ్యవహారం నల్లేరుమీద బండిగా కాక, పల్లేరు మీద నడక అవుతుందని ఎవరో అన్నారట.

గోపాలరావుగారిని సుశీలారావు చక్కగా వశీకరణ చేసుకున్నాడు, అసలు నిలబడటానికి ఆయనదగ్గర విటమిన్ 'యమ్' లోపించింది. దీన్ని సుశీలారావు గ్రహించాడు. నేను గనుక ఎన్నికైతే గోపాలరావుగారిని ఉపాధ్యక్షుణ్ణిగా చేస్తాను అనే షరతుమీద ఆయనను మావైపు తిప్పాడు. ఆయన నా వైపు తిరగడం రామిరెడ్డికి మరొకషాక్ ఇచ్చింది. కుఱ్ఱసన్నాసులు వీళ్ళేం గెలుస్తారులే అన్న వాళ్ళుగూడ ఇకనుంచికాస్త వళ్ళు దగ్గరుంచుకొని మాట్లాడవలసిన అగత్యం కల్గింది.

ఎన్నికలు దగ్గర పడుతున్న కొద్దీ మనస్సుల్లో ఉద్రేకాలు ఇనుమడిస్తున్నాయి. సుశీలారావు ఓటర్లలిస్టులు తెప్పించి శల్యపరీక్ష చేస్తున్నాడు. బహిరంగసభలు జరిపి ఉపన్యసించవలసి వస్తుందేమోనని మొదట చాలా బెంగపడ్డాను. అలాంటి ప్రమాదం సంభవించలేదు. ఎన్నికలముందు జరిగిన ఉద్రేకాల సమయంలోని ముఖ్యఘట్టాలనుఅక్కడక్కడ పేర్కొంటాను:

"మన ఓటు ఎవరికి?" అనే శీర్షికతో ఒక కరపత్రం వేయించి అడుగున నలుగురు పెద్దమనుషుల పేర్లు వేశాం. రామిరెడ్డి కంత ఆలోచనపోలేదు. "మీఓటు నాకే" అనేశీర్షికతో రామిరెడ్డి స్వయంగా కరపత్రం వేసుకున్నాడు! చివరి రోజువరకూ కరపత్రాలు రెండు ముఠాల తరఫునా అచ్చవుతూనే వున్నాయి. మేము ఒక కరపత్రం ఈ క్రింది విధంగా వేశాం.

కరపత్రం నెం. 4.

కాలు విరిగింది !

"అయ్యో! భీమయ్యా! కాలికి కట్టుకట్టావేం?"

"ఏం చెప్పేది సోమయ్యా! కాలు విరిగిందిగా! హాహాహా!"

"ఏడువకు భీమయ్యా! అయ్యో పాపం! ఎలా విరిగింది?"

"ఆఁ ఏముంది సోమయ్యా ! మొన్నరాత్రి పొలంనుంచి పొద్దుపోయి వస్తుంటే-కటిక చీకటిగా!-కళ్ళు పొడుచుకున్నా దోవ కనిపించలేదు. వీధిదీపాలు లేకనేపోయె. అడుగడునా గుంటలూ మిట్టలూను. నీకు తెలియనిదేముంది-ఒక గుంటలో పోయి పడ్డాను. కాలు విరిగి కూలబడి బాబో అని కేకపెడితే మా పాలేరువచ్చి బుజాన వేసుకుని ఇంటికి చేర్చాడు....ఇదిసంగతి....నాలుగురోజుల నుంచి మట్టుకుంటే కాలేటువంటి జ్వరం....మూసినకన్ను తెరవ కుండా పడివున్నాను....ఆఁ... నా ఖర్మ?"

"అదేమిటి భీమయ్యా! వీధిదీపాలు లేకపోవడానికీ గుంట మిట్టలకీ నీ ఖర్మ ఎలా కారణమవుతుంది భీమయ్యా! మనంఓట్లిచ్చి గెలిపించిన ఆ రామిరెడ్డే కారణం. ఇకముందైనా మనం బుద్ధికలిగి ప్రవర్తిస్తే అదే మందు."

"అంతేలే సోమయ్యా ! బాగా చెప్పావు. చిన్నవాడైనా పెద్దబుద్ధిగల వెంకటప్పయ్యకే వోట్లిచ్చి గెలిపించటం శ్రేయస్కరం. రెండోకాలన్నా విరగకుండా ఉంటుంది !!"

ఓట్లు పడటం తరువాత సంగతిగాని ఈ కథను చదవ టం కోసం గుంపులు గుంపులుగా జనంవచ్చి కరపత్రాల కోసం ఎగబడి మరీ తీసుకువెళ్ళారు.

ఎన్నికలు ఇంకా పదిరోజుల్లోకి వచ్చినయ్ అనంగా

రాత్రి రెండుగంటలప్పుడు అవతల ముఠావాళ్లు గోపాలరావు
గారి గొడ్లసావిడికి నిప్పంటించారు. రెండువైపులనుంచిముట్టిం
చటంవల్ల కళ్లుమూసి కళ్లు తెరిచేలోగా పని జరిగిపోయింది.
నలుగురూ పరుగెత్తుకుంటూవచ్చి కాలిపోయిన వాటిని ఆర్పి
వేశారు. దీంతో వూళ్ళో కలకలం బయలుదేరింది. ఎవరిల్లు
ఎప్పుడు లేస్తుందో ఎవరూ చెప్పలేకుండా వున్నారు. జనం
పగలు నిద్రపోయి రాత్రి కాపలాలు కాచుకోటం ఆరంభిం
చారు.సాయంకాలం ఆరుగంటలకల్లా భోజనాలు పూర్తిచేస్తు
న్నారు. సరేనని కొండయ్య ఉన్నట్లుండి రామిరెడ్డి బావ
మరదిగారి 12 ఎకరాల గడ్డివామికి నాలుగువైపులా నాలుగు
అగ్గిపుల్లలు గీచి నాలుగు సీసాల కిరసన్నూనె చిలకరించి
వచ్చాడు. కుక్క-కాటుకు చెప్పుదెబ్బ కొట్టినట్లయింది. రామి
రెడ్డి ఆటకట్టింది. ఎవరూ ఎవరి గడ్డివామినీ తగులపెట్టగూడ
దని అతనొక మధ్యవర్తిచేత "సయుద్ధ ఒడంబడిక"ను పంపిం
చాడు. సుశీలారావు అంగీకారం తెలిపి పంపివేశాడు. అంత
టితో మనుష్యుల గుండెల్లో దడ కాస్త తగ్గింది,

ఎన్నికలు దగ్గరికొస్తున్నకొద్దీ కాళ్ళ తిప్పట ఎక్కు
వయింది. సుశీలారావు నన్ను కూచోబెట్టి ధోవతి కట్టుకోవ
డమూ, ఉత్తరీయం వేసుకోవడమూ నేర్పాడు. ఇద్దరమూ
కలిసి పెద్దపెద్దవాళ్ళ అందరి ఇళ్లకూ వెళ్ళాము. నేను నమ
స్కారం చేసి నిలబడేవాణ్ణి. చెప్పవలసినదంతా సుశీలారావు
చెప్పేవాడు. ఒక పది పదిహేను ఇళ్ళకు పోయేసరికి నేను

కట్టుకున్న ధోవతి మబ్బు విచ్చిపోయినట్లు జారిపోయే ప్రమాదం కలగటంవల్ల గుట్టుచప్పిడికాకుండా ఇంటికిచేరాను.

రైతులు, వ్యవసాయ కూలీలు, చేనేత పనివాళ్లూ నివసించే పేటల్లో కొండయ్యా మహాలింగంలు మరి నలుగురిని వెంట తీసుకొని ప్రచార కార్యక్రమం ఆరంభించారు. వెంకటప్పయ్యగారికే మీ వోటివ్వమని ఇంటింటికీ వెళ్ళి మహాలింగం చెప్పేవాడు. కొండయ్య వెళ్ళివస్తామండీ అని మీసం తిప్పుతూ వెలుపలికి వచ్చేవాడు! అసలు ఫైల్‌మాన్ కొండయ్యను చూడటంకోసమే వీధుల్లో జనం గుమిగూడేవాళ్లు.

సుశీలారావు బుద్ధి అందరికంటె అమోఘంగా పని చేసింది. ఎల్లుండి ఎన్నికలు అనగా ఇవ్వాల్టిరోజున బాగా ముసురుపట్టి జల్లుపడింది. దేశంలో చాలా వూళ్ళలో వర్షం పడిందని రేడియోలో చెప్పారు. సుశీలారావు నోట్లో నీళ్ళూరినయ్. సుశీలారావు స్వయంగా వెళ్ళి 50 టెలిగ్రాం కాగితాలు ఇంట్లో దాచిపెట్టి వుంచినవి తెచ్చాడు. మావూరి ఓటర్లలో వందా రెండొందలమంది నెల్లూరు, విజయవాడ ల్లాంటి దూరపు వూళ్ళలో ఉద్యోగాలూ అవీ చేస్తూవున్నారు. వాళ్ళలో నికరంగా రామిరెడ్డి ముఠాకు చెంది ఎన్నికలకు ఖాయంగా వచ్చేవాళ్ళలో ఒక యాభైమందికి "గాలివాన వల్ల ఎన్నికలు వాయిదాపడ్డయ్. రావద్దు" అని రామిరెడ్డి పేరుతో 10 మైళ్ళ దూరంలో వున్న టెలిగ్రాం ఆఫీసుకు వెళ్ళి టెలిగ్రాములిచ్చి వచ్చాడు.

ఈ సంగతి పరమానపుడికి తెలియదు. ఎన్నికలనాడు

పొరుగూళ్ళనుంచి రావలసిన జనం ఇంకా రాలేదే ఇంకా రాలేదే అని రామిరెడ్డి దారులు చూస్తూనే వున్నాడు. చివరకు విసిగిపోయి రానివాళ్ళందరికి శాపనార్థాలు పెడుతూ ఎన్నికలు జరిగే సత్రం దగ్గరకు వచ్చాడు.

ఎన్నికల ఆఫీసరు వచ్చాడు. స్త్రీలనూ పురుషులనూ వేరు వేరుగా వరుసల్లో కూచోబెట్టాడు. వస్తూవస్తున్న ఓటర్ల వంకచూస్తూ కొండయ్యమీసాలు దువ్వుతూ కళ్లు తిప్పుతూ నిలబడ్డాడు. ఎన్నికల ఆఫీసరు అసలు మునసబుగారింట్లో బస చేశాడని తెలిసి సుశీలారావు పత్రికా విలేఖరి హోదాతో ఆనాటి ఉదయమే మున్సబుగారింటికివెళ్ళి, ఆయనతోపాటు కాఫీపుచ్చుకొని, ఇంగ్లీషులో నాలుగు మంచి మాటలు మాట్లాడి వచ్చాడు. ఎన్నికల సమయంలో సుశీలారావు తోలుసంచి ఒకటి చంకన పెట్టుకొని ఆఫీసరు వెంట పచార్లు చేస్తూ ఆయనకు అయాచిత సలహా లివ్వడం ఆరంభించాడు!

ఎన్నికలు చేతులెత్తడంద్వారా జరిగినయ్. రామిరెడ్డికి 610 ఓట్లు, నాకు 650 ఓట్లు వచ్చినయ్! రామిరెడ్డి ముఖం వాడిపోయి నల్లబడిపోయింది. "ఛీ! కుట్రకుంక లొచ్చి వోడించారు" అన్నాడట. నెత్తిన గుడ్డ కప్పుకొని ఎవరి కంటికీ కనబడనట్లుగా యింటికి చేరాడు.

కొండయ్య ఎగిరి గంతేశాడు. ఉత్సాహం పట్టలేక అన్ని వందలమంది జనం చూస్తూవుండగా రెండుచేతులతో తళతళ మెరసే రెండు ఖడ్గాలు పుచ్చుకొని అరగంటసేపు అపూర్వమైన కత్తిసాము చేసి వహ్వా అనిపించాడు.

మరొక చిత్రమైన సంగతి. రామిరెడ్డి తాను గెలుస్తానవే దృఢ విశ్వాసంతో బ్యాండు మేళాన్ని, స్వారి గుఱ్ఱాన్ని ముందుగానే ఆర్డరిచ్చి తెప్పించాడు. సగండబ్బు అడ్వాన్సుగా కూడా యిచ్చాడు. ఆమేళగాళ్ళు సుశీలారావునుకలుసుకొని మిగతా సగం గనుక మేమిచ్చుకుంటే ఊరేగింపు చేస్తామని మనవి చేసుకున్నారు. అప్రయత్నంగా వచ్చిన గౌరవాన్ని జారవిడవకూడదని భావించి సరేనన్నాను. నేను గుఱ్ఱం ఎక్కాను. నాకు ఒకప్రక్క సుశీలారావు గోపాలరావుగార్లు, మరొక ప్రక్క కొండయ్య, మహాలింగములు, రాజువెంట దండనాథులు వెడలినట్లు సాగివచ్చారు. ముందు బ్యాండు మేళం చెవులు చిల్లులు పడేటట్లుగా వాయిస్తున్నారు. ఒక్కొక్క యింటి దగ్గరే పెద్దమనుషులు వచ్చి నాకు కరచాలనం చేస్తున్నారు. కొందరు పూలదండలు వేస్తున్నారు. మోయడం కష్టంగా వుంది. వళ్ళంతా చెమటకారిపోతున్నది. నాలుగు బజార్లూ తిరిగాం. రామిరెడ్డి ఇంటిముందు నిలబడి, ఆయన యింట్లో క్రిమికీటకాలకు కూడా వినబడేటట్లు తనివి తీర బ్యాండు వాయించారు. మధ్యాహ్నం ఒంటిగంటకు యిల్లు చేరాం.

నేను ఇల్లు చేరింతర్వాత పూలదండలన్నీ తీసి సుశీలారావు మెడలో వేశాను. సుశీలారావు నా బుజంమీద చేయవేస్తూ: టెలిగ్రాము లివ్వకపోతే కథ అడ్డం తిరిగేది అని నవ్వుతూ అన్నాడు!



ప్రెసిడెంటుగిరి

అధ్యక్షపదవికి ఎన్నికైనప్పటికంటె నా ఫొటో దిన పత్రికలో ప్రచురించబడ్డనాడు నాకు మహదానందంకలిగింది. ఇహ నేను పెద్దపెద్ద వాళ్ళలో జమకాబోలు ననుకున్నాను. ఇదేరోజున నాఫొటోను కొన్నివేలమంది చూస్తారుకాబోలు అనుకొని మురిసిపోయాను. నా ఫొటోను నేను ఏడెనిమిది సార్లు చూసుకున్నాను. మాఆవిడకూడ చూపించాను. "ఫొటోలో మరింత బాగున్నారే"అన్నది. నాకూ అలాగే అనిపించింది. అద్దంలోకంటె ఫొటోలోనే బాగున్నాను. ఐదేళ్ళక్రిందటతీసిన ఫొటోలో బాగుండకేం చేస్తాను ?

గోపాలరావుగారిని పంచాయతీబోర్డు ఉపాధ్యక్షుడుగా నియమించాను. ఆయన ఏనుగునెక్కినంత సంతోషపడ్డాడు. నాకు ముక్కూ ముఖమూ తెలియదని సుశీలారావును కార్య దర్శిగా వుండి వ్యవహారం నడపమన్నాను. అతను మహాఋషి పోజులో కూచొని "నాకీపదవులూ పాడూ వద్దు. తామరాకు మీద నీటిబొట్టులా వుంటాను. అవసరమైన సూచనలు మాత్రం ఇస్తుంటాను. మహాలింగాన్ని కార్యదర్శిగా వేసుకో క్షేమంగ్గావుంటుంది"అన్నాడు. మహాలింగంకూడ చెయితిరిగిన వాడే.జుట్టూజుట్టూ ముడివేయగలడు.అతన్నే నియమించాను.

రోజులు గడుస్తున్నయ్. కాగితాలమీద సంతకాలు పెడుతూనే వున్నాను. టీపార్టీలకు వెళుతూనే వున్నాను.

సభలకూ, సమావేశాలకూ హాజరవుతూనే వున్నాను. క్రొత్తలో న్యాయమూ, అన్యాయమూ అని ఆలోచించేవాణ్ణి. అంటే అర్థం చెపుతాను:"నావాళ్లు", "పరాయివాళ్ళు" అని రెండు లింగాలకింద జనం కనిపించేవారు. నావాళ్ళకే నేను ఏదీ ఒలికించకూడదనీ, జనబాహుళ్యంకోసం శ్రమించాలనీ మొదట్లో అనుకొనేవాడిని. "చాదస్తపు పోకడలు పోకు" అని సుశీలారావు అదిలిస్తుండేవాడు! "నిన్ను పెద్దనుచేసి, నీకోసం కృషిచేసినవాళ్ళను నీవు తృప్తిపరచకపోతే అది కృతఘ్నత అవునా కాదా?" అని సుశీలారావు నిలదీసి అడిగాడు. ఆలోచించినట్లు ఆలోచించి అవునన్నాను. "మరి వాళ్ళ కోరికలు ఈడేర్చు" అన్నాడు.

"మరి అయితే నాకు వ్యతిరేకంగా ఓటుచేసినవాళ్ళు మాత్రం పౌరులు కారా ? వాళ్ళకోర్కెలు తీర్చనద్దా ?" అన్నాను అమాయకంగా.

"వెంకటప్పయ్యా! ఇది ప్రజాస్వామ్యయుగం. ప్రజాస్వామ్యయుగంలో ప్రజాసేవ అంటే అధికసంఖ్యాకులకుచేసే సేవ అని అర్థం. ఇపుడు మనం ఎన్నికల్లో గెలిచాం. మన వాళ్ళు అధికసంఖ్యాకులు. వారికి సేవచేయడమే ప్రజాసేవ అవుతుంది. పోనీ అవతలిపార్టీవాళ్ళకు చేస్తానంటావా? వాళ్లు అల్పసంఖ్యాకులుగదా! వాళ్ళకు సేవచేస్తే అధిక సంఖ్యాకులు అసంతృప్తి చెందుతారు, అదితప్పు. అదిపద్ధతికాదు.

కనుక అధికసంఖ్యాకులైన నీవాళ్ళకు నీవు సేవచేయటమే ధర్మం" అన్నాడు.

సుశీలారావు చెప్పిన వ్యాఖ్యానం నాకు నచ్చేటట్లు చేసుకున్నాను. రోజులు గడచినకొద్దీ నామనస్సు ఘనీభవిస్తున్నట్లు కనపడింది. ప్రజాసేవ అనేదానికి మా అమ్మగారు చెప్పినట్లు పదిమందితోటిమనుషుల పెదిమలమీద చిరునవ్వు చిలకించే చర్య అనే నిర్వచనం నా మనస్సులో మెదలుతూనే వున్నది: నా మెడలో పడిన పూలదండలూ అవీ గుర్తుకు తెచ్చుకుంటే నేను చేస్తున్న ప్రజాసేవ నాపెదిమిల మీదనే చిరునవ్వు చిందించే చర్య అయిపోయింది !

పంచాయితీబోర్డు తరఫున వేలంపాటలు పాడించవలసి వచ్చింది. కొండయ్య మేనమామకొడుకు పోలయ్య ఒకడున్నాడు. వాడిపేరుతో చేపలు పట్టుకోడానికి,కాలవగట్టున గడ్డి కోసుకోడానికీ చౌకలో పాట కొట్టివేశాను.మహాలింగం పెదనాన్నగారి అల్లుడితమ్ముడు ప్రసాదరావు ఒకడున్నాడు. అతను రెండుమూడుసార్లు స్కూలుఫైనలు పరీక్షకుపోయి తడవకు రెండుమూడు సబ్జక్టులలో ప్యాసయ్యేవాడు. అన్నీ ఒక్కసారే ప్యాసుకావడం కుదరదని ఊరుకున్నాడు.అతన్ని పంచాయతీబోర్డుగుమాస్తాగా నియమించి నెలకు80రూపాయలిస్తున్నాను. అంతకంటే ఎక్కువ ఇస్తే బాగుండదని సందేహించాను. ఇతనుగాక ఇదివరకు ఎన్నికలప్పుడు మావైపున బాగా పైకానుపడి కొండయ్యకు కుడిభుజంగావున్నటువంటి

వీరయ్యను పంచాయతీబోర్డు జమానుగా నియమించి మెడలో ఒక డవాల్ వేశాం. మహాలింగం ఇంటిముందరిగదిలో పంచాయతీ ఆఫీసుపెట్టి అద్దెక్రింద నెలకు ఇరవైరూపాయలు మహాలింగానికి ముట్టచెబుతున్నాను.

సుశీలారావు ప్రోత్సాహం వల్లమహాలింగం కంట్రాక్టరుగా పనిచేయడం ఆరంభించాడు. లాభాలుచెరిసగం అనే ప్రాతిపదికమీద గోపాలరావుగారు పొలమమ్మిమూడువేలు తెచ్చి పెట్టుబడిపెట్టాడు. మహాలింగం భార్యమెడలో నగలు తాకట్టుపెట్టి స్వయంగా వెయ్యిరూపాయలు సమకూర్చుకున్నాడు. మావూరి పంచాయతీబోర్డు పనులన్నీ మహాలింగానికి వప్పగించాను.

వూరిముందరి పంటకాలువకు వంతెన కట్టించవలసి వచ్చింది. కంట్రాక్టరు మహాలింగానికి పని వప్పగించాం. అతను సూపరింటెంగు ఇంజనీరుదగ్గరకుపోయి ఐదువందలు చేతులోపెట్టి ఆరువేలరూపాయలకు ఎస్టిమేషన్ మీద సంతకాలు చేయించుకువచ్చాడు. వంతెన పూర్తి అయింతర్వాత మహాలింగం నా చెవులో వూదాడు:వంతెనకు అయిన ఖర్చు నాలుగువేలు మాత్రమేనసీ, అందుచేత నికరలాభం రు1500 లనీ!......నాకు మహాలింగం ఒకచేతి గడియారం బహూకరించి నా పాతరిస్టువాచి తాను పుచ్చుకున్నాడు. ఇందులో గూడ అతను నికరంగాచేసిన కర్చు 40 రూపాయలుంటుందేమో! నాకు గడియారం బహూకరించానసేసంతృప్తి అతని

కున్నది; తనచేతికి సరిగా నడుస్తున్న వాచీ వచ్చింది. భేష్ అనుకున్నాను.

ప్రాణంవున్న మనుషులు ఇవ్వాళవుండి రేపు పోతారు గాని ప్రాణంలేని రాళ్ళే ఎల్ల కాలం వుంటయ్. అందుచేత చదునైన తెల్ల రాతిమీద పంచాయితీబోర్డు సభ్యుల అందరి పేర్లూ యింటిపేర్లతో సహా చెక్కించి ఆ వంతెన ముందర పాతించాం. ఇప్పటికీ మా సభ్యులు చాలామంది రోజూ చెంబుపుచ్చుకొని వూరి బయటికి పోయినపుడు వంతెన దాకా వెళ్ళి ఎవరిపేర్లు వాళ్ళు చూచుకురావడం దైనందిన కార్యక్రమంగా పెట్టుకున్నారు!

స్థానిక పరిపాలనా శాఖామంత్రిగారు ఏవూరునుంచో వస్తూ మా వూరిమీదుగా ఏదో వూరు వెళుతున్నారు గనుక వారి భక్తకోటికి చెందిన మేము వారిసిదర్శించి ఉచితమైన మర్యాదలు చేయవచ్చునని పంచాయతీలమీద అజ్మాయిషీ చేసే ఆఫీసరుగారినుంచి లేఖ వచ్చింది. అయితే ఆనాడు వారికి పూలమాలలు వేసి పసందైన భోజనమూ, ఫలహారమూ ఏర్పాటుచేసి నమస్కారం చేద్దామని నేనన్నాను.సుశీలారావు నామాటకునవ్వి"మహానైవేద్యమూ అవసర నైవేద్యమూ సమర్పిస్తే చాలు ననుకుంటున్నావ్? ఈ మాత్రపు నైవేద్యం పట్నంలో దొరకక-నేనా ఆయన ఇటు వేంచెయ్యటం?" అని అడిగాడు.

నా జవాబుకోసం ఆగకుండా సుశీలారావే చెప్పాను

పోతున్నాడు. "ప్రజలచేత ఎన్నుకోబడినవారు కావడాన ప్రజల దగ్గరకు అడపాతడపా వస్తుంటారు. ప్రజలలో తమకు పలుకుబడి వున్నట్లు తృప్తిచెందటంకోసం ఈ పర్యటనలు చేస్తారు. అందుకు అనుగుణ్యమైన కార్యకలాపాలు మనం ఏర్పాటు చేయవలసి వుంటుంది" అన్నాడు. సుశీలారావు సూచనల ప్రకారం ఆనాటిసాయంకాలం తిమ్మాపురంలో బ్రహ్మాండమైన బహిరంగసభ ఏర్పాటు చేయబోతున్నామనీ, ఆ సభలో తాము ఉపన్యసించవలసిందనీ మంత్రిగారికి వినయవిధేయతలతో గూడిన లేఖ వ్రాసి పంపాము. మా మనవిని సంతోషంగా అంగీకరించామని శ్రీవారినుండి మూడోనాటికల్లా జవాబు వచ్చింది.

మంత్రి అంతటి వాడు రావటం మావూరి చరిత్రలో అదే మొదటిసారి. "మంత్రిగారికి ఊపిరి సలుపుకోటానికి గూడా తీరిక లేకపోయినప్పటికీ వెంకటప్పయ్యగారు ఘాటుగా వ్రాసి పిలిపించబట్టి ఆయన వస్తున్నాడుసుమా" అని కొండయ్య ప్రభృతులు కనపడ్డ వారికల్లా చెప్పారు. రామిరెడ్డి పదిసంవత్సరాలనుండి ప్రెసిడెంటుగిరిలో వుంటే ఒక్క మంత్రిగాని వచ్చాడా అనిగూడా అన్నారు. "అవును బాబూ అవును. శంభులింగ మంతటివాణ్ణి రప్పించగలవాడు మంత్రిగార్నిమటుకు రప్పించలేకపోతాడా? వయస్సు చిన్నదైనా మనస్సు పెద్దదే" అని ముక్కుమీద వేలు వేసుకున్నారు మనుషులు.

హైస్కూలు ఆటస్థలంలో వారంరోజులు కూలీలను పెట్టి పందిళ్ళు వేయించాం. పట్నంనుండి మైకు తెప్పించాం. హైస్కూలునుంచి బెంచీలు తెప్పించి వేయించాం. మేం పిలిపించకుండానే పోలీసులువచ్చి కాపలా కాశారు. హైస్కూలు తెలుగుపండితులుగారిచేత మంత్రిగారిమీద చక్కని పద్యాలు వ్రాయించాం. సాయంకాలంపూట శివాలయంలో కూచొని ఆయన రమ్యంగా పురాణకాలక్షేపం చేస్తూవుంటారు. అదే ఫణితిలో ఆయన తాను రచించిన ప్రశంసాపద్యాలను సభలో రాగయుక్తంగా చదివి సభికులను అనందింపజేశాడు. ఆ పద్యాలలో ఒకదాన్ని ఇక్కడ పొందుపరుస్తున్నాను—

అలనాడు రఘురాము నడుగులస్పర్శచే
జడమైన శిలలోన జవముకలిగె !
ఈ రోజు ఓమంత్రి నీరాక చేతనే
తిమ్మాపురంబులో తేటకలిగె !
అలనాటి భోజుని యూననంబునుగాంచి
అజ్ఞాని సుజ్ఞాని ఆయెనయ్యా
విమలాత్మ ! తమ దర్శనము చేసినంతనే
మా ప్రజ కష్టాలు మరచిపోయె !
మాదు లోకలుబోర్డుల మంత్రివర్య !
భవ్యగుణ భూష వికసిత దివ్యవేష
అందుకొనుమోయి మేమిచ్చుస్వాగతంబు
కాచుగావుత మిము నీలకంఠుడెపుడు.

సుశీలారావుచేత ఒక స్వాగతపత్రం వ్రాయించి మా పంచాయతీబోర్డు తరఫున సమర్పించాం. దానిని మహాసభలో నేనే చదవవలసిన ప్రమాదం ఏర్పడుతుందేమోనని భయ పడ్డాను. కాని అలనాడు గజేంద్రుణ్ణి శ్రీకృష్ణుడువచ్చి ఆదుకున్నట్లు ఈనాడు గోపాలరావుగారు సమయానికి వచ్చి సహాయపడ్డారు. అందులో మంత్రిగారు స్థానికసంస్థలకు అపూర్వమైన సేవ చేస్తున్నారనీ, వారివెనుక మావూరి ప్రజ లంతా నిలబడివున్నారనీ హామీఇచ్చాం. మావూరుగుండా ఒక కంకరరోడ్డు వేయించి దానిమీద టంగుటూరునుంచి మావూరిమీదుగా కోనంగివరకు బస్సువేయించాలనీ, మా వూరికి ఎలెక్ట్రిసిటీ గనుక వస్తే వూళ్ళో పళ్ళతోటలూ అవీ వేయవచ్చునని కూడ వ్రాశాం.

ముందుగా సుశీలారావు మంత్రిగారి చెవులో ఏదో వూదాడు. తరువాత మంత్రిగారు ముచ్చటిస్తూ మా కోరి కలు చాలా న్యాయంగా కనిపిస్తున్నాయనీ, తన చేతుల్లో వున్నంతవరకు చేస్తాననీ అన్నారు. కొండయ్య ఆధ్వర్యాన సభికులు మంత్రిగారి ఉపన్యాసంలో ప్రతివాక్యం చివరా హర్షధ్వానాలు చేశారు. సభ జయప్రదంగా ముగిసింది. మంత్రిగారు పూలదండలు చేత్తో పుచ్చుకొని కారులో రివ్వున వెళ్ళిపోయారు.

మరునాడు "ఐతే సుశీలారావ్ ! మనవూరికి కంకర రోడ్డు, ఎలెక్ట్రిసిటీ వస్తయ్యంటావా?" అని అడిగాను.

"కంకరరోడ్డు వస్తుంది. ఎలెక్ట్రిసిటీ మాత్రం రాదు." అన్నాడు.

"మరయితే నీవింత హంగామా ఎందుకు చేయించావ్?" అన్నాను.

"ప్రజలు హంగామాతో తృప్తిపడతారు.పని జరక్కపోయినా అంతగా పట్టించుకోరు...ఇకనుంచి ప్రజలు మంత్రిగారు ఏదో చేస్తారని ఆశపడుతూ వుంటారుగాని నన్ను చెయ్యమని వేధించరు. ఇదీ లాభమే గదా" అన్నాడు.

లోకం పోకడ యిలా వుంటుంది కాబోలనుకున్నాను.

---

## కొత్తగ్రహం

తిమ్మాపురం సిర్కాలో వెంగళాయపాలెం అనే ప్రఖ్యాతి చెందిన గ్రామం ఒకటి వున్నది. అక్కడ నిజం చెప్పాలంటే దమయంతి అనే నాజూకు తెలిసిన యువతివలన ఒక ఏకాంత సమరం జరిగింది. ఆ వూరిలో యిద్దరు ప్రముఖులు ఒకరికి తెలియకుండా ఒకరు ఆమెయొక్క కటాక్ష వీక్షణాల కోసం తంటాలు పడుతున్నారు; సమయం కోసం వేచివున్నారు. ఒకనాటి అర్ధరాత్రి ఆమె భర్త గ్రామాంతరం వెళ్ళడంజూసి ఆ యిద్దరు పెద్దమనుషులూ

ఘుమఘుమ లాడుకుంటూ యింట్లో ప్రవేశించారు. ఒక మోతాదు తాటి పానీయం పుచ్చుకొని మరీ వచ్చారు. ఇద్దరూ పంచపాళీలో తారసిల్లారు. ఒకరిమీాద ఒకరు అసూయ చెందారు. ఒకరు దుడ్డుకర్రా, మరొకరు రోకలీ పుచ్చుకొని భీమ బకాసురుల మోస్తరుగా కలియబడ్డారు. దమయంతీదేవి మోహినీదేవి లాగ నిలబడి చూస్తున్నది.

ఇది ఇలావుండగా యిలా జరగబోతుందని ముందుగా ఆఘ్రాణించిన ఆ వూరిలోని ఒక సామాన్యుడు ఆమె భర్త లింగయ్య పోయిన వూరికి ఆనాటి సాయంకాలమే వెళ్ళి జరుగనున్న ప్రమాదాన్ని చూచాయగా చెప్పి అతన్ని రాత్రివేళ వెంగళాయపాలెం తీసుకొని వచ్చాడు. మన వీరు లిద్దరూ కలహించుకొనే సమయానికి అతను దొడ్డి గుమ్మం గుండా యింట్లో ప్రవేశించి ఒక బల్లెం పుచ్చుకువచ్చి ఆ యిద్దరి మీాదికీ బలంకొద్దీ విసిరాడు. ఆకస్మికంగా ప్రవేశించిన ఆ మూాడో వ్యక్తిని చూచి వాళ్ళిద్దరూ కంగారుపడి ప్రక్కకు తప్పుకున్నారు. ఆ బల్లెం వెళ్ళి అక్కడే నిలబడి వున్న దమయంతి వక్షస్థలంలో దిగిపోయింది. ఆమె కెవ్వున కేకవేసి నేలకొరిగింది.

ఇంతలో చుట్టుపక్కలవాళ్ళంతా వచ్చారు. వూరిపీడ విరగడైందనుకున్నారు. మరునాడు లాటీలు తిప్పుకుంటూ పోలీసులు వచ్చారు. ఒక ఖూనీ జరిగితే చాలు, పోలీసుల

కడుపు నిండుతుంది. ఎంతమందిని కేసులో యిరికించవచ్చునో అంతమందినీ యిరికించారు. దమయంతికోసం వచ్చిన యిద్దరు యువకులూ ఒకరిమీద ఒకరు ఈర్ష్యతో చివరకు ఆమెనే చంపివేశారని ప్రాసిక్యూషన్‌లో వ్రాశారు. ఆమె భర్త ఆ నాడు గ్రామంలో లేడనీ ఆయన వచ్చేసరికి దమయంతి చంపబడి వున్నదనీ వ్రాశారు.

ఆయిద్దరిలో ఒకడైన పుల్లయ్య ఆవూరి మునానాయకుడు. యాభైగొఱ్ఱుల వ్యవసాయం వున్నది. అతని చేతిలో చక్రం వున్నది. కొన్నివందల రూపాయలు గ్రామస్థులకు అప్పులిచ్చి అందరినీ తన చెప్పుక్రింద తేళ్ళలాగ వుంచుకోగలిగాడు. ఇప్పుడు వచ్చిన ఖూనీ కేసు ఒక లెక్కలోదికాదు. ఒక వెయ్యిరూపాయలు తనవి కావనుకుంటే గాలికి కొట్టుకుపోతుంది. ఐతే కథ వ్యతిరేకమయింది. దమయంతి భర్త అయిన లింగయ్య, ఖూనీచేసినది తానేగనుక, ముందుగానే జాగ్రత్తపడ్డాడు. ఒక వెయ్యి పోలీసులకు సమర్పించి నమస్కారం చేశాడు. ఆమెభర్త ఆమెను చంపటం అసంభవమనీ, చంపవలసిన అగత్యం లేదనీ తర్కయుతంగా వ్రాసుకున్నారు. హత్యకు ఎవరో ఒక కర్తవుండాలి గనుక దాన్ని పుల్లయ్యమీద పెట్టేశారు.

తాను హత్య చేయకుండా నేరం తనమీదికి రావడం పుల్లయ్యకు విషాదం కలిగించింది. చెయ్యని నేరంనుంచి తప్పు

కోటానికి పోలీసులకు లంచమివ్వటం గూడ కృత్రిమంగా తోచింది. సుశీలారావు పోలీసుల గురుస్థానంలో వున్నాడని ఆనోట ఆనోట విని పుల్లయ్య నాదగ్గరికి వచ్చాడు. జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పి ఎలాగైనా శిక్ష పడకుండా చేయాలని ప్రాధేయపడ్డాడు. నే నతన్ని సుశీలారావుదగ్గరకు తీసుకువెళ్ళి వప్పగించాను.

సుశీలారావు ఎగిరి గంతువేశాడు. పుల్లయ్య గనుక మనవాడైతే ఇహ ఫిర్కాలో మనమాటకు ఎదురుండదని అతని నమ్మకం. నేనూ సుశీలారావూ కలిసి సర్కిల్ ఇన్‌స్పెక్టరు ఇంటికి పోయాం. అతను మాకు పలహారమూ కాఫీ ఇప్పించి "మళ్ళీ మా పోలీసులమీద ఏమైనా నేరాలు తీసుకొచ్చారా సుశీలారావుగారూ?" అన్నాడు నవ్వుతూ.

"అయ్యో! మనం మనం తోడుతోడుగా వుండవలసిన వాళ్ళం తప్పు లెన్నుకుంటామటండి!" అని సుశీలారావు అన్నాడు. ముగ్గురమూ కాసేపు లోకాభిరామాయణం మాట్లాడుకున్నాము. అమెరికాదేశంలో జరిగే దొంగతనాలను గురించి సర్కిల్ ఇన్‌స్పెక్టరు చిత్రవిచిత్రమైన సంగతులు చెప్పాడు.

సుశీలారావు నిదానంగా వెంగళాయపాలెం ఖూనీకేసు గురించి ప్రస్తావించాడు. జరిగిన కథంతా ఉన్నదున్నట్లు చెప్పి వేశాడు. హత్యచేసినవాడు పుల్లయ్య కాడు గనుక అతన్ని ఎలాగయినా సరే నేరంనుంచి తప్పించాలని మనవి

చేశాడు. సర్కిల్ అంతా విని "మీరు చెప్పింది సమంజ సంగానే వుంది. కానీ ఆ దమయంతి చచ్చిపోయింది గద. ఆ మరణానికి కారణం ఎవరిమీద మోపాలో చెప్పండి" అని అడిగాడు.

లాయరు తన వాదాన్ని సిద్ధం చేసుకొని వచ్చినట్లు సుశీలారావు దగ్గర ఈ ట్రాజెడీకి మరొక చక్కనికథ రెడీగా వుంది.

"పుల్లయ్య ఒక నెలరోజుల్లో తన కొడుక్కి పెళ్ళి చెయ్యబోతున్నాడు. ఆ పెళ్ళికి లింగయ్యను ఆహ్వానిద్దా మనీ, తనకు డబ్బు సహాయం చేస్తాడేమో అడుగుదామనీ వెంకయ్యను తోడుతీసుకొనిరాత్రి భోజనానంతరం సిగరెట్ కాల్చుకుంటూ లింగయ్యగారింటికి వచ్చాడు. అప్పుడే దమ యంతి గేదెలకు గడ్డివేయాలని సావిట్లోకి వెళ్ళింది. భర్త కోర్టు పనిమీద టంగుటూరు వెళ్ళాడని చెప్పింది. చీకట్లో మచ్చుమీదవున్న జనపకట్టెలను బలంగా కిందికి లాగింది గేదెకువేద్దామని. ఆ జనపకట్టెల ప్రక్కనే పలుగుగూడా వుండటం వల్ల అదిగూడ నిటారుగా కిందికిజారి దమయంతి గుండెల్లోకుండా దూసుకొని పోయింది. పుణ్యానికి పోతే పాపమెదురయిందనుకొని పుల్లయ్య వెళ్ళి ఇరుగుపొరుగు వాళ్ళను పిలుచుకొని వచ్చాడు. కోర్టుపనిమీద వెళ్ళిన లింగయ్య బస్సు ఎక్కి సగం దూరంపోయిన తర్వాత ఏవో దస్తావేజులు మర్చిపోయినట్లు తెలుసుకొని ఎదురుబస్సులో తిరిగివచ్చి ఇంటికి రాత్రి 12 గంటలకు చేరాడు.వచ్చి జరిగిన

దుస్సంఘటన చూసి నిర్ఘాంతపోయాడు.” అని ప్రాసిక్యూషన్ కథను వ్రాయవచ్చునని సుశీలారావన్నాడు.

సర్కిల్ ఇన్స్పెక్టరు ఈ కథకు ముగ్ధుడై పోయాడు. కాని పుల్లయ్యకూ లింగయ్యకూ అంతకు పూర్వం విరోధం లేదనీ, మిత్రులుగానే వున్నారనీ నిరూపించటం అవసరమన్నాడు. సరే నేను దానికి మార్గం వెతికి తెలియజేస్తానని సుశీలారావు చెప్పాడు. కృతజ్ఞత తెలిపి వచ్చేశాం.

లింగయ్యా పుల్లయ్యా లిద్దరూ చెరొకసారి వచ్చి మహాలింగందగ్గర గత సంవత్సరం ఫొటోలు తీయించుకున్నారు. ఆ ఫొటోలనెగటివ్ లు ఇప్పటికీ మహాలింగం దగ్గర వున్నయ్. సుశీలారావు సూచనప్రకారం వాళ్ళ ఫొటోలు రెంటినీ కలిపి ఒక్క ఫొటోగా తీసి ఇద్దరూ ఒకే ఫొటోలో కూచున్నట్లు తయారుచేశాడు. దాన్ని సుశీలారావు సర్కిల్ ఇన్స్పెక్టరుకు అందజేశాడు. “లింగయ్యా, పుల్లయ్యలు స్నేహితులుకారని ఎవరనగలరు?” అని దానివెనుక వ్రాసి పంపాడు.

ఏతావాతా వచ్చిన ఫలిత మేమంటే, పుల్లయ్యా అనే విశ్వాసపాత్రుడైన క్రొత్త మిత్రుని సంపాదించాం. అతని వ్యక్తిగత రహస్యాలు మాకు తెలియటంవల్లనో ఎందువల్లనో గాని అతను మాకు శాశ్వత మిత్రుడయినాడు. అతనికొడుకు వివాహానికి మే మందరం స్పెషల్ బస్సువేసుకొని ఒక యాభైమందిమి వెళ్ళాం. పుల్లయ్యకు ఇంత అండవున్నదా అని అందరూ విస్తుపోయారు. సుశీరాలావు పెండ్లికొడుక్కి

మిల్టరీ యూనిఫారం పట్నంనుంచి ఖరీదుచేసి తెప్పించి చదివించాడు. నేను వెండిపొన్ను వేసిన చేతికఱ్ఱను పుల్లయ్యకు బహూకరించాను. మా వాళ్ళందరం మొలతాళ్ళు తెగేట్లు తిని, చాపలు చినిగేట్లు నిద్రపోయి, రెండెడ్లబళ్ళను మోటారు బళ్ళమాదిరిగా తోసుకుంటూ ఇళ్ళకు చేరాము.

“మనం ఈనాడు ఒకరికిచేసే సహాయం మరొకనాడు మనకు పెట్టుబడి అవుతుంది” అని సుశీలారావు నాతో అన్నాడు !



## యముడు చేసిన సహాయం

రాత్రి ఎనిమిది గంటలప్పుడు తాచుపాము కాటు వేసింది. “ఒరే! నాయనా ! చచ్చాన్రో” అంటూ రామ సుబ్బయ్యగారు పంటకాలువ గట్టుమీద పడిపోయినాడు. చేలల్లోపారపని చేసుకొనేవాళ్ళు ఇళ్ళకు బయలుదేరివస్తూ ఈ కేకవిని పరుగుపరుగున పోయి రామసుబ్బయ్యగారిని బుజాన వేసుకొని ఇంటికి చేర్చారు. ఆయనభార్య నెత్తీనోరూ బాదు కుంటూ శోకాలుపెడుతూ కూచున్నది. పసిపిల్లవాడు భయంతో తల్లిని చాటుచేసుకొని ఏడుస్తున్నాడు. వైద్యుడు వచ్చాడు. కాటువేసిన చోట గాయం లోతుగానే పడింది. నాడి ఆడుతూనే వుందిగాని నోట మాటలేదు నురుగులు కక్కుతున్నాడు.

నేనూ సుశీలారావూ చూడటానికి వెళ్ళాం. పాము కాటని నిర్ధారణ అయింది. వెంటనే ఒకమనిషికి సైకిలిచ్చి మంత్రం వేయించడంకోసం టెలిగ్రాఫ్ ఆఫీసుకు అర్ధరాత్రి పుడు పంపించాం. అతను తిరిగి రాకముందే ఇక్కడ రామ సుబ్బయ్యగారు కాస్తా 'హరీ' అన్నాడు.

వూళ్లో మిగిలివున్న సత్యకాలపు మనుషుల్లో ఆయన చివరివాడు. ఆయన అజాతశత్రువు. జీవించివున్నంత వరకు ఒకరిని ఇబ్బంది పెట్టలేదు. గుండులాంటి మనిషి ఇంతసునా యాసంగా కాలంచేయటం అందరికీవిషాదమూ ఆశ్చర్యమూ కలిగించింది. ఆయన మావూరి కోఆపరేటివ్ సొసైటీకి అధ్యక్షుడు; నరసింహస్వామి దేవాలయానికి ధర్మకర్త.

మా మిత్రులం నలుగురమూ నాలుగు వీధుల్లోకి పోయి దుఃఖాన్ని వెళ్ళబోసి వచ్చాం. "మనగ్రామం నుంచి ఒక మహాఋషి అస్తమించాడు" అని సుశీలారావన్నాడు... "రామసుబ్బయ్యగారు నాకు సాక్షాత్తూ గురువు" అని నేను చెప్పాను..."ఇంత మహనీయుడుగదా! ఒక్కఫొటో తీస్తాను. తీయనివ్వండి. నాకు దమ్మిడీ ఇవ్వనవసరంలేదు అని నే నడిగితే- ఛీ!-ఛీ! నాకెందుకురా ఫొటోలూపాడూను, అన్నా డాయన! కీర్తికోరని కర్మయోగి రామసుబ్బయ్యగారు" అన్నాడు మహాలింగం... "దీ న్తస్సదియ్యా! ఈ పామెట్లా కరిచిందంట! ఆ కాటు ఆయనకుగాదు, ఈ గ్రామానికే వేసింది" అని కొండయ్య అన్నాడు.

ఆయన కాలం చేసినందుకు సంతాపసూచకంగా గ్రామంలో హైస్కూలు, ఎలిమెంటరీస్కూళ్లు మూసివే యించాం బడిపిల్లలకు ముఖంలో విషాదం వెలబుచ్చాలని తెలియక గుజ్జుపుగంతులు వేస్తూ వీథుల్లోపడ్డారు! వూళ్లో షాపులన్నీ మూయించాం. ఎవరైనా మేము అటుపోవటం చూసిగనుక మళ్ళీ తలుపు తెరిస్తేగల్లాపెట్టె చంకనెట్టుకుపోతాం సుమా అని నిష్కర్షగా చెప్పాం. దేవాలయానికి ధర్మకర్త అయిన రామసుబ్బయ్యగారు దేహం చాలించారు గనుక నరసింహస్వామి దేవాలయాన్ని ఆ నాడు మూసివేయమని కొండయ్య వెళ్ళి పూజారితో చెప్పాడు. పూజారి ఆనాడు గుళ్లో దీపం వెలిగించలేదు!

రామసుబ్బయ్యగారు కాలంచేసిన మరునాటినుంచీ గ్రామంలో ముగ్గురు పెద్దలు ప్రతిరోజూ దేవాలయానికివెళ్ళి ప్రదక్షిణాలు చేయడం ప్రారంభించారు. వాళ్లు ఇదివర కెన్నడూ దేవుడి గడప తొక్కిన పాపానపోలేదు. ఎటునుంచి ఎటు ప్రదక్షిణం చేయాలో బహుశా ఎరిగుండరు. అలాంటి వాళ్ళకు ఇంతటి భక్తి ఎలాకలిగిందా అని సామాన్యులకు సందేహంవేసింది. రామసుబ్బయ్యగారి మరణంవల్ల వీరిలో వైరాగ్య బీజాలు మొలకెత్తి ఆకులు వేస్తున్నాయేమోనని నే ననుకున్నాను. కాని సుశీలారావు మెల్లగా చెవిదగ్గరకు వచ్చి చెప్పాడు. "దేవాలయానికి ధర్మకర్తల మవుదామని ముగ్గురు మనుషులు ముచ్చటపడుతున్నారు. రోజూ దేవా

లయంలో హోజరు చెప్పుకుంటూ పైవాళ్ళకు దరఖాస్తు పెట్టుకున్నారట" అన్నాడు.

నాకళ్ళు తెరిపిడిపడ్డయ్, వైరాగ్యమూ కాదు శృంగారమూ కాదు. వ్యవహారమన్నమాట! "సరేమరి. తురుపు దించావా? లేక ముక్కలు కింద పారేశావా?" అన్నాను.

"జోకర్లు చేతులో వుండగా ముక్కలు పారేస్తానా?" అని ఒక్క నవ్వునవ్వి జేబులోనుంచి ఆనాడే వచ్చిన ఒక కవరుతీసి చూపించాడు. దేవాలయ ధర్మాదాయ బోర్డు వారినుంచి వచ్చిన ఆర్డరది. అందులో మా కంట్రాక్టర్ మహాలింగాన్ని నరసింహస్వామి దేవాలయానికి ధర్మకర్తగా ఐదేళ్ళపాటు నియమిస్తూ ఆజ్ఞ జారీచేయబడింది! ఈ ఆర్డరు ఎలా పుట్టించగలిగావని నేను అడగలేదు. మహామహా పనులు చేయగల సుసీలారావు ఈ పని సాధించుకు రావటంలో చిత్రమేమీలేదు.

ఆనాటి సాయంకాలం మొదటిసారిగా నలుగురమూ కలిసి దేవాలయానికి వెళ్ళాం.నూతన ధర్మకర్త మహాలింగం విచ్చేస్తున్నాడని తెలిసి పూజారి పులిహూర ప్రసాదంచేసి ఫలహారం పెట్టినట్లు పెట్టాడు. ఇంట్లోచేసే పులిహోర ఆలా వుండదేమని చాలాసేపు చర్చించి వదిలేశాం. తర్వాత కొన్నాళ్ళకు పూజారి చెప్పాడు: "కొత్తనీటి తాకిడి ఆగిందండోయ్" అని!

దమయంతీదేవి స్వయంవరానికి యువరాజులంతా ముస్తాబై వచ్చి నేనంటే నేనని పోటీపడ్డట్లు కోఆపరేటివ్

సొసైటీ అధ్యక్షపదవికిగూడా నేనంటే నేనని ఇద్దరు ముగ్గురు మనుషులు ఉబలాట పడుతున్నారు. ఈసొసైటీతరఫున సన్న కారు రైతులకు కొద్దివడ్డీలమీద సర్కారువారుఅప్పులిస్తారు. రామసుబ్బయ్యగారు సొసైటీకి అధ్యక్షుడు కావడంవల్ల ప్రజలకంటికి ఆయన ఆపద్బాంధవుడుగాను, కల్పవృక్షముగాను కనిపించాడు. శాస్త్ర చదవడమూ వ్రాయడమూ తెలిసి భోజనం చేయటంతప్ప వేరే చెప్పుకోదగ్గ పనిలేని ముగ్గురు పెద్దమనుషులు ఇపుడు సొసైటీని జేబులో వేసుకోవాలని ఉవ్విళ్ళూరుతున్నారు. పదిమంది డబ్బు కక్కుర్తిగలవాళ్ళు తన ఇంటిచుట్టూ తిరుగుతుంటే అదొక గౌరవం గూడాను. ఇవ్వడం సర్కారు డబ్బయినా తాతముల్లె ఇస్తున్నంత ఠీవిగా మాట్లాడవచ్చు. ఇన్ని ఉద్దేశ్యాలతో వాళ్ళుఆలోచించారు.

చదరంగం ఆడేవాళ్ళలాగ ఒకరికి తెలియకుండా ఒకరు ఎత్తులు వేస్తున్నారు. ఒకరు కోపరేటివ్ ఇన్‌స్పెక్టరుకు బస్తా బియ్యం బహుమానం పంపించాడు. మరొకడు రామ సుబ్బయ్యగారు చావకముందే తనను అధ్యక్షుడుగా వుండ మని వీలునామా రాశాడని అమాయకుల దగ్గరకు పోయి కోస్తున్నాడు. పాముకాటుతో చచ్చినవాడు విల్లు ఎపుడు రాశాడో! మూడోవ్యక్తి సొసైటీకి తాను ఉపాధ్యక్షుడను గనుక అధ్యక్షుడు కాలంచేసిన తర్వాత లెఖ్ఖప్రకారం తానే అధ్యక్షుడ నంటాడు.

సుశీలారావు కర్మవీరుడు. అందరూ మాటలు ముందు చెప్పి పని తరువాత చేస్తారు. సుశీలారావు పనిముందు చేసి,

తరువాత ఓపిగ్గా కబుర్లు చెపుతాడు... రామిరెడ్డికి ఒక దాయాది వున్నాడు. అతని పేరు కోటిరెడ్డి. ఇద్దరికీ పచ్చి గడ్డి వేస్తే భగ్గుమంటుంది. దాయాదివుంటే వేరే అగ్ని అవ సరంలేదని చెప్పనే చెప్పారుగా! ఒకనాడు సుశీలారావు కోటిరెడ్డిమీద ఒక చిరునవ్వు పారేశాడు. కోటిరెడ్డి కుర్చీ చూపి కూచోమన్నాడు. సుశీలారావు యివ్వవలసిన మోతా దులో "యింజక్షన్" యిచ్చాడు. ఇద్దరూ సరేనంటే సరే ననుకున్నారు. సుశీలారావు తిరిగివచ్చాడు. సుశీలారావు కోపరేటివ్ సొసైటీ సభ్యుల జాబితా ఒకటితయారుచేశాడు. మొత్తం 60 పేర్లు చేతికి వచ్చినయ్. వాళ్ళలో మామాటనిక రంగా వినేవాళ్ళు 25 మంది వున్నారు. మిగతావాళ్ళలో 20 మంది యిళ్ళకుపోయి వాళ్ళను బుజ్జగించి చేతిమీద చెయ్యివేయించుకొని వచ్చాడు. కొలది రోజులకు కోఆ రేటివ్ సొసైటీ ఇన్స్పెక్టరు వచ్చి అధ్యక్ష ఎన్నికలు జరి పాడు. ఆ ఎన్నికలో 10 వోట్ల మెజారిటీతో కోటిరెడ్డి అధ్యక్షుడుగా యెన్నికైనాడు! చూచినవాళ్లు విస్తుపోయారు. విభీషణుడు రాముని పక్షంలో చేరినట్లు కోటిరెడ్డి మాతట్టు చేరటంతో సుశీలారావు పరమానందభరితుడైనాడు.

మహాలింగం దేవాలయాన్ని ఉద్ధరించడానికి ఒకపథకం తయారు చేశాడు. అర్చకుడికి గూడ వారానికి ఒకరోజు సెలవు మంజూరుచేసి, ప్రతి ఆదివారమూ దేవాలయం కట్టి వేయాలన్నాడు! గర్భగుడికి మూడువైపులా మూడుకిటికీలు, మూడు వెంటిలేటర్లూ ఏర్పాటు చేయాలన్నాడు; దద్ధోజనం,

చక్రపొంగలి, ఈ రోజుల్లో ఎవరికీ రుచించటంలేదు గనుక దేవుడి ప్రసాదం కింద ఉప్మానుగాని ఇడ్డెన్లనుగాని చేయించాలన్నాడు. గుళ్లోకి ప్రజలను ఆకర్షించటంకోసం కళ్యాణ మంటపంలో రేడియో పెట్టి రికార్డులు వినిపించాలనికూడ అన్నాడు.

సుశీలారావు అంతావిని మొఖం ఒకవైపుకుతిప్పుకొని "సంతోషించాంలే. నోర్ముయ్. పిచ్చి వేషాలు వేయకు" అన్నాడు.

మహాలింగం చెప్పినవాటికి హేతుయుక్తంగా జవాబివ్వ లేక సుశీలారావు తప్పుకున్నాడని నాకనిపించింది.



## రాజకీయ చైతన్యం

భూమిలో లంకెబిందెలు దొరికినట్లుగా సుశీలారావు మహదానంద పడుతూ మమ్మల్నందరినీ పడమంటున్నాడు. "పడతాను సరేగాని అసలీ ఆనందానికి హేతువేమిటి ? ఎందుకీ సంతోషం? ఏదన్నా లాటరీలో గెల్చావా? వుద్యోగం వూడిపడిందా? మామగారు పండక్కి రమ్మన్నారా? ఏదో చెవున నెయ్యి నవ్వుకుందాం" అన్నాను. నీ మొహం నా మొహం! నీ బుద్ధి లాటరీని దాటి ఒక్కడుగు పైకిపోదు గదా! ...ప్చ్...మీకీలోకంలో శ్రీరాంబాబూ శ్రీరా! ఇవాల్టి

రోజు దినపత్రిక చూచిన మొహం ఒక్కటైనా వున్నదీ మీలో?..." అన్నాడు.

"ఆ చూచాను...ఏముందందులో?...బొంబాయిలో వినతా లలితా డాన్సు జరుగుతుందట...విజయవాడలో వడ గాలికి సబ్ యిన్‌స్పెక్టరు ప్రాణం పోయిందట... కుంభ కోణంలో ఆహారమంత్రి యింట్లో దొంగలు పడి పదివేల రూపాయలు అపహరించారట...హాలెండులో మొగవాళ్ళను ఆడవాళ్ళుగా మార్చివేసే డాక్టర్లున్నారట" అన్నాడు మహాలింగం.

"లాభంలేదు మహాలింగం! లాభం లేదు.మనబుద్ధులు వినతా లలితాలకు వప్పగించాం. మన మనస్సులు లింగ మార్పిడి మీదికి పోతున్నవి. అంతేగాని దేశంలో ఏమి జరుగుతున్నదో ఒక్కడికీ పట్టదుగద".

"పోనీ నీవు చెప్పరాదూ? మనలో ఒక్కడివి వున్నావుగా చిచింద్రీలాంటి వాడివి!" అన్నాడు కొండయ్య.

"అదే చెపుతున్నాను. మనపాలిట భాగ్యదేవత యివ్వాళ పత్రికలో అవతరించింది. మీ దృష్టి దానిమీదికి పోకనేపోయె! ప్రభుత్వంవారు దేశవ్యాప్తంగా వయోజన ఓటింగు హక్కు ప్రసాదించారు. ఇకనుంచి 21 సంవత్సరాలు దాటిన స్త్రీ పురుషులందరూ ఓట్లువేసి శాసనసభలకు ప్రతినిధుల్ని ఎన్నుకోవచ్చు. చదువూ గిదువూ అవసరం లేదు. ఆస్తిపాస్తులతో నిమిత్తం లేదు. 21 ఏళ్ళు నిండితేచాలు.

ఇహ దేశమంతా ప్రజాస్వామ్యంతో వెల్లివిరుస్తుంది. పచ్చ తోరణం, నిత్యకళ్యాణం అవుతుంది.'' అన్నా మసుశీలారావు.

అందరమూ అర్థమైనట్లుగానే కనిపించాం. తలకాయలు పైనించి కిందికి ఊపాం. అయినా ఒకసారి ఎన్నికలను కళ్లారా చూస్తేగాని నాకు అంతుపట్టేటట్లు కనిపించలేదు. అందరికీఓటుముక్క యిచ్చినంతమాత్రాన దేశం నిత్యకళ్యాణం ఎలా అవుతుందో తెలియలేదు. మహాలింగం, కొండయ్యలు స్వయంగా అర్థం చేసుకుందామని దినపత్రికనుమళ్ళీ చదివారు. నేను దినపత్రిక సంపాదకీయం చదివాను. ప్రజాస్వామ్యంలో అపూర్వమైన ప్రయోగం దేశంలో జరగబోతున్నదని అందులో వ్రాశారు.

రోజులు గుండ్రాయిదొర్లినట్లు దొర్లుకుంటూ పోతున్నయ్. నిజానికి మన ప్రయత్నంతో నిమిత్తం లేకుండా సవ్యంగా జరుగుతున్నపని రోజులు గడవడం ఒక్కటే! శాసనసభలకు కొత్తగా ఎన్నికలు జరుపుతారట. మా ఫిర్కాలో ప్రతిపార్టీవాళ్ళూవచ్చి తమఅనుకూలురకోసంగాలిస్తున్నారు. క్రొత్త క్రొత్త జెండాలు ఎగురుతున్నయ్. వూళ్లోకి కొత్త మనుషులు అడపాతడపా వచ్చిపోతున్నారు.

జనతాపార్టీ నాయకుడు ఒకాయన బొంబాయినుంచల్లా వచ్చి మా వూళ్ళో బహిరంగ సభ పెట్టి గంటన్నరకుపైగా ఉపన్యాసం దంచాడు. ఆయన ఇంగ్లీషులో మాట్లాడితే ఒక

హైస్కూలు మేష్టరు తెలుగులో తర్జుమా చేసి చెప్పాడు. ఐదారు నెల్లనుంచి వూళ్ళో నాటకాలూ హరికథలూ లేకపోవడంవల్ల మనుషుల చెవులు తుప్పు పడుతున్నాయి. అయాచితంగా ఒక పెద్దమనిషివచ్చి సభ జరుపుతున్నాడని తెలిసి జనం ముమ్మరంగా వచ్చారు.

జనతాపార్టీ గురించి ఉపన్యసిస్తూ ఆయన జనతారైళ్ళ ప్రయోజనాలను గురించి చాలసేపు చెప్పాడు. ప్యాసింజరు బళ్ళలో జనం కడ్డీలు పట్టుకొని వేలాడుతూ ప్రయాణంచేసే వారనీ, అందుచేత అనేక ప్రమాదాలుజరిగాయనీ తేదీలతో సహా చెప్పాడు. గత జనవరి 13వ తేదీన నెల్లూరు అవతల కావలిదగ్గర ఒక ప్రయాణీకుడు పట్టుకొన్ని కడ్డీకాస్తా వుటు క్కునవిరిగిపోయి హఠాత్తుగా కిందబడిపోతే తలకాయ రెండు ముక్కలై నడుందగ్గర ఎముకలు పిప్పిపిప్పి అయినవట! మే 17వ తేదీన ఒక తల్లీ బిడ్డా ఫుట్ పాత్ మీద నిలబడి ప్రయాణం చేస్తుంటే, బకింగ్ హామ్ కాలువమీదుగా రైలుపోతుం డగా ఆ బిడ్డ తల్లి చంకలోనించి జారి కాలువలోపడితే కాలువలో గేదెలను కడుగుతున్న పిల్లకాయలు ఆ బిడ్డను ఒడ్డుకు చేర్చారట. క్రిందటి శ్రీరామనవమినాడు హోర్నకల్ భద్రాచలం మధ్య ప్రయాణీకులు చోటుచాలక రైలుపెట్టెలమీద ఎక్కికూచున్నారట. అడవిలోగుండా రైలు పోతున్నపుడు సుడిగాలి వీచి పైనున్న ప్రయాణీకులిద్దరు బంతుల మాదిరిగా దొర్లుకుంటూ కిందపడ్డారట.

"ఇలాంటి ప్రమాదాలకు ఆహుతికాకుండా వుండటం

కోసం జనతా రైళ్లు వేయబడ్డయ్. వాటిల్లోహాయిగా కాళ్ళు జాపుకొని ప్రయాణంచేయవచ్చు. అందులోఅన్ని మూడో తరగతి పెట్టెలేగానీ ఒకటోతరగతి రెండోతరగతీ వుండవ్. ఇందువల్ల ప్రజల్లో సమానత్వంవస్తుంది. నీవు ఎక్కువ, నేను తక్కువ అంటూవుండదు. అలాగే మా జనతాపార్టీ గూడా జనతారైళ్ళను ఆదర్శంగా తీసుకొనిపుట్టింది. ప్రజలను సమానం చేయడానికీ మిట్టపల్లాలను ఏకంచేయటానికీ జనతాపార్టీ నడుంకట్టింది" అని చెప్పుకుపోయాడు. ఉదాహరణలతోసహా చెప్పడంవల్ల అందరికీ అర్థమైనట్లుగానే కన్పడింది. భలే చెప్పాడురా అని అంతా అనుకున్నారు. మరునాడు మా కాఫీహోటల్లో ఇడ్లీ ఇచ్చేవాడు జనతాపార్టీలో చేరమని రశీదు పుస్తకంపుచ్చుకొని తిరుగుతున్నాడు. ఒకనెలరోజులు గడిచేసరికి మా మంగలి జనతా హెయిర్ కటింగ్ సెలూన్ అని బోర్డు తగిలించాడు !

ప్రజలు కొద్దికొద్దిగా రాజకీయాలను గురించి మాట్లాడడం ఆరంభించారు. దినపత్రికను ఏడెనిమిది గుంపుగా కూచొని చదువుతున్నారు. కిల్లీషాపులముందుండే బెంచీల మీద సూర్యోదయ సూర్యాస్తమయ సమయాల్లో కాస్త ఉష్ణాధిక్యతకలవాళ్లు కూర్చొని మొదట మొదట్లో నిదానంగాను క్రమంగా బిగ్గరగాను మాట్లాడుతారు. మరికొంత సేపటికి లేచి నిలబడి మధ్యమధ్య ఛాలెంజిచేస్తూ మాట్లాడుతారు. చివరకు ఇంట్లోనుంచి పిల్లవాడొచ్చి పిలిస్తే ఒకరి

తర్వాత ఒకరు గుడ్డలు దులుపుకొని లేచిపోతారు. గ్రంథాలయం దగ్గర ముసలివాళ్ళు పొడుంకాయలతో సహావచ్చి కూచొని రాజకీయాలలో భూతభవిష్యత్తులను గూర్చిన శాస్త్రీయంగా చర్చిస్తూ వున్నారు.

ఎన్నికలు యింకా మూడునెలలు వున్నాయనంగా తిమ్మాపురంలో బొడ్డూడిన ప్రతివాడూ ఒకపార్టీ వర్కర్‌గా కనిపిస్తున్నాడు. ఓనమాలు దిద్దుకొనే పిల్లవాడు పలకచేత్తో పుచ్చుకొని నోట్లోచొక్కా పెట్టుకొనిచీకుతూ "శంభులింగానికీ జై" అంటూపోతున్నాడు. "జనతాపార్టీ గనుక వస్తే పరీక్షలు రద్దుచేస్తారటగా" అని సిగరెట్ వెలిగించుకుంటూ మెట్రిక్ పరీక్షకు అయిదోసారి వెళుతున్న మస్తాన్‌రావు అన్నాడు! పిల్లను చంకనేసుకొని సినిమా చూడబోతున్న ఆడంగులు అనుకుంటూ పోతున్నారు, "రష్యాలో ఆళ్ళోళ్లు పిల్లల్ని కనర్టగా"అని. మా పోలీసు సబిన్‌స్పెక్టరు గూడా "పోలీసులంటే మనుషులకు మరీభయం లేకుండా పోయింది" అని దిగులుపడుతూ అన్నాడు!

రాజకీయ రంగంలోకి స్త్రీలుగూడఊపుగావచ్చి ప్రవేశిస్తున్నారు. అర్థాంగి అన్నమాటను అన్నిసందర్భాలలోనూ అన్వయం చేయాలని వాళ్ళవాదన."ఫిఫ్టీ-ఫిఫ్టీ" అనేది వాళ్ళ నినాదం అయిపోయింది.ఉద్యోగాలలోగాని,పదవులలోగాని, రైలుపెట్టెల్లోగాని, సినిమా హాల్సులోగాని, ఆటస్థలాల్లోగాని, దేంట్లోపట్టినాసరే స్త్రీలకూ పురుషులకూ సరిసమాన

మైనస్థానాల్నీ హోదాలనూ ఇవ్వాలని వాళ్ళవాదం.మంత్రి వర్గంలోనూ, శాసన సభ్యులలోను సగంమంది ఆడవాళ్ళు వుండితీరాలన్నారు.ఇది న్యాయమైనకోర్కెయేననీ, అత్యాశ ఏమీలేదనీ వాదించడం ఆరంభించారు. ఇందుకోసం వాళ్ళు మహిళాపార్టీ అని క్రొత్త రాజకీయ పక్షాన్ని స్థాపించారు. ఓటర్లలో ఎలాగూ సగంమంది స్త్రీలేగనుక సులభంగా సగం సీట్లు తమపార్టీకిదక్కుతాయని బల్లగుద్దిమాట్లాడుతున్నారు. కొంతమంది స్త్రీలుభర్తలమాటల ప్రకారంనడుచుకొంటారు గనుక ఎలాగూ కొన్ని స్త్రీల వోట్లు తాము కోల్పోవలసి వస్తుందని వాళ్ళు అంచెనా వేసుకున్నారు. ఐతే భార్యల మాటలప్రకారం నడుచుకొనేభర్తలుగూడ అసంఖ్యాకంగానే వున్నారు గనుక పురుషులఓట్లుగూడ తమకు చాలావస్తాయని ఆశపడుతున్నారు! ఎటుతిరిగీ మహిళాపార్టీస్థాపనవల్ల మిగతా పార్టీలవాళ్ళు పిల్లి మొగ్గలు వేయవలసిన పరిస్థితి ఏర్పడింది.

ఒకనాడు మహాలింగం తన కుమారుడి అన్నప్రాసన సందర్భంలో మిత్రులందరినీభోజనానికిఆహ్వానించాడు.మిత్రులంటే పూర్వంమాదిరిగా నలుగురుకాదు. ఇప్పుడు సప్తమహాషులమయినాము. గోపాలరావు, కోటిరెడ్డి, పుల్లయ్యగార్లను గూడ క్యాబినెట్‌లో చేర్చాము. భోజనాలు పూర్తి అయినయ్. ఒక గంటసేపు చతుర్ముఖపారాయణం ప్రారంభించాం. పళ్ళెంలో వక్కలూ తమలపాకులూ అయిపోయేవరకు ఆట ఆడుతూ నేవున్నాం. సుశీలారావుకూ జోకర్లకూ చెడ్డస్నేహం.

చాలా ఆటలలో జోకర్ అతనిదే. చీట్లపేకలో అతను ఓటమి ఎరగడు. తన తెలివి తేటలన్నీ చీట్లపేకనుంచి పుట్టుకొచ్చి నవే నంటాడు. అతను పోడిముక్కతో తురుఫు చెప్పి గెలుచు కొనేవాడు. గుండె నిబ్బరం గనుకవుంటే మనిషికి అపజయం వుండదంటాడు.

"వచ్చే ఎన్నికల్లో మన కర్తవ్యం ఏమిటి?" అని పుల్లయ్య సూటిగా అడిగాడు.

"ఎవరిని బలపరుద్దాం?" అని గోపాలరావుగారు అడిగాడు. ఆయన ఎప్పుడూ మరొకరిని బలపరచటం గురించే ఆలోచిస్తుంటాడు.

"ఒకరిని బలపరిచే గతి మనకేం పట్టింది?" అని కొండయ్య ఎద్దేవ చేశాడు.

"ముక్కూ ముఖమూ తెలియనివాళ్ళం బలపరచక ఏం చేస్తాం?" అన్నాను నేను.

"బృహన్నలంటే నాకు చెడ్డ అసహ్యం" అన్నాడు వ్యంగ్యంగా మహాలింగం. నాకు అర్థమైంది. ఏమి అనటానికీ నాకు తోచలేదు. క్రిందచూస్తూ వూరుకున్నాను.

సుశీలారావు ఒక్కమాట వదిలాడు- "మన మందరం కలిసికట్టుగా వుంటే మనమే నిలబడవచ్చు" అన్నాడు.

"అనుభవమో!" అన్నాను నేను.

"మనకున్న అనుభవమూ పలుకుబడీ ఎల్లికొల్ల" అన్నాడతను.

సుశీలారావు గీచిన గీతమీద నడుచుకుంటామని అందరూ వాగ్దానం చేశారు. కాసేపు ఆలోచించినట్లు కనపడి సుశీలారావు తీర్పు చెప్పాడు- "వెంకటప్పయ్య నెమ్మదస్తుడు, ఫిర్కాలో అతనిపేరు పదిమందికీ తెలుసు. అతన్ని అభ్యర్థిగా నిలబెడుదాం. విజయం మనకు ఖాయం" అన్నాడు. అందరూ సరేనంటే సరేనన్నారు.

---

## విషాదయోగము

నా కేటూ పాలుపోవడంలేదు. అన్నం సయించడం లేదు. నిద్ర పట్టలేదు. పసిపిల్లవాణ్ణి నలుగురూ నాలుగు వైపులా పట్టుకొని చెవులు కుట్టించినట్లు వీళ్ళందరూ నన్ను పట్టుకొని నిలబెడుతామంటారు. తప్పించుకొనే ఉపాయం లేకుండా వచ్చింది. వదిలిపెట్టమంటే వదిలిపెట్టరు. చెపితే వినిపించుకోరు. సూటీపోటీమాటలంటారు. నీ కెందుకు మేమున్నాంగా అంటారు!

ఇది ఇలావుండగా దీపస్తంభంలాంటి సన్నని పొడుగాటి మనిషి కళ్ళజోడు సవరించుకుంటూ మా యింటికి వచ్చాడు. అతని వెంట కిల్లీకొట్టు కుమారయ్య గూడ వచ్చాడు. కుర్చీలు చూపి కూచోమన్నాను. ఆ వచ్చిన పెద్ద మనిషి జిల్లా లేబర్ పార్టీ కార్యదర్శిట. మా వూళ్ళో లేబర్

పార్టీ స్థాపించడంకోసం వచ్చానన్నాడు. 'శుభం' అన్నాను. అతనికి కాస్త హుషారు వచ్చినట్లున్నది. లేబర్ పార్టీతరఫున ఎన్నికల్లో మా నియోజకవర్గంనుంచి నిలబడటానికి నేనంగీకరిస్తానేమో అడగాలని వచ్చానన్నాడు.

"లేబర్ పార్టీ ఆశయాలూ ఉద్దేశాలూ చూచాయగానైనా నాకు తెలియవుగదా! నన్ను నిలబెట్టి మీరు బావుకునేదేమిటి? ఎవరినైనా తెలిసినవాణ్ణి పెట్టుకోండి, దివ్యంగా వుంటుంది" అన్నాను.

అపుడాయన ఒకచిన్నసైజు ఉపన్యాసంఆరంభించాడు. "మా పార్టీ ఆశయాలూ ఉద్దేశాలూ చాలా సింపుల్. చెమటపట్టేవాడికే కూడుదొరకాలంటాము. ఉత్తవిడియంగా డబ్బుచేసుకోవటంగాని, వళ్లు వంచకుండా పరభాగ్యోపజీవిగా బతకటంగాని మా పార్టీ ఒప్పుకోదు. మేము చెప్పేదేమీ లోకానికి కొత్తగాదు. చెమటకార్చినవాడే తీపి తినదగినవాడని ఐర్లండు మహాకవి జోసెఫ్‌వారెన్ చెప్పాడు. బరువు మోసే గాడిదకే కూడు దొరుకుతుందని ఇటలీ కార్మిక నాయకుడు మిస్టర్ స్టీవెన్‌సన్ చెప్పాడు. తాతలుసంపాదించి పెట్టిన ఆస్తిమీద బతికేవాడు.పెళ్లాండబ్బుతో బతికేవాడూ సమానులేనని ఆచార్యకృపాసిథి ఉద్ఘాటించాడు. అందుచేత మా పార్టీ కాయకష్టంగాని మానసికకష్టంగాని చేసేవాడిదే రాజ్యమంటుంది.అలా చూచినట్లయితే హైకోర్టుజడ్జీ మొదలు రిక్షావాలా వరకు అందరూ కార్మికులకిందికే వస్తారు. ఊరికే

బొజ్జ పెంచుకొనే వాళ్ళకు తిండి పెట్టకూడదని మా వాదం" అని ముగించాడు.

అతని మాటలలో నిజం చాలా భాగం వున్నదని తోచింది. కాయకష్టం చెయ్యనటువంటి బాలురకూ వృద్ధులకూ స్త్రీలకూకూడా పుట్టకూడదని అతని ఉద్దేశ్యమా అని అనుమానం వేసింది. కాని నేనామాట అడగలేదు.

"మరి అయితే నేను తాతలు సంపాదించిన 100 ఎకరాలమీద బతుకుతున్న వాడినిగదా! నేను మీపార్టీ అభ్యర్థిగా పనికొస్తానా?" అని అడిగాను.

"ఏం ఫరవాలేదు. మేమంత 'అర్థ డాక్సు'గా వుండం. మా ఆశయాలు మీకు నచ్చితేసరి. మీరైతే గెలువుఖాయమని మీ దగ్గరకు వచ్చాను." అన్నాడు.

నేను ఒక్క నిముషం ఆలోచించినట్లు కనపడి "ఊహూ...... అలాగే... సరేఅయితే... అసలు నేను స్వతంత్రుడుగా పోటీచేయాలని నిర్ణయించుకున్నానులెండి" అని చల్లగా చెప్పివేశాను.

అతను చకితుడైనాడు, "అలాగా... అయితే సరేలెండి...అయితే సరేలెండి..."అంటూ కండువా పైన వేసుకొని దారితప్పి వచ్చిన వాడిలాగ గుట్టుచప్పిడి కాకుండా వెళ్ళిపోయాడు !

ఏదో బెట్టుసరిగా అతనితో అన్నానుగాని నిలబడటానికి ధైర్యంచిక్కటంలేదు...అసలు ఈగొడవనాకెందుకు?

కమపులోచల్ల కదలకుండా నిడపట్టునా కాళ్ళు ముడుచు కూర్చుంటే వెళ్ళిపోదూ? ఊబిలో దిగడందేనికి? తర్వాత వేలుకొరుక్కోవడం దేనికి?...ఏమిటో మరి! ఆ లేబర్‌పార్టీ కార్యదర్శి గెలుపు ఖాయంఅంటాడే! ఎందువల్లనో? కారణ మేమిటో? సిరి దానంతటది వస్తానంటుంటే కాలితో తన్ని వేయడం బావుంటుందా? వివేకశూన్యత అవుతుందేమో?...

ప్చ్...లాభంలేదు... అతను నన్నేదో ఉబకేయడా నికి అలా అన్నాడుగాని నక్కెక్కడ నాగలోకమెక్కడ? ఎం.ఎల్.ఏ.అంటే గుర్రపుస్వారి చేయడమా?సినిమాశతదినో త్సవం జరపడమా? గ్రామచావిట్లో కూచొని కోత, పైకోత అనడమా? తలనెరిసిన వాళ్ళంతా ఎన్నికల్లో నిలబడతారు. లండన్ వెళ్ళివచ్చినవాళ్లూ, రిటైరయిన జిల్లాజడ్జీలూ నుంచుం టారు. రాజకీయరంగంలో కాకలుతీరినవాళ్ళుపోటీచేస్తారు... మామిడిపండు పక్కనుంటే ఈతపండుముఖంఎవరుచూస్తారు? పొన్నకాయలాంటి వాళ్ళను కాదని నాకు ఓట్లు ఎవరిస్తారు గనుక? నేను నిలబడటం అనవసరం. శుద్ధదండగ. డిపాజిట్ కాక ఏడెనిమిదివేలు కృష్ణార్పణమవుతయ్. ఆరు నూరవ్వేది. నూరు ఆరవ్వేది నేనుమాత్రం నిలబడను." అనుకున్నాను.

ఈ చివరి మాట మాత్రం కాస్త బిగ్గరగా అన్నాను. దాన్ని వింటూనే సుశీలారావు లోపలికి ప్రవేశిస్తూ "నిల బడవ్వూ? ఏం? గుఱ్ఱం వెనక్కు నడుస్తుందేం?" అన్నాడు.

నాకు దానంతటదే నవ్వొచ్చేసింది. "శైల్యా,

మోటర్లూ వచ్చిం తర్వాత గుర్రాలు వెనక్కు నడవక ముందుకు నడుస్తయ్యా" అన్నాను.

సుశీలారావు ముఖంలో భారం కనిపిస్తున్నది. పెదిమలు కొరుకుతున్నాడు. నిర్విరామంగా ఆలోచిస్తున్నట్లు బయటికిగూడ కనిపిస్తున్నాడు. నింపాదిగా వీపు దిండుకానించి గడ్డంకింద చెయిపెట్టుకొని సోఫాలో కూచున్నాడు.

"అయితే యింతకూ ఈ ఎన్నికల్లో మనం నిలబడగూడదంటావు?" అన్నాడు సుశీలారావు.

కాస్త ఆగి నే నన్నాను— "మనం నిలబడవద్దని నే ననటం లేదు. నేను నిలబడటం దండగచేటు అని చెబుతున్నాను."

"మరి యెవరు నిలబడతారు?"

"అన్నీ కూలంకషంగా తెలిసిన నీవే నిలబడటానికి తగినవాడవు."

"నేను తగినవాడనని నీవెలా అనుకొంటున్నావు?"

నాకు కాస్త ఊపిరి పీల్చుకొనే ఛాన్సు దొరికింది. వడ్లబస్తాను నా మీదనుంచి అతని వీపుమీదకుమళ్లించే అవకాశం యిచ్చాడు! "సుశీలారావ్! శాసనసభకు ఎన్నికలు అనంగానే నా కాళ్లలో పట్టు తప్పుతున్నది. ప్రవాహంలో పడ్డ మర్రాకు మోస్తరుగా నా మనస్సు పల్టీలు కొడుతున్నది...ఎందుకంటావా?... దేశంలోవున్న గొప్ప గొప్ప వక్తలు, రచయితలు, విద్యావేత్తలు ఎన్నికల్లో పాల్గొం

టారు. వాళ్లతో పోలిస్తే సూర్యునిముందు దీపం బుడ్డివంటి వాడను నేను. ఇంగ్లీషులో నోరు మెదపలేనుగదా! అర్ధమం అరగంటసేపు మాట్లాడటానికి నాకు ఏ విషయాన్ని గురించీ కూలంకషంగా తెలియదుగదా! ఎన్నడూ మన జిల్లానుదాటి ఒక్క అడుగు అవతలికి వెయ్యలేదు గదా! ఇలాంటివాడిని నేనుగూడా ఎన్నికల్లో నిలబడటం నాకే హాస్యాస్పదంగా వున్నది. ఒక్కటే మాట సుశీలారావూ : యాపిల్ పండు అవతల కన్పడుతూవుంటే నేరేడుపండు చాయలకు ఎవరు వస్తారూ?...ప్చ్... నేను తగను. నీవు వృజ్జీకి సరిపోతావు. నీవు నిలబడు నిక్షేపంగా వుంటుంది." అన్నాను.

"నేను నిలబడితే నిక్షేపంగానే వుండవచ్చుగాని, ఓట్లు పడవు వెంకటప్పయ్యా!' అన్నాడు సుశీలారావు.

"నేను ఒప్పుకోను. నీకు పడనిఓట్లు నాకుపడతయ్యా" అన్నాను. సుశీలారావు నా దగ్గరగా వచ్చి కూచొని నవ్వుతూ యిలా అన్నాడు— "అయితే నీకు వయోజన వోటింగులంటేనూ, ప్రజాస్వామ్యం అంటేనూ కించిత్తుగూడ అంతుపట్టలేదన్నమాట?'

"పోనీ నీవుచెప్పువింటాను" అన్నాను అమాయకంగా.

"ఒక చెట్టువున్నదనుకో. ఆ చెట్టువేళ్లుగనుక తియ్యటివైతే కాసేకాయలు తియ్యగావుంటయ్. ఆ వేళ్ళు గనుక ఉప్పనివైతే కాయలూ ఉప్పగానేవుంటయ్. అలాగే ప్రజాస్వామ్యంలో ఓటర్లుఎలాంటివాళ్లవుతే యెన్నుకోబడేశాసన

సభ్యులుగూడ అలాంటివాళ్ళే అవుతారు. అంతేగాని క్రొత్త స్వభావంగల వాళ్లెవరూ ఎన్నుకోబడరు."

"నీవు చెప్పేది నాకు బోధపడటం లేదు."

"ప్రజాస్వామ్యంలో ఓటర్లుఎలాంటి వాళ్లయితే వాళ్లు ఎన్నుకొనే ఎం.ఎల్.ఏ.లు గూడ అలాంటివాళ్లే అవుతారు. దేశంలో కులాలవారీగా మనుషులు ద్వేషించుకుంటున్నారు. అజ్ఞానం, అవివేకం ఆవరించివున్నది. సంతకం పెట్టగలవాళ్లు నూటికి పదిహేనుమందికంటె లేరు. అలాంటివాళ్లు ఇపుడు ప్రయోజనులవుతేచాలు ఓటింగుహక్కు పొందుతున్నారు. ఇలాంటివాళ్ళు విజ్ఞానవంతుల్నీ మేధావుల్నీ ఎన్నుకోరు.తమ లాంటివాళ్ళనే ఎన్నుకుంటారు. డిగ్రీలున్నవాళ్ళు గనుక నుంచుంటే సోదిలోకి రాకుండాపోతారు. ఎం.ఏ. ప్యాసైన వాళ్ళు డిపాజిట్టుదక్కక తలెత్తుకోలేకపోవలసివస్తుంది! అందు వల్ల శాసనసభకు నిలబడేవారు తమలో ఓటర్ల గుణాలు ఉన్నాయా లేవా అని చూచుకోవాలే గాని ఓటర్ల ఊహ కందని సద్గుణాలకోసం తాపత్రయపడకూడదు."

అతను నాకు చెప్పిన సంగతులన్నీ క్రొత్తగాను వింత గాను వున్నాయి. "అయితే ఓటర్లు నన్ను ఎన్నుకోవచ్చు నని ఎలా అనుకుంటున్నావు?' అని అడిగాను.

"అదే చెప్పబోతున్నాను. మన ప్రాంతంలో ప్రజలు ఒకరిని ద్వేషించవలసివచ్చినా, భూషించవలసివచ్చినా కులా లనుబట్టి ఆలోచిస్తారు. హైస్కూల్లో ఒక విద్యార్థికి

బంగారు పతకం బహూకరించారని తెలిస్తే అతడు ఏ కులం వాడని అని ఆరాతీస్తారు. ఒకడికి ఉద్యోగం ఇవ్వాలంటే అతని కులం ఏమిటని ప్రశ్నిస్తారుగాని యోగ్యత ఏమిటని అడగరు. అలాగే రేపు ఎన్నికలప్పుడు అభ్యర్థుల సిద్ధాంతాలను గురించి ఓట్లులేని పిల్లకాయలు చర్చిస్తారు. ఓట్లున్న పెద్దవాళ్ళుమాత్రం అభ్యర్థి మన కులస్తుడేనా అనిఆలోచిస్తారు."

ఇదంతా వింటుంటే ఇంతవరకు నా మనోనేత్రానికి దూరంగావున్న సత్యాలను భూతద్దంతో సుశీలారావు చూపిస్తున్నాడనిపించింది.

"దీన్నిబట్టిచూస్తే మన నియోజకవర్గంలో ఏకులస్థులు అధిక సంఖ్యాకులుగా వున్నారో ఆ కులస్తుడైతే సులభంగా గెలుస్తాడు. నీ కులస్తులు మన ఫిర్కాలో షుమారు నూటికి 60 మంది వున్నారు. ఇక నీకు భయమేమిటి? ఫిర్కాలో మాట చెలామణి అయ్యేటువంటి పుల్లయ్య మన వైపున్నాడు. పోతే రామిరెడ్డి తన బలంతో మనకు పోటీపెట్టించవచ్చు. కాని విభీషణుడిలాంటి కోటిరెడ్డి మన పక్షానఉన్నాడుగా! ఇక దిగులెందుకు? మనం ఇప్పటికే ఉద్యోగస్థులనూ, కుఱ్ఱకారునూ గుప్పిట్లో ఉంచుకున్నాంగదా?"

సుశీలారావు మాటలనుబట్టి చూస్తే ఆ లేబర్‌పార్టీ కార్యదర్శి నాతో అన్నమాటలు గుర్తుకొచ్చాయి. మీరైతే గెలుపుఖాయం అని మీ దగ్గరకు వచ్చానని నాతోఅన్నాడు. అతని ఉద్దేశంగూడ ఇదే అయి ఉంటుంది !

ఎండిపోతున్న మొక్కకు సుశీలారావువచ్చి చెంబెడు నీళ్ళుపోశాడు! ఆశ అనేది మనుష్యుల్ని నడిపించే జీవశక్తి. ప్రతివాడూ విజయం అనుమానాస్పదంగా వున్నపుడు నా కెందుకులే అని వూరుకుంటాడు. కాని నలుసంత ఆశగనుక వుంటే కాలు ఝాడిస్తుంటాడు. గాలి దూతేసందు వుంటే చాలు, పాక్కుంటూ పైకిపోదామని చూస్తాడు. నేనుగూడ మొదట కొండను ఢీకొనే పొటేలుమాదిరిగా నిష్ప్రయోజన మనుకొన్నాను. కాని సుశీలారావు నాకు విజయమెందుకు రాక తప్పదో అణాపైసలుతోసహా లెఖ్ఖవేసి చెప్పడంవల్ల కార్యరంగంలో దూకటానికి సిద్ధపడ్డాను.

ఊదుకుంటూ నేరేడుపండు తినేవాళ్లు యాపిల్ పండ్ల జోలికి పోరులే అనిపించింది !!

## శంఖారావం

రెండవ ప్రపంచయుద్ధం వచ్చి ఊడిపోయిన గుడ్డపు నాడాలకుగూడా విలువకలిగించినట్లు,ఎన్నికల పుణ్యమాఅని మా ఫిర్కాలో గోళ్లుగిల్లుకునే వాళ్లందరికీ పని కలిగింది. "ఎల్ల వేళలందును ఇడ్లీ దొరకును" అని కాఫీహోటళ్ల ముందు బోర్డులు కట్టారు. కారు డ్రైవర్లకు తాకిడీ ఎక్కువైంది. పెట్రోలుబంకులు నీటిపంపుల్లా పనిచేస్తున్నయ్. కవులకూ,

గాయకులకూ విలువంటూ ఏర్పడింది. అందరి జేబులూ బరువుగా కనపడుతున్నయ్. ముసమ్మల దగ్గరనుంచి బటా నీల వాడివరకు అందరూ రాజకీయాల గురించే బలంకొద్దీ మాట్లాడుతున్నారు.

ఉన్న పార్టీలు చాలక పెరుమాళ్ళపార్టీ అని ఒకటి వెలిసింది. చిరుతలు పుచ్చుకొని తెల్లవారుజామున వీధుల్లో తిరుగుతూ సంకీర్తనంచేసే భక్తుడొకడున్నాడు. అతడు భక్తి యోగంలోనుంచి చివాలున కర్మయోగంలోకి గంతువేశాడు. బహుశా ఒకటి జరిగుంటుంది. శివరాత్రినాడు రావిచెట్టంత ప్రభలుకట్టుకొని వీరంగం వేసుకుంటూ జనం కోటప్పకొండకు పోతారు. సముద్రంలాంటి ఆ జనాన్నిచూసి ప్రజలకు దేవు డంటే భలేఇష్టమున్నదని కనిపెట్టాడు. ఈ భక్తిని దేవుడు ఎలాగూ వాడుకోలేకపోతున్నాడు గనుక తను వాడేద్దామని చూశాడు. కనపడ్డవాళ్లకల్లా నమస్కారాలుచేసి చెప్పాడు. వాకిలిముందు పెరుమాళ్లు పార్టీ కార్యాలయం అని బల్ల చెక్కించి పెట్టాడు. ఆయన సతీమణి బిందె చంకనపెట్టుకొని చెరువు దగ్గరకువెళ్ళి వచ్చిన వాళ్ళందరికీ నూరిపోస్తున్నది పెరుమాళ్లుపార్టీ అవసరాన్ని గురించి. కోటప్ప కొండకు వెళ్లిన వాళ్ళంతా తలా ఒక ఓటు వేయకపోతారా అనుకొని నామినేషన్ దాఖలుచేశాడు. తన ఏజంటుగా మాత్రం మానవ మాత్రులెవరూ తగరని సాక్షాత్తూ ఏడుకొండల వెంకన్నను నియమించాడు. రిటర్నింగు ఆఫీసరు నామినేషన్ భద్రంగా రిటరన్ చేశాడు !

నామినేషన్లు దాఖలు చేయటం స్నాతకవ్రతంలాంటిది. సుశీలారావు ఉన్నట్లుండి రాష్ట్రరాజధాని కుంభకోణం వెళ్ళి తిరిగివచ్చాడు. జనతాపార్టీ అగ్రనాయకులతో సంప్రదించాడు. జనతాపార్టీ తరఫున తిమ్మాపురం నియోజకవర్గానికి అభ్యర్థి దొరకక సతమతమవుతున్నారట. వాళ్లు నాకుపార్టీ టికెట్టు ఇస్తామన్నారట. సుశీలారావు వచ్చి నన్ను జనతాపార్టీ తరఫున నామినేషన్ దాఖలు చెయ్యమన్నాడు.

నాకు కోపం వచ్చింది. "మనడబ్బుతోటీ, మనపలుకుబడితోటీ మనం నిలబడుతూ వాళ్ళముద్ర దేనికీ? వాళ్ళవల్ల మనం గెలిచినట్లు పేరు దేనికీ ?" అని అడిగాను.

"నిజమే. స్వయంగా నిలబడవచ్చు. కాని గెలవటం మాత్రమే మన ఉద్దేశం కాదుగా. ఆ తర్వాత ప్రజలకు సౌకర్యాలు చేయించాలి. అందుకోసం ఉత్తరోత్తరా శాసన సభలో మెజారిటీ వచ్చే లక్షణాలు ఏ పార్టీకి వున్నాయో, ఆ పార్టీ టికెట్టుమీద నిలబడటం శ్రేష్ఠమైన పని. మన సత్తువతో వాళ్ల పేరు మీద గనుక ఇపుడు గెలిస్తే, ఆ తర్వాత వాళ్ళసత్తువను మనపేర వాడుకోవచ్చు" అని సుశీలారావన్నాడు. నేను నిజమే ననుకున్నాను. జనతాపార్టీ తరఫున జనరల్ సీటుకు నామినేషను దాఖలుచేశాను.

రిజర్వుసీటుకు మాతో స్కూలుఫైనలుదాకా వచ్చి బండిఆపిన జకరయ్యను నిలబెట్టాం. అసలతను నుంచోనన్నాడు; గెలవలేనన్నాడు; డబ్బు లేదన్నాడు; ఇంకా తప్పు

కోటానికి పనికివచ్చేవన్నీ అన్నాడు. మేం నలుగురమూ వెళ్ళి పురి ఎక్కించి ఒప్పించాం. డిపాజిట్ మేమేకట్టాం. ప్రచారానికి డబ్బు మేమే ఇచ్చాం. నీ కెందుకు మేమున్నాంగా అన్నాం. ఇంతపనీచేస్తే అతను రెండురోజులకొకసారి కన పడి ఇంట్లో బియ్యంలేవంటాడు! పెళ్లానికి మందులుకొనాలంటాడు ! నాకెందుకు, నేను తప్పుకుంటా నంటాడు. ఈ అప శకునపక్షి మనకెందుకు - నామినేషన్ ఉపసంహరింప చేద్దామన్నాను. సుశీలారావు ముక్కుమీద వేలువేసుకొని తప్పు తప్పన్నాడు. అతని జాతకానికీ, మనజాతకానికీ లంకె వున్న దన్నాడు. సరేనని వూరుకున్నాను.

ఆఖరుక్షణంలో అడ్వకేటు సోమసుందరంగారు లేబర్ పార్టీతరఫున అభ్యర్థిగా నిలబడ్డాడు. నాకుపిడుగుపడ్డంత పని అయింది. ఆయన గ్రంథరచయిత. లాలా లజపతిరాయ్ జీవితచరిత్రను ఉపన్యాసాలతోసహా తెనుగులో రచించాడు. విప్లవవీరుల చరిత్ర అని మరొక చక్కనిగ్రంథం అచ్చువేయబోతున్నాడు. సంస్కృతంలో ప్రావీణ్యంసంపాదించినవాడు. ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ గుక్కతిప్పకుండా ఉపన్యసించగలడు. మావూళ్లో ఏ సభజరిగినా అధ్యక్షస్థానం ఆయనకు రిజర్వుచేసి వుంచుతారు. ఈ మధ్య ఆయన జనతాపార్టీని మెచ్చుకుంటూ మాట్లాడటం ఆరంభించాడు. కొన్ని వ్యాసాలుగూడ వ్రాసి పత్రికలకిచ్చాడు. జనతాపార్టీవాళ్ళు ఆయనకు టిక్కెట్టు ఇవ్వక శ్రేష్ఠుడననే ఉద్దేశ్యంతో నా

కిచ్చారు. మరి ఆయన నిజాయితీగలవాడైతే నన్ను బలపర చాలిగాని తాను మరొక పార్టీతరఫున పోటీచేస్తాడా? తప్పు కాదూ? ఐనా నిలబడ్డాడు. రామిరెడ్డి ఆయన్ను నిలబెట్టిం చాడు! పైగా జనతాపార్టీ ఆశయాలు మంచివేగాని రాష్ట్రి నాయకులకు బుద్ధిలేదన్నాడు. సోమసుందరంగారు నిలబడటం గూర్చి నీవేమనుకుంటున్నావని సుశీలారావు నడిగాను. గుడ్డి కన్ను మూస్తే ఎంత తెరిస్తే ఎంత అన్నాడు సుశీలారావు. ఏమో నాకుమాత్రం భయంగానే వుంది.

ఆడవాళ్లుగూడ పెదిమలుబిగించి గోదాలోకి దిగారు. మహిళాపార్టీ తరఫున జనరల్ సీటుకు లేడీడాక్టరు సుభద్రను నిలబెట్టారు. రిజర్వుసీటుకి పంతులమ్మ తాయారమ్మ నుంచు న్నది. ఇద్దరూ రాజకీయాలకు క్రొత్తవాళ్లే. సగంవోట్లు మనవేగదా అనే ధీమాతో నామినేషన్లు వేశారు. వాళ్ళ దంతా లాటరీ బేరంగా వుంది.

నామినేషన్లు ఎవరూ ఉపసంహరించుకోలేదు. లేబర్ పార్టీ రిజర్వుసీటుకుగూడ ముసలయ్యఅనే అనామకుణ్ణినుంచో బెట్టింది. మొత్తం ఆరుగురుఅభ్యర్థులు; రెండుసీట్లూను. జన రల్ సీటుకీ రిజర్వుసీటుకీకూడా ముప్పేటపోటీలు ఏర్పడినయ్.

ఎన్నికలింకా 15 రోజులున్నయ్. పరీక్షల ముందు విద్యార్థుల మాదిరిగా నిద్రాహారాలులేకుండా సతమత మవు తున్నాం. మూడురోజులకొక కరపత్రం వేస్తున్నాం. ఫిర్కాలో సన్నాసులు తిరిగినట్లు తిరుగుతున్నాం. అగ్రనాయకుల్ని పిలి

పించి సభలు జరుపుతున్నాం. ఎరగనివాళ్ళతో ఎరిగినట్లు మాట్లాడుతున్నాం. ఓడవటం గెలవటం తరువాత సంగతి గాని ప్రజల దగ్గరికి పోవటానికి మంచి అవకాశం గలిగింది.

---

## ప్రచార సంరంభం - 1.

మాపార్టీనాయకుల్లో మంచిమేధావులున్నారు. ప్రజల కోరికలన్నీ ఒక జాబితా వ్రాసి దాన్ని మా ఎన్నికలప్రణాళికగా చేశారు. హైస్కూలున్న ప్రతి గ్రామంలోనూ ఒక సినిమాహాలు ఏర్పాటుచేస్తామన్నారు. పురుషులకు స్త్రీలతో సమాన బాధ్యతలు, స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు కలిగిస్తామన్నారు. అటు బంగాళాఖాతంలోకి రాయలసీమనుంచి మట్టితోలించి ఒక లక్షఎకరాలమేరభూమిని విస్తరింపజేసి కొబ్బరితోటలు వేయిస్తామనీ, ఇటు రాయల సీమలో గుంటలు పెట్టబడ్డచోట్ల ఏర్పడే చెరువుల ద్వారా వ్యవసాయాన్ని పెంపొందిస్తామనీ వ్రాశారు. రాష్ట్రంలో ఒక పది గుడ్డల మిల్లులు క్రొత్తగా స్థాపించి చేనేత సమస్యను పటాపంచలు చేస్తామన్నారు. రైలుపెట్టెల్లోనుంచి టిక్కెట్టు లేని ప్రయాణీకులను నిర్మొహమాటంగా దించివేసి వాళ్ళ కోసం ప్రతి గూడ్సుబండికీ ఒక్కొక్క ప్యాసింజరు పెట్టెను తగిలిస్తామన్నారు. ఎండుగడ్డిలోనుంచి ఆహారం తయారు

చేయించటం కోసం పరిశోధనలు జరిపించి దాని ద్వారా ఆహారకొరత తీరుస్తామనీ, ఇలాగే యూక్లైప్టిస్‌లోనూ మెక్సి కోలోనూ చేస్తున్నారనీ వ్రాశారు.

అద్వితీయము, అమోఘము అయిన ప్రణాళిక అని చదివినవాళ్ళు అన్నారు. ఓర్వలేనివాళ్ళు దీన్నిచూచి వెకిలి నవ్వునవ్వారు. గడ్డి తినిపిస్తారుట అని ఎత్తిపొడిచారు. గుంటలు తవ్వుతారట అని ఎగతాళిచేశారు. పోనీ వాళ్ళ పాపాన వాళ్లేపోతారని నేననుకున్నాను. జర్మనీవాళ్ళు బొగ్గు లోనుంచి వెన్నపూస తయారు చేయగాలేంది. గడ్డిలో నుంచి రొట్టెలు తయారుచేస్తేతప్పా ? పూర్వులుతింటున్న మెతుకులే మనంగూడ తింటే ఇక అభివృద్ధి ఎలావస్తుంది?

కుంభకోణంనుంచివచ్చే "మసాలా" దినపత్రిక సంపా దకునితో మా జనతాపార్టీ వాళ్ళు మాట్లాడివచ్చారు.ఎన్ని కల్లో మా పార్టీని అన్నివిధాలా బలపర్చటానికీ, మా పార్టీ ఎన్నికల సంగతులన్నీ ఫొటోలతో సహా ఎప్పటికప్పుడు ప్రచురించటానికీ ఆయన ఒప్పుకున్నాడు. త్వరలో ఆ సంపా దకునికి జరుగబోయే షష్ఠిపూర్తి ఉత్సవసందర్భంలో మా జనతాపార్టీ అభ్యర్థులందరూ కలిసి తగు రీతిలో సన్మానం చేయడానికిగూడా ఒప్పందం చేసుకున్నారు.

సుశీలారావుకు చేతినిండా పని తగిలింది. "మసాలా" దినపత్రికకు మా పూరి తరఫున విలేఖరి సుశీలారావేనని ఇంతకుముందు మనవిచేశాను. అతను ప్రతిరోజూ నన్ను గురించి

ఏదో ఒక వార్తపత్రికలో పడేటట్లు శ్రద్ధ వహించాడు. కొన్ని కృష్ణలీలలుగూడ అతను చెయ్యకపోలేదు. నరసింహ స్వామి తిరణాలసందర్భంలో రథయాత్రలోపాల్గొన్న సాగరం లాంటి ప్రజాసమూహాన్ని ఫొటోతీసి దానిక్రింద "జనతా పార్టీ వారు తిమ్మాపురంతో ఊరేగింపు జరుపుచున్న దృశ్యం" అనివ్రాసి పత్రిక్కు పంపాడు!...ద్వారం వెంకట స్వామినాయుడు గారి పాటకచ్చేరి వింటున్న మహాజనులను ఫొటోలోదింపి జనతాపార్టీ అభ్యర్థి శ్రీ వెంకటప్పయ్యగారి మహోపన్యాసాన్ని ఆలకిస్తున్న ప్రజావాహిని అని వ్రాసి పంపాడు!... ప్రచారం కొరకు జరిగిన సభలకంటె పత్రికలో వచ్చిన రిపోర్టులే ఎన్నో రెట్లు బాగున్నాయని రెంటినీ పరిశీలించిన వాళ్ళు అన్నారు.

ప్రజలకు లక్షపనులుంటయ్. ఉద్యోగాలు చేసుకోవాలి. వంట చేసుకోవాలి. పిల్లల్ని ఆడించుకోవాలి. మందులు తెచ్చుకోవాలి. నిద్రపోవాలిగదా! అలాంటివాళ్ళు మనం చీటికీమాటికీ పెట్టే ప్రతిసభకూవచ్చి వినమంటే ఎలా వింటారూ? రావటంకష్టం. అయినా సభలు జయప్రదమయ్యే మార్గం వెతకాలి. ఇదివరలో నారాయణరావు, విలాసిని, శంభులింగంగార్లు శతదినోత్సవం చేస్తామంటే వచ్చారు. ఇపుడుగూడ వీలుచేసుకొని వస్తే బాగుంటుంది. సుశీలా రావుతో ఈ మాట చెప్పాను. అతను ఉత్తరంరాసి కనుక్కున్నాడు. ప్రస్తుతం వాళ్ళు ఖాళీగావున్నారట. ఏదో కాస్త ముట్టచెపితేవచ్చి వాలుతామన్నారట. సరేనని ఒక 15రోజుల

పాటు వాళ్ళనువచ్చి మా ఫిర్కాలో మకాం పెట్టమన్నాం. ఆరు వేలకు చెక్కురాసి ఇస్తామన్నాం. సరే వచ్చారు.

బహిరంగ సభల్లో దినం విడిచి దినం వాళ్ళచేత నాటిక ఒకటి వేయిద్దామనుకున్నాం. ఏం నాటిక వేయిస్తే బాగుంటుంది? సాంఘిక నాటికలు వేయిస్తే జనం అర్థం చేసుకొనే స్టేజిలో లేరు. బకాసురుడూ, ఘటోత్కచుడూ అయితేగాని వాళ్ళకు అంతుపట్టరు. ఆలోచించి చూస్తే ద్రౌపదీ వస్త్రాపహరణంమీద ప్రజలకుబాగా మోజున్నట్లు అనిపించింది. ఆ నాటకం మొత్తాన్ని వేసే ఓపిక నటకులకుగాని, చూచే ఓపిక ప్రేక్షకులకుగాని లేదు. అందుచేత 15 నిముషాలలో అయిపోయేటట్లు ద్రౌపదీ వస్త్రాపహరణ దృశ్యంమాత్రం విడిగా వేయించాం. విలాసిని ద్రౌపది వేసింది. దుశ్శాసనుడు యెవరువేయాలని పేచీ వచ్చింది. నారాయణరావు తనకే ఆ అధికారం వున్నదంటాడు. శంభులింగం తాను అర్హుడనంటాడు. రెండూ నిజమే! చెరొకసారి దుశ్శాసన వేషం వెయ్యటానికీ, రెండోవాడు శ్రీకృష్ణ పాత్ర వేయటానికి సమాధానపడ్డారు. జనం విరగబడి వచ్చేవాళ్ళు. మా సభలన్నీ దాదాపు జయప్రదంగానే జరిగాయి.

'దాదాపు' అని యెందుకనవలసి వచ్చిందంటే, ఒక్క సభలో మాత్రం ప్రమాదం జరిగింది. నాటికవుంటుందిగదా అని జనం మందలుమందలుగా వచ్చారు. ఆనాడు జనతా

పార్టీ ఆలిండియా నాయకులొకరు ఉపన్యాసం యిస్తున్నారు. జనాన్ని చూస్తే ఆయనకు పరమానందం కలిగింది. జనం మధ్యలో లేవకుండా వుండటం చూచి ఆయనకు హుషారు వచ్చింది. ఉపన్యాసం ఉపక్రమించాడు. గంట అయింది; రెండుగంటలయింది; మూడో గంటలో 30 నిముషాలు దాటింది. అపడే! ప్రజల్లో మాట లారంభమైనయ్. "హూఁ" అని ఒక మూలనుంచి అరుస్తున్నారు. "విలాసిన్ని తీసుకురండి" అని కేకలు వేశారు. పాపం ఆయన వేదిక దిగాడు. ఇక నాటిక ఆరంభం కావాలి.

కాని నటకులురాలేదు. ఇంటిదగ్గర భీష్మించుకూర్చున్నారట. సంగతి ఏమిటని మహాలింగాన్ని అడిగాను. "మనం యిచ్చిన చెక్కు డిజానరయిందట" అన్నాడు! నాకు కొంప కూలి మీదపడ్డంత పని అయింది. ఇక మార్గ మేమిటన్నాను. నా కంఠంగూడ రుద్ధమైపోయింది. ఇన్ని వేలమంది జనమూ ఏం చేస్తారో ననుకున్నాను. కొండయ్య నాతో కంగారు పడవద్దన్నాడు. స్టేజియెక్కి పదినిముషాల్లో నాటిక ఆరంభమవుతుంది, ఎక్కడివాళ్ళక్కడ కూచోండన్నాడు. ఈ లోగా కారులో మేమంతా ఇళ్ళదారి పట్టాం. మొసలి నోటి నుంచి బయట పడ్డట్లుగా వున్నది నాకు. తర్వాత కొండయ్య జనాన్ని సర్ది పంపించాడట!

# ప్రచార సంరంభం - 2

మా పార్టీ జెండాను నిర్ణయించడంలోనే అగ్రనాయకుల తెలివితేటలన్నీ పొదగబడి ఉన్నాయని ఎవరైనాసరే అంగీకరించకతప్పదు. లేత నీలిరంగు గుడ్డమీద తెల్లరంగుతో మూడు మామిడికాయల గుత్తి వేయబడివుంటే అది మా జనతాపార్టీ జెండా అన్నమాట. పార్టీ ఆశయాలూ, సిద్ధాంతాలూ ఇందులో గర్భితమైవున్నాయి. ఈ విశ్వమంతా నీలిరంగులోనుంచే ఉద్భవించింది. సముద్రం మధ్యలోకిపోతే నీళ్ళు నీలంగా వుంటాయి. యమునానది నీలంగానేవుంటుంది గదా! శ్రీకృష్ణ పరమాత్ముడు నీలిరంగులో తప్ప దర్శనమివ్వడుగదా! అసలు ఆకాశమే నీలంగా వుంటుంది. ఈ పాడు బతుకుమీద ఋణం తీరినవారంతా అ అనంతాకాశంలోనే లీనమవుతారట! వీటన్నిటినీ ఆలోచించి మా జెండారంగును లేత నీలిరంగుగా నిర్ణయించారు.

ఇకపోతే మూడు మామిడికాయల సంగతి— అగ్ని లేకుండా మనకు క్షణం గడవదుగదా! వంటచేసుకోటానికీ, నీరు కాగబెట్టుకోటానికీ అవసరమయే నిప్పుసంగతికాదు నేను చెప్పటం. పురుషులలో అధిక సంఖ్యాకులు, స్త్రీలలో అల్ప సంఖ్యాకులూ ఉండుండి పక్కనున్న వాళ్ళను "అగ్గిపెట్టెవున్నదా అండీ"అని అడుగుతూ ఉంటారు. దీన్నిబట్టే గ్రహించవచ్చు ప్రజలు ఎంతగా అగ్నిపూజ చేస్తున్నారో

ఈ విషయాన్ని గ్రహించే పార్టీ జెండామీద మూడుమామిడి కాయలగుర్తువేశారు. ప్రజల అభిమతాలను జనతాపార్టీ మన్నిస్తుందనటానికి ఇది ప్రబల నిదర్శనం. మా ఎన్నికల చిహ్నంగాగూడ మూడు మామిడికాయలే తీసుకోబడ్డాయి.

మహిళాపార్టీ వారిజెండా ఆకుపచ్చరంగులో ఉంటుంది. ఆ జెండామీద చంద్రహారము పసుపుపచ్చరంగులో ముద్రించబడి వుంటుంది. స్త్రీల కనీసపుకోర్కె చంద్రహారం అని దాని అర్థమట! "సైకిలు తొక్కుచున్న స్త్రీ" మహిళాపార్టీ తన ఎన్నికల గుర్తుగా స్వీకరించింది !

లేబర్‌పార్టీ నల్లరంగు గుడ్డమీద తెల్ల నిపలుగు, పార గుర్తువేసి దాన్ని తమ జెండా అని చెప్పుకుంటున్నారు. నల్ల జెండా తాము స్వీకరించటం వలన అదేమీ శోకచిహ్నము గాని అసమ్మతి సూచనగాని కాదనీ, లోకమంతా కటిక చీకటిలో కప్పబడివున్నదని, గనుక దాన్ని పలుగూ పారలతో పైకి పెకలించాలనీ అర్థం చెప్పారు! వాళ్ళ ఎన్నికల గుర్తు గూడా పలుగూ పారే.

ప్రచారం జోరుగా సాగుతున్నది. సర్కసులో కళ్ళకు గంతకట్టుకొని ఒకడు కత్తులు విసురుతూవుంటాడు. తలుపు చెక్కకు ఆనుకొని నిలబడ్డ స్త్రీకి పక్కగా దూసుకు పోతుంటయ్ కత్తులు. చూస్తుంటే ఏ నిమిషంలో ఆ పిల్లమీద కత్తి పడుతుందోఅని ప్రేక్షకుల గుండెలు పీచుపీచుమంటుంటాయి. అలాగే ఎన్నికలు దగ్గరపడుతున్నకొద్దీ ఇటు మా వాళ్ళూ,

అటు లేబర్ పార్టీవాళ్ళు చేరి ఏ నిముషంలో పీపులుచరుచు కుంటారోనని అనిపించేది.

నడిబజారులో గౌతమబుద్ధుడి బొమ్మ ఒకటున్నది. ఆబొమ్మ ముందర సరివి వాసము పాతి దానికి నీలం జెండా తగిలిద్దామని వెళ్ళారు మా కుఱ్ఱవాళ్ళు. ఇదిచూచి అవతల వాళ్ళు ఇంకా రెండు గజాలుండే బొంగొకటి తెచ్చి నల్ల జెండా పాతాలని తయారైనారు. గౌతమబుద్ధుడు జనుల కోసం పాటుపడ్డ వాడనీ, ఆయన బొమ్మదగ్గర జనతాపార్టీ జెండా పెట్టాలనీ మావాళ్ళన్నారు. గౌతమబుద్ధుణ్ణి ఎవరూ కొనుక్కోలేదనీ, ఆయనమీద కాపీరైటు హక్కులు ఎవరికీ లేవనీ, ఆయన ఎవరుపడితే వాళ్ళవాడేవనీ లేబర్ పార్టీ వాళ్ళన్నారు. మా కుఱ్ఱవాళ్ళకు రోషంవచ్చి నాలుగు ఇచ్చుకుందామని చొక్కాలు పైకిమడిచారు. ఈ లోగా దేవుడల్లే మా వూరి హెడ్మాస్టరుగారు అక్కడికి వచ్చి "చచ్చిపోయిన గౌతమబుద్ధుడికోసం కొట్టుకోకండి. అహింసామూర్తి విగ్రహంముందు నరబలి ఇవ్వబోకండి. బుద్ధుడి బొమ్మకు కుడివైపున ఒకరు, ఎడమవైపున ఒకరు, జెండాలు పాతండి" అని సలహా ఇచ్చారు. సరేనని విగ్రహానికి రెండుప్రక్కలా రెండు ధ్వజస్తంభాలు పాతి జెండాలు ఎగురవేశారు.

ప్రతి ఆదివారం తిమ్మాపురంలోను, వెంగళాయపాలెంలోనూ ఊరేగింపులు జరిగేవి. ఫిర్కాలో ఇవి రెండే పెద్దవూళ్ళు. ఊరేగింపులో పాల్గొనటానికి అప్పుడప్పుడు

ఎడ్ల జతలనుగూడ తోలుకొచ్చేవాళ్ళు. ఊరేగింపు ఎంత పొడుగ్గా వుంటే అంత గొప్పగా పరిగణిస్తారు.

ఒకనాడు పడుతుందనుకున్న పిడుగు పడకుండానే పోయింది. ఆనాడు ఊరేగింపు ఇటునుంచి ఒక ఇరుకైన సందులోగుండా వస్తుంది. అదే సందులోగుండా అటునుంచి లేబర్ పార్టీ ఊరేగింపువస్తున్నది. మనుష్యుల్లో హుషారెక్కు వయింది. రెండుఖడ్గాలు ఒకదాన్నొకటి ఒరుసుకుంటూపోయి నట్లుగా రెండు వరుసల్లోనూ జనం చెంగుచెంగున నడుస్తు న్నారు. ఆకాశం మారుమ్రోగేటట్లు చేతులెత్తుతూ నినా దాలిస్తున్నారు. అవతలివాళ్ళ కుడిచెయ్యి ఇవతలివాళ్ళ కుడి చెయ్యి వెంట్రుకవాసిలో పోతున్నాయి. సందుదాటేలోగా ఎక్కడ చేతులు కలుస్తాయోనని భయంగా వున్నది.

ఇంతలో మాపార్టీ కుఱ్ఱవాడిభుజంమీద అవతలిపార్టీ యువకుడి చెయ్యి పడింది. ఇంకేముందీ ! వాళ్ళచుట్టూ నలుగురు చేశారు. ఆ నలుగురి చుట్టూ పదిమంది చేశారు. గుంపు చూస్తూచూస్తుండగానే పెరిగిపోయింది. "పదండి - పట్టుకోండి-ఊ-చూస్తారేం-దెబ్బకుదెబ్బే" అని మాటలువిన వస్తున్నాయి. ఆనాడు తలకాయలు కొబ్బరికాయల్లాగ ఎగు రుతాయని అభిజ్ఞులు భావించారు. అసలు సంగతేమిట్రా అని నేను గుంపులోకి దూసుకుంటూ పోయి ఆ యిద్దరు కుఱ్ఱ వాళ్ళ రెండురెక్కలూ పట్టుకొనిఅడిగాను. మాపార్టీవాడూ అవతలిపార్టీవాడూ బావమరదులట! వాడిది మా వూరు

కాదుట. లేబర్ పార్టీ వూరేగింపుకోసం వచ్చాడట. మావాణ్ణి వాడుచూచి చటుక్కున బుజంమీద చెయ్యివేసి "అన్నానికి వస్తానోయి బావా" అన్నాడట. "ఎక్కడైనా బావ కాని వంగతోటదగ్గర మాత్రం బావకాదురా" అన్నాడట మావాడు. "ఎన్నికలు వచ్చినంతమాత్రాన బావను కాక పోతానట్రా" అన్నాడట అవతలివాడు. "చుట్టరికం గిట్టరికం జాంతానై" అన్నాడట మావాడు. ఇంతలో మిగతా జనమంతా చుట్టూ చేరారు. ఇదీ సంగతి! భలేబాగుంది పదండి అని మళ్ళీ ఎవరి ఊరేగింపులోవాళ్ళు చేరి గొంతులు సవరించుకొని నినాదాలివ్వటం ఆరంభించారు.

మహిళాపార్టీవాళ్ళు కళ్ళుమిరుమిట్లు గొలిపేపని ఒకటి చేశారు. మహిళాపార్టీ రాష్ట్రి కార్యాలయంవాళ్ళు వంద మంది నడివయస్సు యువతులకు సైకిలు తొక్కటం నేర్పించారట. నెలరోజులపాటు రాజకీయ పాఠశాల ఒకటి నడిపి అందులో ఈ కార్యక్రమం తీసుకున్నారు. ఆ 100 మందికీ మాంచి ర్యాలీ సైకిళ్ళు కొనిఇచ్చారు. నాలుగురోజుల కొకసారి ఒక్కొక్క నియోజకవర్గంలోని ముఖ్యగ్రామంలో ఆ వందమందీ దేవతా స్త్రీలమాదిరిగా అవతరించి వూరిలోని ముఖ్యవీధులగుండా సైకిల్ వూరేగింపు తీసుకుంటున్నారు. ఒకసారితిమ్మాపురంలోగూడ ఈ కార్యక్రమంతీసుకున్నారు. ముందునైపున లేడీ డాక్టరుసుభద్ర, తాయారమ్మ గారలు టాపులేసికారులో కూచున్నారు. వాళ్ళవెనుక ఈ వంద

మందీ బయలుదేరారు. "సైకిలు తొక్కుతున్న స్త్రీ" పెట్టె లోనే మా వోటు అని నినాదాలిచ్చారు. ఆనాడు వూరు వూరతావచ్చి ఆవిచిత్రాన్ని చూచివిస్తుపోయింది. ముసలమ్మలు ముక్కుమీద వేలేసుకున్నారు. వయసుమళ్ళినవాళ్ళు బ్రహ్మం గారి సుద్దులు గుర్తు తెచ్చుకున్నారు. సైకిలు తొక్కగల స్త్రీలు వెధవ మంత్రిపదవి నిర్వహించలేరా అని అభిజ్ఞులు అన్నారు. తిమ్మాపురంలో కుట్టివాళ్ళ వోట్లు ఉమ్మడిగాపోయి మహిళాపార్టీ పెట్టెల్లో పడతాయని భయమేసింది.

వూళ్ళో మనుషులు నానాటికీ దొరక్కుండా పోవట మారంభించారు. యుద్ధంరోజుల్లో పాలడబ్బాలు కరువైనట్లు మావూళ్లో చేతిలోకి మనుషులు కరువైనారు. "బ్లాకు"లో దొరుకుతారేమోనని సుశీలారావు వాకబు చేస్తున్నాడు. రోజుకు రూపాయిచ్చి రెండుపూటలా కోమల విలాస్‌లో పావలా పావలా టిఫిన్ పెట్టిస్తామని మేమన్నాం. పై పోటీ కోసం రామిరెడ్డి లేబర్‌పార్టీతరఫున ఒకపూట భోజనంగూడ పెట్టిస్తామన్నాడు. మేము వీడి అంతు తేలుద్దామని రెండు పూటలా భోజనంఅన్నాం. రామిరెడ్డిమటుకు సామాన్యుడా! కాన్పూరు బెల్టు చెప్పులు కొనిస్తానన్నాడు. ఇలావుంది మను షుల రేటు! పోటీలో తలదూర్చి ఇక వెనుకాడకూడదని మేము కూడా ఒక్కొక్కరికి ఒక బీస్ని చొక్కాకొని ఇస్తా మన్నాం....తరువాత మహాలింగం నన్ను దగ్గరకు పిలిచి చెప్పాడు. మనపార్టీ కుట్టివాళ్ళలో ఒకడిదగ్గర రెండుపార్టీల

బాడ్జీలూ వున్నాయట. వాడు మా బాడ్జీ పెట్టుకొని కోమల విలాస్‌లోనూ తినివస్తాడట. ఒక గంటసేపు జీర్ణకోశానికి విశ్రాంతి ఇచ్చి వాళ్ళ బాడ్జీ పెట్టుకొని వెళ్ళి ఉడిపి హోటల్లో గూడ పట్టించుకొని వస్తాడట! తరువాత వాణ్ణి దగ్గరకు పిలిచి అలా చేయకూడదని మందలించాం లెండి.

ఈ ఓటర్లు కాదుగాని నా తలప్రాణం తోకకు వచ్చింది. ఇదివరకు మనుష్యుల్ని అదిరించీ బెదిరించే పనులు జరుపుకొని పోయాం. ఇపుడు అలా వీలుకాకుండా వచ్చింది. 21 యేళ్ళు దాటిన ప్రతినాడూ నామీద తనకేదో అధికారం వున్నదనుకుంటాడు. ఎవరితోనైనా పల్లెత్తుమాట కటువుగా అంటే గుప్పున వూరంతా దుష్ప్రచారం జరిగి వాతావరణం కల్మషమయ్యే ప్రమాదం కనిపించింది. అందుచేత మేకకున్నంత సాధుత్వాన్ని, మహిషానికున్నంత ఓపికను అలవరుచుకున్నాను. కుండలో పెట్టబడి మూత వేయబడ్డ త్రాచుపాము మోస్తరుగా అహంకారాన్ని పైకుబకనీయకుండా అదిమిపట్టి లోపలే వుంచివేసుకున్నాను. రామలక్ష్మణుల నిద్దరినీ రెండు భుజాలమీదా కూర్చో బెట్టుకొని యెగిరివెళ్ళిన హనుమంతుని మోస్తరుగా నేనీ వోటర్లకు ఉపచారం చేయటానికే ఇక్కడ వున్నట్లు మెలిగాను. నిజానికి నా ప్రవర్తన నాకే ఆశ్చర్యం వేసింది!

## ప్రసవవేదన!

బ్రహ్మదేవుడు చేసిన సృష్టిలోకెల్ల అపూర్వమైన, అధునాతనమైన, అద్వితీయమైన తాజాసరుకు ఎన్నికలు. వీటి కివేసాటి. సంగ్రామంలో మాదిరిగా రెండు పార్టీలుంటయ్; రక్తం మాత్రం కార్చరు. తిరుణాలలో మాదిరిగా కారుమేఘాలు పరుగెత్తినట్లు జనం గుంపులు గుంపులుగా తిరుగాడుతుంటారు. నాటకాలూ, బుర్రకథలూ వుంటయ్. ఐతే తిరణాల్లో లాగా జనం ఒక గాడిలో నడవరు. ఎందరు అభ్యర్థులుంటే అన్ని గాళ్ళు వుంటయ్. చేపల బజారులో మాదిరి గందరగోళం వుంటుంది; నీచువాసన మాత్రంరాదు. దీపావళి పండగలోలాగ తూటాలవంటి అపవాదులను ఒకరిమీది కొకరు గురిచేస్తుంటారు; కాని అగ్నిమాత్రం ప్రజ్వరిల్లదు. హోలీ పండగలో వసంతం చిలికినట్లు ఒకరిమీద ఒకరు పాతచెప్పులు, గులకరాళ్ళూ, కోడిగుడ్లూ విసరుకొని ముచ్చట పడుతుంటారు గాని బెంచి మేజిస్ట్రేటుదగ్గరికొచ్చి చార్జి పెట్టుకోరు. ఐతే హోలీ పండగలో సరసం కనపడుతుంది; ఎన్నికలలో విరసం కనపడుతుంది. ఇదీ సంగతి!

అసలీ ఎన్నికల్లో కనపడే శత్రుత్వంగూడ అన్ని శత్రుత్వాల మాదిరిదిగాదు. తండ్రీకొడుకుల మధ్య, భార్యాభర్తల మధ్య, అన్నాతమ్ముల మధ్య నిస్పృహాజుకుంటుంది.

ప్రేమకూ వాత్సల్యానికీ ఆస్కారంలేదు. దొంగకూ దొంగకూ పరిచయం లేకపోయినా స్నేహితులే అవుతారని సామెత వున్నది. ఆ ఉపమానాన్ని ఇక్కడ వాడటం సమంజసం కాదేమోనని సందేహిస్తున్నాను. కాని ఒకే పార్టీ వాళ్ళు ముఖపరిచయం లేకపోయినా స్నేహితులే అవుతారు! ఊళ్ళో వున్న కిల్లీకొట్లనుంచి కిరాణాకొట్లవరకు అన్నిటి మొహానా ఫలానా పార్టీ అని ఎజ్జ్రగీత గీయబడి వుంటుంది! ఈ కొంప మీది కాకి ఆకొంపమీద వాలదు. ఈ పార్టీ వాడి హోటలు నుంచి రికార్డులు వినపడుతున్నాసరే చెవులైనా మూసుకుంటాడుగాని చస్తేవినడు. ఇలాంటి వాతావరణంలో శాసన సభకు ఎన్నికలు ఆరంభం కాబోతున్నాయి.

భారత యుద్ధంలో శిఖండి ఎంత ప్రయోజకుడో మా ఎన్నికల్లో జెకరయ్య అంత ప్రయోజకుడైనాడు. అతను రాజకీయాలకు పనికొచ్చే మనిషి కాడు. శాసనసభ్యత్వం నాకెందుకు నా మొహం, ఎదైనా బడిపంతులు పని ఇప్పించరాదా బతుకుతానంటాడు. పోనీ నాలుగెకరాలు కౌలుకిప్పిస్తే సాగుచేసుకుంటానంటాడు. నోరు మూయించి నిలుచో బెట్టాం రిజర్వుసీటుకి. గాబరా పడవద్దన్నాం. పిల్లవాణ్ణి బుజ్జగించినట్లు బుజ్జగించాం. అతను ప్రచారం చేసుకొని గెలిచేమార్గం చూచుకోవద్దూ? ఉహూ! రోజుకోసారి కనపడి "విడ్రా" చేసుకుంటానంటాడు. ఈ ఇతన్ని వదిలించుకోవాలని నాకు వుండేదే గాని సుశీలారావు ఆ మాట ఎత్తవద్దన్నాడు.

ఎన్నికలు ఎల్లుండి అనంగా రాత్రి ఒంటిగంటప్పుడు మహిళాపార్టీ అభ్యర్థులు శ్రీమతి సుభద్ర, శ్రీమతి తాయారమ్మలు ముసుగులు వేసుకొని రహస్యంగా మా యింటికి వచ్చారు. నాకు కళ్ళు చెదిరినయ్. మాట తడబడ పడింది. ఆశ్చర్యం వేసింది. నాకళ్ళు నేను నమ్మలేకపోయాను. గురకలు పెడుతున్న సుశీలారావుని తట్టిలేపాను. వాళ్లు వచ్చారని చెప్పాను. ఒక చిరునవ్వు చిలికాడు. వాళ్ళదగ్గరకు వచ్చాడు. నలుగురమూ నాలుగు కుర్చీలలో ఆసీనులమైనాం.

చాలాసేపు సంభాషణ నడిచింది. ఎలాగైనా లేబర్ పార్టీని గెలవకుండా చేయాలనేనిర్ణయానికి వచ్చాం.మహిళా పార్టీవారు జనరల్ సీటును మాకు వదలివేయటానికీ, మేము రిజర్వుసీటును మహిళాపార్టీకి వదలివేయటానికీ ఒప్పందం చేసుకున్నాం. సుభద్ర, జెకరయ్యలు ఇక ప్రచారం ఆపి వేయాలని నిశ్చయించాం. రెండు పార్టీలూ ఐక్యంగా లేబర్ పార్టీని యెదుర్కొంటాయన్నమాట! అప్పటికప్పుడు సైకిళ్ళమీద నియోజకవర్గంలో అన్ని గ్రామాలకూ కబుర్లు పంపించాం.

మేము తురుపు ముక్కలు బయటకు తీసేసరికి రథం కుంగిన కర్ణుడిలా సోమసుందరం వగైరాలు ముఖాలు వేలాడ వేశారు. ఇంతదూరం వచ్చింతర్వాత పట్టువదలగూడదని ఏదో మొండిగా నిలబడుతున్నారు. సుశీలారావు మనకు జయం ఖాయమని బల్లగుద్ది చెపుతున్నాడు.నామటుకునాకు

యిదంతా చిత్రంగా వుంది. ఎన్నికల్లో గెలవటంకోసం పోటీ పడుతున్న ముగ్గురిలో యిద్దరు సమాధానపడడమేమిటి నా మొహం? అలాగైతే యివన్నీ ఉత్తుత్తి పార్టీలూ ఉత్తుత్తి విరోధాలేనా? కుస్తీ పోటీలకు ముగ్గురు ఫైల్వాన్లువస్తేవారిలో యిద్దరు సమాధాన పడటం మనం ఎన్నడూ వినలేదే !

తెల్లవారితే యెన్నికలనంగా నాటి మిట్టమధ్యాహ్నం 12 గంటలకు మహాలింగం, కొండయ్య లిద్దరూ వచ్చిమూడు కఠోర సమస్యలు తెచ్చిపెట్టారు. మా నియోజకవర్గంలో ముట్లూరు అనే గ్రామం ఒకటుంది. ఆగ్రామంలో స్త్రీ లకు ఉదయం లేచి బహిర్భూమికి వెళ్ళాలంటే మరుగు లేకుండా వచ్చింది. నానా అవస్థ పడుతున్నారు. ఆవూళ్ళో రెండు వందలు కర్చుచేసి నాలుగు పాకీదొడ్లు గనుక కట్టిస్తే అక్కడున్న నాలుగువందల ఓట్లూ మనకు వస్తయ్. లేకపోతే రావు. ఇదీ సంగతి.

మురికిపూడి అనే మరొక వూరున్నది. ఆవూళ్ళో జనం మంచి కట్టుగా వుంటారు. వాళ్ళందరికీ ఒక ముఠా నాయకుడున్నాడు. ఆయన యెవరికి వెయ్యమంటే వాళ్ళు ఓట్లు అతనికి వేస్తారు. ఆముఠా నాయకుడికి స్కూలుఫైనలు షుమారుగా ప్యాసైన సుబ్బారాయుడనే కుఱ్ఱవాడున్నాడు. ఆ సుపుత్రుడికి ఏ అభ్యర్థి ఉద్యోగం యిప్పిస్తానని మాట యిస్తే ఆవూరి ఓట్లన్నీ అతనికి వేయిస్తానని ఆముఠానాయకు డంటున్నాడు!

పిడుగుపాడు అని యింకొక వూరున్నది. ఆ వూరు

దగ్గరే చవిటిపఱ్ఱు అనే గ్రామమున్నది. ఒకసారి రెండు వూళ్ళ కుఱ్ఱవాళ్ళూ చెడుగుడు పందాలాడారు. పెదగుపాడు టీములో బాగా ఆడేవాణ్ణి చవిటిపఱ్ఱువాళ్ళు కూతకు వచ్చినపుడు పట్టుకొని కూత ఆపినప్పటికీ మీదపడి కీలు తొలగదీశారు. వాడు 'చచ్చాన్రోయ్' అని కేకవేశాడు. ఇహయింకేముంది. 'ఆడముండలల్లే ఆడలేకపోగా మావాడిచెయ్యి విరిచేశారా' అని పెదగుపాడువాళ్ళు యెవరి చేతికందిన కఱ్ఱలు వాళ్ళు పుచ్చుకొని చవిటిపఱ్ఱువాళ్ళ వీపులుచిట్లకొట్టి విజయోత్సాహంతో ఇళ్ళకు చేరారు. చవిటిపఱ్ఱువాళ్లు ఈ అవమానాన్ని భరించలేకపోతున్నారు. ఇంకొక పదిరోజుల్లో లగ్గం పెట్టుకున్నారు. పెదగుపాడు వాళ్ళను కాలవగట్టు మీదకు రానిచ్చి మోతమోగించాలని కత్తులూ బరిసెలూ సిద్ధం చేస్తున్నారు. తరువాత ఏమి జరిగినా పోలీసులవల్ల యెలాంటి ముప్పమూరాకుండా మనం చూస్తామని హామీయిస్తే ఆవూరి ఓట్లు మనకు వస్తయ్. ఇదీ చవిటిపఱ్ఱు పరిస్థితి.

నాకేమీ పాలుపోలేదు. ప్రసవకాలంలో నొప్పులు వచ్చినట్లు ఎన్నికలముందు ఇలాంటి బాధలు తప్పవులెమ్మని భరించి వూరుకున్నాను. సుశీలారావు సవ్యసాచి మోస్తరుగా ఆజ్ఞలు జారీచేస్తున్నాడు. ముట్లూరులో పాకీదొడ్లు కట్టించటానికి అడ్వాన్సుగా 100 రూపాయలు ఆవూరి పెద్దకిచ్చి రసీదుపుచ్చుకోమని ఒకడిని పురమాయించాడు. సూపర్‌వైజరులు ప్యానెలైన సుబ్బారాయుడు నిక్షేపంగా వచ్చి

కంట్రాక్టర్ మహాలింగం దగ్గర తర్ఫీదుపొందవచ్చు; తిమ్మాపురంలో వుండి శైపు, పార్టుహాండు నేర్చుకోవచ్చు; పంపమనండి అని మురికిపూడికి కబురు చేశాడు. ఇక పోతే పిడుగుపాడు, చవిటిపర్రులు ఒకదానికొకటి శత్రుత్వంలో వున్నాయి గనుక ఒకవూరు మనపక్షంతిరిగితే రెండవవూరు మనకు వ్యతిరేకమవుతుంది. అందుచేత ఏ వూరిలో ఓటర్లు ఎక్కువమంది వున్నారా అని సుశీలారావు ఆలోచించి చవిటిపర్రు పెద్దవూరని తెలుసుకొని "పోలీసులు మనంగీచిన గీటు దాటరు. తెలిసిందా?" అని చవిటిపర్రు గ్రామ పెద్దలకు కబురుచేశాడు.

ఎన్నికలంటే మజాగాడు! చాణుక్యుడికున్నంత బుర్ర కావాలి. చదరంగపుయెత్తులు వేయాలి. "తెరచిరాజు" అని ఆటకట్టించాలి... మైనరును సింహాసన మెక్కించి మంత్రులు పాలించినట్లు నన్ను ఎన్నికలకు నుంచోపెట్టి అన్నిపన్లూ వాళ్ళే చూసుకుంటున్నారు. ఎందుకో నామీాద ఇంత అభిమానం? వీళ్ళకు నేను గెలిస్తే ఏం ఒరుగుతుందో!... మరీ నెలరోజుల నుంచి నిద్రాహారాలు లేకుండా కాలికి బలపంకట్టుకొని తిరగడంవల్ల వళ్ళంతా హూనంహూనం అయిపోయింది. కూచుంటే నిద్రవస్తున్నది, నుంచుంటే నిద్ర వస్తున్నది. నడుస్తుంటేనూ నిద్రవస్తున్నది, మాట్లాడుతుంటే గూడా నిద్రవస్తున్నది! ఆరాత్రిగడిస్తే ఎన్నికలు ఆరంభమవుతయ్!... వెళ్ళి పడుకున్నాను.



# ప్రశాంత సమరం

అది చూచి తీరవలసినరోజు. జ్వరం వచ్చినవాడికి శరీరంలో మూలమూలలా వేడెక్కినట్లు పోలింగురోజున నియోజకవర్గంలోని గ్రామ గ్రామంలోనూ కోలాహలంగా వున్నది. అంతటి ఆవేశం అందరికీ ఉమ్మడిగా ఎన్నడూవచ్చి వుండదు... దసరాపండక్కి విల్లంబులు పుచ్చుకొని తిరిగినట్లు బడిపిల్లలు జెండాలు పుచ్చుకొని తిరుగుతున్నారు... తిరణాల్లో బుట్టబొమ్మలు నిలబడ్డట్లు పోలీసులు అక్కడక్కడ నిలబడి లాఠీలను గాలిలో తిప్పుతున్నారు...చీమల బారుల మోస్తరుగా ఓటర్లు "బూతు"ల ముందు వరుసల్లో నిలబడుతున్నారు...యుద్ధరంగంమీద పర్యవేక్షక విమానాలు సంచారం చేసినట్లుగా అభ్యర్థుల కార్లు నియోజకవర్గాన్ని అటునుంచి ఇటు, ఇటునుంచి అటూ చుట్టివస్తున్నాయి...తిరుపతి వెంకటేశ్వరస్వామి దిబ్బైన డబ్బులతో నిండినట్లు బ్యాలట్ పెట్టెలు ఓట్లతో నిండుతున్నాయి.

నేనూ, సుశీలారావూ, తాయారమ్మా కలిసి చిన్న కారులో ఉదయం బయలుదేరాము. మా ఓట్లు ఓం ప్రథంగా పోలుచేశాం. జనతాపార్టీ జెండాను మహిళాపార్టీ జెండానూ ఏటవాలుగా ఒకదానిమీద ఒకటిపెట్టి కారు ముందుభాగంలో కట్టివేశాం. నీలమూ, ఆకుపచ్చా మంచి కలయికేనని సుశీలారావన్నాడు నవ్వుతూ. తాయారమ్మ

డిటో అన్నట్లు ఒక చిరునవ్వు పారేసింది. ఆమె ఎక్కువగా మాట్లాడదు. ఎక్కువగా ఏమిటి, అసలు మాట్లాడదు. మౌనమే భూషణం అన్నలోకోక్తిని ఆమె చక్కగా వినియోగించుకుంటుంది. ఆమెగనుక మాట్లాడితే ఆమెమీద మనకున్న గౌరవం తగ్గే అవకాశాలున్నాయి! అందుకని అలాంటి ప్రమాదం ఆమె రానివ్వదు!

మా వూరి హైస్కూలు ఉపాధ్యాయులు 50 మంది ఉన్నారు. వాళ్ళు చాలా చోట్లకు ప్రిసైడింగు ఆఫీసర్లుగా వెళ్ళారు. ఓటర్లలో నూటికి 80 మందిదాకా తూర్పు పడమరలు తెలియని అమాయకులైన పాటకపు జనం. వాళ్లు "బూతు"ల్లోకి వెళ్ళి చీకట్లో పెట్టెల్ని గుర్తుపట్టి వోట్లు వేయడం సులభమైన సంగతికాదు. చాలామంది ఓట్లను కంతల్లో జారవిడవకుండా పెట్టెలమీదనే వదలి వచ్చేవాళ్లు. మా ఉపాధ్యాయులు నామీది గౌరవంవల్ల గంటకొకసారి బూతుల్లో తనిఖీకోసం వెళ్ళినట్లు వెళ్ళి వెలుపలగా పడివున్న ఓట్లను మామిడికాయ మార్కు పెట్టెల్లో వేసేవారు !

ప్రతిపోలింగుస్టేషను దగ్గరా మావాళ్ళూ, లేబర్ పార్టీ వాళ్లూగూడా ఎవరి పంచలోనో ఒకరిపంచలో జేరి నాలుగు కుర్చీలూ ఒక బల్లావేసి చుట్టూ పార్టీ జెండాలు కట్టి వచ్చే వోటర్లను మాదగ్గరకు రమ్మంటే మాదగ్గరకురమ్మని పిలిచి, వాళ్ళ బాలెట్ నెంబరు వ్రాసి చీటీ లిచ్చేవాళ్ళు. ఒకరి దగ్గర చీటీ పుచ్చుకొని మరొకళ్ళకు ఓట్లు వేసేవారులేకపోరు.

కాని ఓటర్లు పదిమంది దగ్గరకు రావడమే ఆ నిమిషంలో ఒక ఘనకార్యంగా కనిపించింది.

ఆనాడు రిక్షాలకూ, ఎద్దుబండ్లకూ, గుఱ్ఱంబండ్లకూ తెగ గిరాకి తగిలింది. మొత్తం వందరిక్షాబండ్లను మేము కంట్రాక్టు తీసుకున్నాం. ఇంటింటికీ వెళ్ళి ఓటర్లను వాళ్ళ గడ్డమూ పట్టుకొని పెళ్ళికి పిలుచుకొచ్చినట్లుగా మా వాళ్ళు పిలుచుకొని వచ్చారు. మధ్యాహ్నం 12 గంటలయ్యేసరికి జనం పల్చబడ్డారు. వాలంటీర్లు తోటకూర కాడల్లా వాలిపోతున్నారు. అన్నాలు తినటానికీ కాఫీలు తాగటానికీ ముఠా నాయకులు వెళ్లారు. ఇదే సమయమని లేబర్ పార్టీ వాళ్లు చచ్చిపోయిన వోట్లూ, ఊళ్లోలేని వోట్లూ వేయించడ మారంభించారు. మా పోలింగు ఏజంట్లు నాలుగైదుసార్లు ఛాలెంజి చేశారు. అలా చేసినపుడల్లా పదిరూపాయలు డిపాజిట్ సమర్పించుకోవలసి వున్నది. ఇది అసాధ్యమైన విషయంగా కనిపించింది. ఇలా కాదని మాపార్టీవాళ్లుగూడ ప్రిసైడింగు ఆఫీసర్లు అనుకూలంగా వున్న పోలింగ్ స్టేషన్లుగా చూచి ఒక వంద చచ్చినఓట్లను పోలుచేశారు. అవునుమరి. రంగంలోకి దిగింతర్వాత న్యాయమేమిటి అన్యాయమేమిటి? అవతలివాళ్ళు ఏ ఆయుధం పుచ్చుకుంటే మనమూ ఆ ఆయుధంతోటే ఎదుర్కోవాలి! రుద్రాక్షమాలపుచ్చుకుంటే రాలేది బూడిదే!

సాయంకాలం సూర్యాస్తమయం ఎంతో రమ్యంగా వుంది. చాలా రోజులతర్వాత అస్తమిస్తున్న సూర్యుణ్ణి

చూశాను. కారులో వెంగళాయపాలెం నుంచి తిమ్మాపురం చేరుతుండగా సూర్యుడు అస్తమిస్తున్నాడు. గిలిగింతలు పెట్టే సూర్యకిరణాలు తాయారమ్మను రాచుకుంటూ వచ్చి నన్ను తాకుతున్నాయి. పగలల్లా ప్రభాకరుడు ప్రచండ ప్రతాపాన్ని ప్రదర్శించి లోకాన్ని గగ్గోలుపరిచాడు. ఇపుడే తాను విశ్రాంతి తీసుకుంటూ మానవాళికి విశ్రాంతి నిస్తున్నాడు. ఎండిన నేలమీద వర్షం పడ్డట్లు ఆ సంధ్యాసమయంలో మా మనసులు ఆందోళనలనుంచి విముక్తి చెంది విరామం తీసుకుంటున్నాయి. తూర్పుదిశను హిమాంశుడు చల్లని కిరణాలతో సేదదీరుస్తున్నాడు. మా గమ్యస్థానం దగ్గరకువచ్చింది. వీపుమీదనుంచి వడ్లబస్తా దించివేసినంత ఆనందంకలిగింది. ఇద్దరమూ చల్లని పానీయం పుచ్చుకున్నాం.

మూడురోజులు వాటంతటవి గడిచిపోయినయ్.

నాలుగవనాటి ఉదయం 8గంటలకు తాలూకా కచ్చేరిలో ఓట్ల లెక్కింపు ఆరంభమయింది. నలుగురు అభ్యర్థులమూ నాలుగు చెట్లకిందా జేరి నిముషాలూ, సెకండ్లూ లెక్కపెట్టుకుంటున్నాం. వడ్లకొలత కొలిచేటప్పుడు మనిషి దగ్గరున్నట్లుఅభ్యర్థులతరఫు ఏజంట్లు ఓట్లలెక్కింపుదగ్గరవుండి అన్యాయం జరక్కుండా చూస్తున్నారు. గంట కొకమనిషి బయటికివచ్చి ఓట్ల వివరాలు చెప్పిపోతుండేవాడు. మూడువంతుల పెట్టెలు ఐపోగానే నాకు 10 వేల ఓట్లు, సోమసుందరం (లేబర్) గారికి 5వేలుఓట్లు వచ్చినయ్. మావాళ్ళు అప్పుడే పట్టపగ్గాలు లేకుండా కుప్పిగంతులు వేస్తున్నారు.

టీపార్టీ సిద్ధం చెయ్యమని మహాలింగం కోమల విలాస్‌కు కబురుచేశాడు. అప్పుడు సోమసుందరంగారి పరిస్థితి జాలికరంగా వుంది. లెక్కింపు పూర్తికాకముందే ఇల్లు చేరుకోవడం ఉచితమని అనుకున్నట్లున్నాడు. వెళ్ళడానికి ఏమీ కారణం చిక్కక ఆ వేపచెట్టుకిందనే గడ్డంకింద చేతులు పెట్టుకొని కూచున్నాడు. ఇంతలో ఏమనుకున్నాడో ఏమోగాని పైగుడ్డ చెట్టుకిందనేపెట్టి పంచె పైకి ఎగగట్టి గోడచాటుకు పోయినట్లుపోయి అక్కడనుంచి రిక్షాఎక్కి గప్‌చిప్‌గా ఇంటికి చేరాడు! పైగుడ్డ పారేసుకుపోయాడే పాపం అని నాకనిపించింది.

ఫలితం ప్రకటించారు. ఐదువేల మెజారిటీతో నేను గెలిచాను. తాయారమ్మ మూడువేల మెజారిటీతో నెగ్గింది. శంకరగిరి స్వాములువారి ఏనుగొకటి ఏదోవూరుపోతూ మా వూళ్ళో ఆగింది. పట్టు పట్టమని ఏనుగు తోలుకొచ్చి నన్నెక్కించారు. ముస్లిం పెండ్లికొడుకు మాదిరిగా ముఖంకనబడకుండా పూలమాలలు వేశారు. ఏనుగువెనుక టాపులేని చిన్నకారులో తాయారమ్మను కూచోపెట్టి దండలువేశారు. ఇలా గెల్చినవారిని ఎలాగూ వూరేగిస్తారని ముందుగా ఊహించుకొని వచ్చిన బ్యాండు మేళంతో ముఖ్యవీధులన్నీ వూరేగాం. బాణసంచా కాల్చారు. అక్కడక్కడ కుర్రవాళ్ళు పిప్పరమెంట్లూ రవ్వలడ్లూ ఏనుగుమీదికి విసిరారు. మొదట్లో ఆగ్రహం వచ్చింది. కాని తరువాత కాస్త తమా

యించాను. నా మీాద అభిమానంకొద్దీ అలా చేస్తున్నారు గదా అనుకొని చిక్కినంతవరకూ అందుకున్నాను.

ఆనాటి రాత్రి పొద్దు పోయేవరకు వూళ్ళోవున్న పెద్ద మనుషు లొక్కొక్కరే వచ్చి నన్ను అభినందించి వెళ్ళారు. సినిమాహాలు యజమాని స్వయంగా కారేసుకొచ్చి 'ఆవారా' ఫిలిం ప్రత్యేకంగా తెప్పించాను- చూచిపోదురుగాని రండని ఆహ్వానించాడు. మరునాటి ఉదయం వీధిలోకి వెళ్ళుదామని చెప్పులు తొడుక్కొని బయలుదేరుతుంటే సుశీలారావు దగ్గరకువచ్చి "ఇపుడు నీవు తిమ్మాపురం ఎం. ఎల్. ఏ. వు. అంటే ఇహనుంచి రాష్ట్రపరిపాలనలో స్థానం వున్నది. పూర్వం జాగీరుదార్లు ఎలాంటి వారో నీవలాంటివాడవు. కాలి నడకన వీధిలో తిరగడం తప్పు. అలా బయలుదేరితే మనుషులు నిన్నుముట్టడివేసి ఏదోఒకటి వెళ్ళబోసుకుంటారు. వాళ్ళను తప్పించుకోవటం కష్టం. అదీగాక నీ ప్రత్యర్థులు నీకు ప్రమాదం కలిగించటానికి ప్రయత్నించనూవచ్చు." అని సూచనగా అన్నాడు. అతను చెప్పిన ప్రకారం నేనిక "పరదా" చాటున వుండవలసివచ్చేటట్లుంది. మొత్తానికి పెండ్లి అయినఅమ్మాయి స్వేచ్ఛ కోల్పోయినట్లుగా నేను గూడ కొంతవరకు స్వేచ్ఛను కోల్పోవలసివచ్చింది!



## ఆర్థికమాంద్యం

పెళ్ళిచేసిచూడు, ఇల్లుకట్టిచూడు అన్నట్లుగా, ఎన్నికల్లో నిలబడిచూడు అనికూడ అనవలసివస్తుంది. ఇల్లుకడితేనూ పెండ్లిచేస్తేనూ బొంబాయిమిఠాయిలాగ డబ్బులు కరిగేమాట నిజం. పర్వతంమాదిరిగా అప్పులు పెరిగేమాట గూడ నిజమే. కాని కళ్ళముందర నికరంగా ఒక కొంపన్నా కనబడుతుంది; అమ్మాయిని ఒకరింటిదాన్ని చేశామనే తృప్తి అయినా వుంటుంది. ఎన్నికల్లో నిలబడితే అలాంటి నికరలాభ మేమీ కనిపించదు. గెలిచామనే నిష్ప్రయోజనమైన ప్రయోజనం మాత్రం ఒకటి వచ్చింది. ఎం.ఎల్.ఏ. అనే డిగ్రీకాని డిగ్రీ ఒకటి వచ్చిచేరింది.

మిత్రులందరమూ సమావేశమైనాం. ఎన్నికలకోసం ఎంతకర్చయిందో, ఎవరెవరి కెంతెంత బాకీపడ్డామో జాబితా తయారుచేసి నాదగ్గరకు తెచ్చారు. వాటి వివరాలు ఇవి.

| లోపలకుదారి ! | | బయటకు దారి ! | |
|---|---|---|---|
| మహాలింగం ఇచ్చింది | రూ. 9000 | కట్టిన డిపాజిట్ | రూ. 500 |
| మామగారు ఇచ్చింది | 5000 | "మసాలా" దినపత్రిక ఎడిటర్కు షష్టిపూర్తికానుక | 1200 |
| | | సినిమాతారలకు ముడుపు | 6000 |
| కోమలవిలాస్లో అరువు | 1000 | కొండయ్య తాతకు బలగంకోసం ఖర్చు | 1000 |
| చిల్లరమల్లర అప్పులు | 3000 | పోలీసు ఇన్స్పెక్టరుకు మోటారుసైకిలు కొని ఇచ్చింది | 1800 |
| తిరిగివచ్చిన డిపాజిట్ | 500 | | |

| లోపలకుదారి ! | | బయటకు దారి ! | |
|---|---|---|---|
| | | ఊరేగింపుల్లో పాల్గొన్న ఎద్దులకు మేత | 300 |
| | | వాలంటీర్లకు రొఖ్ఖం | 5000 |
| | | వాలంటీర్లకు కుట్టించి ఇచ్చిన బెన్ని చొక్కాలకు | 1000 |
| | | కరపత్రాలు, గోడకాగితాలు | 2000 |
| | | భజంత్రీలకు | 700 |
| పెరసి రు. 18,500 | | | 18,500 |

ఎన్నికలు రేపనంగా పోలీసు ఇన్‌స్పెక్టరు అల్లుడిపోజులో వచ్చి నుంచున్నాడట. ఎందుకైనా మంచిదిలెమ్మని సుశీలారావు ఒక మోటారు సైకిలు అతనికి బహూకరించాడట!...భజంత్రీలకు అంటే అర్థం గెలిచిన తర్వాత గజారోహణ సందర్భంలో ముందునడిచిన మేళగాళ్ళకన్న మాట.

ఇదీ సంగతి. నేను ఈ పళంగా 18 వేల రూపాయలు ఋణం చేశాను. దీన్ని తీర్చడం యెలా ? ఇది నాకు తీరని సమస్య అయింది.

అప్పు అనేది మనిషిని కుంగదీసే ఒక రకపు పిశాచం. ఈ ప్రపంచంలో ఓటమిని భరించవచ్చు; అవమానాన్ని భరించవచ్చు; ఆప్తుల మరణాన్ని భరించవచ్చు; గుండెమీద బండరాతిని పెట్టినా భరించవచ్చు గాని ఋణాన్ని మాత్రం అభిమానవంతు డెవడూ భరించలేడు. అది మనస్సునుశిథిలం చేసివేస్తుంది. నిద్రలోగూడ గుర్తుకు వస్తుంది. సంతోషంగా

సినిమాకు పోదామనుకుంటే అప్పు యింతవుందిగదా అని గుండుసూదితో గిల్లినట్లుంటుంది. అప్పులవాళ్ళు యెక్కడ కనిపిస్తారోనని పెద్దబజారుగుండా పోవడంమానివేసిసందులూ గొందులూ చూచుకోవలసి వస్తుంది. అప్పుల వాళ్ళు యమ కింకరుల్లాంటివాళ్ళు. వారంట్లు తెప్పించి అవమానం పాలు చేస్తారు. గుంటనక్కల్లాగ పొంచుండి మనం యెప్పుడు బజారులో కనిపిస్తే అప్పుడు మీదికురుకుతారు అప్పు తీర్చమని. అప్పు అనేది మనిషిని చెడగొడుతుంది.

ఇవన్నీ ఊహించుకుంటే నా గుండెలు ఝల్లుమన్నయ్. భూమిని మోసే ఆదిశేషువు మాదిరిగా నామీద ఈబరువు పడిందే అని చింతాగ్రస్తుడనైనాను. సుశీలారావు నావంక చూశాడు. "ఏదో శోక కార్యక్రమంలో వున్నావే!" అన్నాడు. నాకు చిరు నవ్వు వచ్చింది. తల వంచుకున్నాను.

రెండు మూడు నిముషాలు గడిచినై. మృదంగంమీద వేళ్ళు వేసినట్లు పక్కనున్న ట్రంకుపెట్టిమీదవ్రేళ్ళతోశబ్దం చేస్తూ "శుభమా అంటూ ఎం. ఎల్. ఏ. వయితే ఏడుపెందుకొ వచ్చిందంట!"అన్నాడు సుశీలారావు. నిజమే, నాకే నవ్వొచ్చింది. పాము విడుస్తున్న కుబుసం మాదిరిగా నా మనస్సును ఆవరించిన "మాయ" అంతర్థానమయేటట్లు కన పడింది అతను వేసిన ప్రశ్నతో. ఎం.ఎల్.ఏ. అయినందుకు ఆనందించాలి గాని వెధవఅప్పుల్ని చూచిదిగులుపడతామా?

"సుశీలారావ్ ! నెలనెలకూ నాన్నగారు నామీది వాత్సల్యంకొద్దీ పంపే వందరూపాయలు తప్ప వేరే రాగి దమ్మిడీ వచ్చే యిరువు లేదుగదా! మరి నాపేర గత రెండు నెలల్లోనూ 18 వేల రూపాయలు అప్పులు తెచ్చాంగదా! ఇలా అప్పుచేశాను యిమ్మంటే మానాన్న కాకికి విదిల్చినట్లు ఒక వెయ్యి అయినా విదులుస్తాడో అసలేలేదంటాడో, ఈ అప్పులిచ్చిన వాళ్ళందరికీ యివ్వాళ కాకపోతే రేపయినా బాకీలు తీర్చాలి గదా ! ఎక్కడనుంచి తెచ్చేది ? ఎలా తెచ్చేది? నాకేమీ తోచకుండా వుంది." అన్నాను.

"వెంకటప్పయ్యా! అప్పు తీసుకోడమనేది ఎన్నడూ దోషంకాదు. పదిమందిని యెరుగున్నవాడికి తప్ప ప్రతివాడికీ అప్పుపుట్టదు. మననోరు మంచిదవుతేనూ, మనగుణం మంచిదవుతేనూ అవతలివాడికి సమయానికి వచ్చి ఆదుకోవాలనిపిస్తుంది. ఎవడి కొంపా దోచుకొని మనం డబ్బు తేలేదు. ఎవరి పెళ్ళాల మెళ్ళల్లో గొలుసుల్నీ మనం తెంపుకురాలేదు. ప్రజాస్వామిక పద్ధతుల్లో ఎన్నికలు జరిగాయి. మనంగూడ కాస్తో కూస్తో ప్రజాసేవ చేద్దామనుకున్నాం. ఎన్నికల్లో పాల్గొన్నాం. కాస్తోకూస్తో డబ్బు అవసరమయింది. మన మేలు కోరేవారూ, మనమీద నమ్మక మున్నవాళ్ళూ మనల్ని పిలిచి డబ్బు యిచ్చారు. పుచ్చుకున్నాం. ఇందులో నేరమేమీ లేదే!"

నా మనసుకు అతని మాటలు టంకంలాగ నాటుకున్నయ్. కళ్ళార్పకుండా అతనివంక చూస్తున్నాను. అతను చెప్పుకుపోతున్నాడు.

"ఇక అప్పు తీర్చడమంటావా? ఈ 18 వేలల్లో ఇప్పటికిప్పుడు తీర్చవలసిన వేవీ లేవు. ఎం. ఎల్. ఏ. పదవి ఐదేళ్ళదాకా ఖాయం. ఈలోగా తీరిగ్గా అప్పు తీర్చుకోవచ్చు. దీనికోసం ఏమీ దిగులుపడ నవసరం లేదు. ఇహ నీవు శాసన సభ గురించీ, ప్రజా సమస్యల గురించీ ఆలోచించుకో" అన్నాడు. నేను సరే నన్నాను.

అసలు మా మామగారు 5 వేల రూపాయలు బదులిచ్చారు. ఆయనకు ఒక్కగాను ఒక్కతే కుమార్తె. ఆ అపురూపసుందరిని నాకిచ్చి పెళ్ళి చేశారుగదా! ఇకముందు ఆయనకు బిడ్డలు కలుగుతారని ఎవరికీ అనిపించటం లేదు. ఎలాగూ ఆయన కాస్తా గోవిందా అంటే ఆయనకున్న 50 ఎకరాలూ నావేగదా! అందుచేత ఆయన బాకీ తీర్చడమనేది ఏమంత ప్రశ్న కాదు. ఇస్త్రీవాయనం పుచ్చుకుంటే వాయనం లాంటిది.

ఇక కంట్రాక్టర్ మహాలింగం గత నాలుగైదేండ్లలోనూ బాగాపుంజుకున్నాడు. ఒకచక్కని డాబా కట్టించాడు. బ్యాంకులో నిల్వవుంది. కారుకొందామని చూస్తున్నాడు. అతను పైకి రావటానికి నా పంచాయతీబోర్డు అధ్యక్షపదవి కారణం గనుక అతను 9 వేల రూపాయలు నాకోసం వ్యయ

పరచటం సహజమే! తీరిగ్గా అప్పు తీర్చుకోవచ్చు ననుకున్నాను.

నాకుమాత్రం ఆర్థికమాంద్యం వచ్చి మీదపడింది. కానీకి కరువుగావుంది. గుడ్డలు చినిగినయ్. క్రొత్తవి కొందామంటే పర్సు ప్రశ్నార్థకంతో కనపడింది!



## మంత్రివర్గ నిర్మాణం

ప్రాంతాన్నంతటినీ ఉడికింపజేసిన ఎన్నికలు పూర్తి అయినయ్. ఆవురావురుమని ప్రజలు రేడియోలచుట్టూ మూగారు. చాలారోజులతర్వాత వివిధ పార్టీలవాళ్లూ ఒకరి నొకరు చూచుకున్నది రేడియోలముందరే. ఎన్నికల ఫలితాలు ఒక్కొక్కటే వెలువడినయ్. పార్టీలలో అతిరథులు, మహారథులవంటివాళ్ళు కొందరు ఆకులురాలినట్లు రాలి పోయారు. రాష్ట్రి జనతాపార్టీ కార్యదర్శి అభిమన్యుడి మాదిరిగా పోరాడి పోరాడి చివరకు కేవలం 3 ఓట్లతేడాతో ఓడిపోయాడు. రాష్ట్రిజనతాపార్టీ ఉపాధ్యక్షుడికి నాట్యాచార్యుడనే బిరుదుగూడా వున్నది. అనేకమంది సినిమా తారలను తయారుచేసి లోకానికి వప్పగించాడు. అలాంటివాడు పోటిలోకి రాకుండా పోయాడు. అలాగే లేబరుపార్టీ రాష్ట్రి అధ్యక్షుడు తాటిపండు రాలినట్లు రాలి పోయాడు. జిల్లా లేబరుపార్టీ కార్యదర్శికి కార్మికవీర అనే

బిరుదు నామధేయం గూడా వున్నది. ఆయనకు డిపాజిట్ గల్లంతయింది !

175 సీట్లలో 80 సీట్లు జనతాపార్టీకి వచ్చినయ్. 75 సీట్లు లేబర్ పార్టీకి వచ్చినయ్. 15 సీట్లు మహిళాపార్టీ గెల్చుకున్నది. 5 సీట్లలో స్వతంత్రులు వచ్చారు. ఇదీ పరిస్థితి. ఏ ఒక్క పార్టీకీ పూర్తి మెజారిటీ రాలేదు. రెండుపార్టీలనాయకులూ తెల్లముఖాలు వేశారు. రెండు నెలలనుంచి పడిన కష్టమంతా ఫలితానికి రాలేదు.

ఎన్నికల ఫలితాలు నెలువడిన రాత్రికిరాత్రే జనతా పార్టీ శాసనసభ్యులందరికీ అర్జంటు టెలిగ్రాములు వచ్చినయ్. మరునాడు కాకులుకూసే సమయానికల్లా అందరం కుంభకోణంలో వెళ్ళి వాలాము. సమావేశం ముక్తసరిగా ఐదునిమిషాలసేపు జరిగింది. ఉక్కులాంటివాణ్ణిగా చూచి రంగాచారిని పార్టీనాయకుణ్ణిగా ఎన్నుకున్నాం. ముఖ్యమంత్రి పదవి సందేహాస్పదంగా వుండటంవల్ల పోటీకినిలబడుదామని అంతకుముందునుంచీ ఉవ్విళ్ళూరిన రమణారెడ్డి నీళ్ళుమింగి వూరుకున్నాడు. అధికారం వస్తుందా అనధికారం వస్తుందా అని అందరూ మీనమేషాలు లెక్కిపెడుతున్నారు.

లేబర్ పార్టీవాళ్లు వదలిన బాణం గురికి దగ్గరగా పడిందని ఆనందపడుతున్నారు. మనకు మెజారిటీరాలేదని ఏడవకపోగా జనతాపార్టీకి రాలేదని సంతోషిస్తున్నారు! వాళ్ళు నారాయణరెడ్డిని పార్టీ నాయకుడుగా ఎన్నుకున్నారు.

కృష్ణాష్టమినాడు ఉట్లు అందుకోటంకోసం పోటీపడ్డట్లు రెండుపార్టీలనాయకులూ మహిళాపార్టీ శాసనసభ్యుల కటాక్ష వీక్షణాలకోసం నానాఅవస్థలు పడుతున్నారు. వాళ్ళు ఎటు మొగ్గితే అటు వాలుతుంది లక్ష్మి! రంగాచారి చాలా ప్రతిభా వంతుడు. అవతలిమనిషియొక్క మానసిక పరిస్థితినిముందుగా ఊహించుకొని తదనుగుణ్యంగా మాటలాడ నేర్చినవాడు. అతను అద్వితీయమైన పథకం ఒకటి సిద్ధంచేశాడు. దాన్ని వెంటనే రాష్ట్రవ్యాప్తంగా ఆచరింపచేశాడు. దానిప్రకారం జనతాపార్టీ శాసనసభ్యుల భార్యలు మహిళాపార్టీ శాసన సభ్యులను కలుసుకొని, ముఖాన బొట్టుబెట్టి చేతిలో మామిడి పండూ తాంబూలమూ పెట్టి బెనారెస్ సిల్కు చీరె, రెవిక లను సమర్పించి "మీరు ఎన్నికల్లో గెల్చినందుకు ఇది మా చిరుకానుక. ఉన్న పార్టీలలో పెద్దపార్టీ అయినటువంటి జనతాపార్టీతో మీరు చేతులుకలిపి, మీరు అధికారంచేపట్టా లని మా కోరిక" అని చెప్పి వచ్చేశారు.

నిజంగా స్త్రీలు అల్పసంతోషులు చీరె, రెవికలతో తృప్తిపడ్డారు. పండూ, పసుపూ కుంకంకంటె వారికి కావలసిం దేదీ లేదు. అంతకంటె మేమిచ్చిందీలేదు! ఉపరి మా రంగాచారిగారు శాసనసభా మహిళాపార్టీ నాయకురాలు శ్రీమతి కమలాదేవిని కలుసుకొని ఆమెను ఆరోగ్యశాఖా మంత్రిణిగా నియమిస్తానని మాట ఇచ్చాడు. అంతేగాక తాయారమ్మను డిప్యూటీ స్పీకరుగా ఎన్నుకుంటామని గూడ

వాగ్దానం చేశాను. జనతాపార్టీకీ, మహిళాపార్టీకి సఖ్యత కుదిరింది.

గవర్నర్ కేదారనాథ్ సహానీగారు రంగాచారిని ఆహ్వానించి మంత్రివర్గం ఏర్పరచమని కోరారు. లేబర్ పార్టీ వాళ్ళు స్వతంత్రుల్ని తమవైపు తిప్పుకోగలిగారు. ప్రతిపక్ష బలం 80 అయింది. 8 మంది మనుషులు తల్చుకుంటే ఓడలు కాస్తా బండ్లు అవుతయ్! ఇదీ పరిస్థితి.

ముందొచ్చిన చెవులకంటె వెనుకొచ్చిన కొమ్ములు వాడి అన్నట్లు తిమ్మాపురంనుంచి జనతాపార్టీ తరఫున గెలిచిన నేను యిలా మైలురాయి లాగ పడివున్నాను; గ్రహబలం అనుకూలించి గెలుపొందిన తాయారమ్మ డిప్యూటీ స్పీకరై కూచుంది, ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ! ఇదీ ఒకందుకు మంచిదే లెమ్మనుకున్నాను. మా నియోజకవర్గానికి సంబంధించిన పనులు జరిపించడంకోసం నేను నేరుగా ముఖ్యమంత్రి దగ్గరకు పోకుండా తాయారమ్మను ఆశ్రయిస్తే సరిపోతుందిగదా అని వూరుకున్నాను. ఊరుకోక నేను చేయగలిగిందేమీ కనపడలేదు. పూర్తి మెజారిటీ లేని జనతా పార్టీని ఆర్తరక్షా పరాయణుల మోస్తరుగా రెక్కపుచ్చుకొని ఒడ్డుకు లాగినవాళ్ళు మహిళాపార్టీ వాళ్ళు. వారి కోరికలను తీర్చకపోతే మేమంతా సుడిగుండం పాలు కావలసివచ్చేది. గోళ్ళు భుజిస్తూ ప్రతిపక్ష స్థానాల్లో కూచోవలసివచ్చేది!

లజ్జాకరమైన సంగతి ఒకటి చెప్పవలసి వున్నది. మాకు

నెలకు 150 రూపాయల జీతమట ! అవ్వ ! నామద్రాచేటు ! ఒకొక్కొక్క అభ్యర్థి ఇరవై ముప్పైవేల రూపాయలను కళ్లాపి చల్లినట్లు విరజిమ్మి, మూడు నెల్లపాటు నిద్రాహారాలు మానుకొని ఆసులో దారం తిరిగినట్లు తిరిగి, అవతలివాళ్ళు నానా మాటలంటుంటే మనల్ని కాదనుకొని సహించి, తీరా ఎన్నికల్లో గెలిస్తే మాకిచ్చేది 150 రూపాయలా ! ఎవరి ముక్కులో పెట్టడానికీ అంట! అసలీ భరణం మటుకు దేనికీ అంట! ఏ అయ్యదగ్గరో చేరి పద్దులు రాసేవాడి కిస్తున్నారే ఈ మాత్రపు జీతం ! బొంబాయిలో అడుక్కుతినే వాడు సంపాయిస్తున్నాడే ఈమాత్రపు సంపాదన! మాకేమో శాసనకర్తలని పేరు; మాకు విదిల్చేది నాలుగురాగిపైసలు!

కుంభకోణంలో వున్న మొదటి పదిరోజులూ శాసనసభ నన్నంత ఆకర్షించలేదు. విచ్చలవిడిగా పట్నం చూచివద్దా మనిపించింది. ఒకనాడు దేవాలయం చూచాను. మరొకనాడు మ్యూజియం చూచాను. ఇంకొకనాడు రేడియో స్టేషను చూచాను. ఒకనాడు ఇంగ్లీషు సినిమాకు వెళ్ళాను. మరీ ఇంగ్లీషు సినిమాలలో నటించేవాళ్ళకు సిగ్గులేదేం ?

శాసన సభలో మాట్లాడాలని నాకుకొద్దికొద్దిగా అభిలాష కలిగింది. ఒకనాడు రాష్ట్రంలోని పోలీసుశాఖ పద్దు మీద చర్చ జరుగుతోంది. చాలామంది చాలా సంగతులు చెపుతున్నారు. కాని నామనస్సులో వున్న సంగతి ఎవరూ చెప్పలేదు. సరేనని ధైర్యంచేసి నిలబడి "అయ్యా! పోలీసులు

నాలుగు బజార్ల మధ్య నిలబడాలంటే చాలా పట్టణాలలో సిమెంటు గొడుగులైనా లేవు. పోలీసులు ఎండలో ఎండి వానలో తడవవలసి వస్తున్నది. ఆ గొడుగులు కాస్త కట్టించండి పుణ్యముంటుంది” అని కూచున్నాను. సభంతా గొల్లుమన్నది. అంతా హర్షధ్వానాలు చేశారు. కాని, ఒక ఘటోత్కచుడివంటి మనిషి మంత్రుల పక్కన కూర్చొని నావంక పెద్దపులి చూసినట్లు చూచాడు. సమావేశంఅయిన తర్వాత నాదగ్గరకు వచ్చాడు. ఆయన మా ఛీఫ్‌విప్‌ట! తనతో ముందుగా సంప్రదించకుండా యికనుంచి యెన్నడూ శాసన సభలో మాట్లాడవద్దన్నాడు. అలాగా అని ఊరు కున్నాను. చేతులో పేంబెత్తం ఒకటి తక్కువగాని హైస్కూలు హెడ్‌మాస్టరులాగ మమ్మల్ని ఆయన పర్యవేక్షిస్తుంటాడు!

నే నెప్పుడూ విని యెరుగవి విషయాలు అసంఖ్యాకంగా వున్నయ్. సేల్సుటాక్సు రెండుచోట్ల విధించటం, జి.సి.ఐ.ఎం. కోర్సును ఎం.బి.బి.యస్. కోర్సుతో సమానంగా చూడటం, రైతులఋణాలకు మారటోరియం యివ్వించటం, బేసిక్ విద్యావిధానం ప్రవేశపెట్టడం, డెఫిసిట్ ఫైనాన్సింగు, యిత్యాది అనేక సంగతులున్నయ్. వీటిలో ఏ ఒక్కదాన్ని గురించీ సమగ్రంగా నాకు తెలియదు. నాకేమిటి! శాసన సభ్యుల్లో ఏ ఐదారుగురికో తప్ప అందరికీ యివి కొత్త సంగతులే. మరి వీటిని గురించి ఏమి మాట్లాడుతాం? క్షుణ్ణంగా తెలిసిన సంగతి గూర్చి అంతమందిలో మాట్లాడ

టమే కాస్త గుండెధైర్యంతో గూడిన పని. అదీగాక ఈ మహిళా పార్టీవాళ్ళు పల్లేరుకాయల్లాంటివాళ్ళు. వాళ్ళు మూగమొద్దుల్లా కూచుంటారు. నోట్లోనుంచి మాట పెగలదు. ఎవరైనా మాట్లాడుతుంటే మాత్రం అయినదానికీ కానిదానికీ పగలబడి నవ్వుతారు. దాంతో నుంచున్నవాడు చెప్పదలచింది చెప్పకుండానే దొంగచాటుగా కూచోవలసి వస్తుంది. పోనీ ఇంటిదగ్గర రాసుకొచ్చి శాసన సభలో గడగడా చదవొచ్చునేమో ననుకుంటే అలా వల్లకాదుట. రూల్సు వప్పుకోవట, ఆశువుగా అప్పటి కప్పుడు చెప్పాలట. మేమేమన్నా ముఖర్జీలమూ బెనర్జీలమూ అలా చెప్పటానికి?

దీన్నిబట్టి చూస్తే నాకు దిగులు వేసింది. ఏడు కొండలు కష్టపడియెక్కినపండుముదుసలికి వెంకటేశ్వరస్వామి దర్శనం దుర్లభమైతే ఎంతబాధపడుతాడో నాకంతవిచారం వేసింది. అసలు శాసనసభలో ముచ్చటించే మహాద్భాగ్యం నాకు కలుగుతుందో లేదోనని భయం వేసిందికూడాను.

ఈ విషయంలో తోటి శాసన సభ్యులు ఏమిచేస్తారో వేచి చూచాను. అసలు మూడువంతుల మందిలో శాసన సభలో ఉపన్యసించాలనే కాంక్ష కనపడలేదు.ఎవరోఐదారుగురు వక్తలున్నారు. సాధారణంగా వాళ్ళుతప్ప మరెవ్వరూ ఉపన్యసించాలని గూడ అనుకోరు. మాట్లాడవలసిందిగా మమ్మల్ని ఛీఫ్‌విప్ ప్రోత్సహించడు. ఎందుకంటే ఎంత కొద్ది మంది మాట్లాడితేకార్యకలాపం అంతత్వరగాఅయిపోతుంది.

మరి శాసనసభ్యుల పనేమిటంటారా? వాళ్ళలో కొందరు శాసనసభకు సరిగారారు. సొంతవూళ్ళోనీడపట్టున వుంటారు. ఒకవేళ వచ్చినా క్యాంటీన్‌లో కూచొని పళ్ళెటూళ్ళ నుంచి పనులు చేయించుకుపోవడం కోసం వచ్చేముఠాదారు లతో సంప్రదిస్తూ వుంటారు. లేదా సెక్రెటేరియట్‌లోకి వెళ్ళి యేపని యెవరివల్ల యెలా జరుగుతుందో వాకబు చేస్తుంటారు. తప్పితే పట్టణంలో వినోదశాలల్ని దర్శిస్తుం టారు. చాలాసార్లు కోరంలేదని స్పీకరు చెవులు గింగురుమనే టట్లు గంట మోగించేవాడు. సభ్యులకోసం ఛీఫ్‌విప్ పంతులమ్మ మాదిరిగా తిరిగేవాడు. ఇలాంటి పరిస్థితిలో నావంటి మర్యాదస్థుడు ఏంచేయాలో తోచకుండా వచ్చింది.

---

## ప్రశ్నోత్తరాలు

శాసనసభా కార్యక్రమంలో కల్లా రసవత్తరమైన ఘట్టం ప్రశ్నోత్తరాల సమయం. ప్రజల సాధక బాధకాలను ప్రభుత్వదృష్టికి తేవడంకోసం ఈసమయాన్ని వినియోగిస్తారు. ఒకనాడు స్కూలుఫైనలు పరీక్షల్లో కాపీలు జరగడంగూర్చి ప్రశ్నలు కురిపించబడ్డాయి. కార్యక్రమం చాల ఉత్సాహ కరంగా నడిచింది. ఇప్పటికీ నాటి అనుభవం కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంది. ఆనాటి కార్యకలాపాన్ని గుర్తున్నంతవరకు యథాతథంగా ఇక్కడ పేర్కొంటున్నాను:

శ్రీ నారాయణరెడ్డి (లేబర్) : స్కూలు ఫైనలు పరీక్షలకు వాచర్లుగా పంపబడిన ఉపాధ్యాయుల మాన ప్రాణాలకు ప్రభుత్వం పూచీ పడుతుందా?

విద్యామంత్రి : విద్యార్థుల చేతుల్లోనే ఉపాధ్యాయుల మానప్రాణాలకు ప్రమాదం వాటిల్లుతుందని నాకు అనిపించటం లేదు.

శ్రీ సోమలింగం : (స్వతంత్ర) వెల్లుల్లిపాలెం బోర్డు హైస్కూలులో స్కూలుఫైనలు పరీక్షల సందర్భంలో ఒక్క విద్యార్థి కిల్లీ రూపంలో బుగ్గనపెట్టుకొని వచ్చిన కాగితాన్ని చేతులోకి తీసుకొని కాపీకొడుతుండగా పసికట్టి పట్టుకున్న వాచరు ఆ నాటినాత్రి ఆరుబయట మంచంమీద పడుకొని నిద్రపోతుండగా కొందరు యువకులు మంచం మంచం లేవనెత్తి ఏటిలో వదిలివేసిన సంగతి ప్రభుత్వానికి తెలుసా? ఆ వాచరుకు ఈత చేతకాదనిగూడ తెలుసా?

విద్యామంత్రి: పాపం! అలాగా! వివరాలు తెలిపితే విచారిస్తాం.

శ్రీ రామరాజు (లేబర్) : గోదావరిజిల్లా నక్కలపాడు గ్రామానికి అకస్మాత్తుగా మార్చి 18వ తేదీన నూరు మంది రిజర్వుపోలీసులు తెప్పించబడ్డారు. ఆ గ్రామంలో వున్న లేబర్ పార్టీవాళ్ళ కొంపలమీద దాడి చేయించడానికే ఈ బలగాన్ని పిలిపించారా? పోలీసులు వచ్చినప్పటినుంచి ఊళ్ళో

కోడిపిట్టలు మాయమవుతున్నాయి. కనుక ఆ పోలీసుల్ని వెంటనే వూరినుంచి పంపివేస్తారా ?

ముఖ్యమంత్రి: కోడిపిల్లలు మాయమవటానికీ, పోలీసు లుండటానికి ఎలాంటి సంబంధమూ లేదు. నక్కలపాడు బోర్డు హైస్కూలులో స్కూలుఫైనలు పరీక్షల వాచర్ల రక్షణార్థం పోలీసుల్ని పంపాం. పరీక్షలైపోగానే వాళ్ళను పంపివేస్తాం.

శ్రీ భీమారావు (స్వతంత్ర) : దీన్నిబట్టి వాచర్లుగా వెళ్ళే ఉపాధ్యాయులు విధిగా ఈతనేర్చుకున్నవారైయుండా లనీ, కసరత్తుచేసి కండపుష్టి కలిగివుండాలనీ డ్రిల్లుమేష్టర్లకు ప్రిఫరెన్సు ఇవ్వాలనీ ప్రభుత్వం నిర్ణయిస్తుందా ?

విద్యామంత్రి: ప్రస్తుతం అలాంటి వాళ్ళే పంపబడు తున్నారని నా విశ్వాసం.

శ్రీ సోమలింగం (లేబరు) : స్కూలుఫైనలు పరీక్ష లపుడు ఔట్ అయిన ప్రశ్నపత్రాలనే పేరుతో కొన్ని ప్రచారమైన విషయమూ ఆ ప్రశ్నలకూ నిజంగా ఇవ్వబడ్డ ప్రశ్నలకూ ఏ మాత్రం సంబంధం లేకపోవడంవల్ల ఆప్రచా రాన్ని నమ్మి వేలకొలది విద్యార్థులు ఆశాభంగం చెంది పరీక్ష చెడగొట్టుకున్న విషయమూ, ప్రభుత్వంగమనించిందా? ఈ ప్రచారం చేసినవారిలో ఉపాధ్యాయులుగూడ ఉన్నట్లు తెలుసా?

విద్యామంత్రి : తెలిసినా తెలియకపోయినా మేము చేయగలిగిం దేమీ లేదు.

శ్రీ భీమారావు: (స్వతంత్ర) స్కూలుఫైనలు పరీక్ష సమయంలో నిజంగా ఔటక్ అయినపేపర్లు విద్యామంత్రిగారి కారు వెనుకభాగంలో అతికించబడిన సంగతి మంత్రిగారు గ్రహించారా? పరీక్షలు తిరిగి జరిపిస్తారా?

విద్యామంత్రి: "ఔటక్" అయినవో "ఇన్"అయినవో నాకు తెలియదు. గౌరవసభ్యులలో ఈ విషయంలో ఏకాభిప్రాయం లేదుగనుక ప్రతిపక్షంవారు కోరితే ఓటింగు తీసుకొని నిర్ణయించవచ్చు. నాకేమీ అభ్యంతరం లేదు.

స్పీకరు: పరీక్ష పేపర్లు ఔటక్ కావటాన్ని గురించి ఓటింగ్ తీసుకొని నిర్ణయాలుచేస్తే లోకం మనల్ని దద్దమ్మల కింద జమకడుతుంది. ఓటింగ్ తీసుకోగూడదని రూలింగ్ ఇస్తున్నాను. (ప్రతిపక్ష సభ్యుల హర్షధ్వానాలు) మరొక ప్రశ్న వేయండి.

శ్రీ సోమలింగం (లేబరు): కొన్ని హైస్కూళ్ళలో ఉపాధ్యాయులుగూడ కాపీలనునిరోధించడంలేదని ప్రభుత్వానికి తెలుసా? దీన్ని అరికట్టడానికి ఏమిచర్యలు తీసుకున్నారు?

విద్యామంత్రి: ప్రధానంగా ఆత్మరక్షణ కొరకు, తరువాత తమ స్కూలు పిల్లలు అధికంగా ప్యాసు కావటం కొరకు, కొందరు కాపీలను ఉపేక్షిస్తున్నారని మాకు తెలుసు. ఇలా కాపీలు కొట్టే అవసరం లేకుండా సులువుగా ప్యాసు కావటం కోసమే నూటికి నలభై మార్కులదాకా "టిక్ సిష్టమ్"లో జవాబులు వ్రాసేపద్ధతి ప్రవేశపెట్టాం.సభవారు

కోరినట్లయితే నూటికినూరు నూరుపాళ్లూ "అవునా? కాదా?" అనే ప్రశ్నలతో పేపర్లు వుండేటట్లు నిర్ణయించడానికి నాకేమీ అభ్యంతరం లేదు. (వినుడు వినుడు అని కేకలు).

శ్రీమతి కామాక్షమ్మ (మహిళా పార్టీ): దేశమంతటా విద్యార్థులు కాపీలు కొడుతున్నారనే సత్యాన్ని సభవారు అంగీకరించారు. ఆ కాపీలను ఆపలేకపోతున్నారనే విషయం గూడ అంతా అంగీకరించారు. కనుక పుస్తకాలు దగ్గర పెట్టుకొని జవాబులు వ్రాసే పద్ధతి ప్రవేశపెడుతారా ?

విద్యామంత్రి : పుస్తకాలలో జవాబు లెక్కడున్నాయో విద్యార్థులు తెలుసుకోలేకపోవచ్చు. అందుచేత "అవునా కాదా" అనే ప్రశ్నావళివల్లనే యెక్కువ ఉపయోగముంటుం దనుకుంటాను.

శ్రీమతి నాంచారమ్మ(మహిళా):రాష్ట్రంలో సుమారు 60 వేలమంది స్కూలుఫైనలు విద్యార్థు లున్నారు. వీరిలో ఏటా20వేలమంది ప్యాసవుతున్నారు. ప్యాసయే ప్రతిక్రవాడిపైనా తలా పదిరూపాయలు చొప్పున పన్ను విధించినట్లయితే ప్రభుత్వరాబడి పెరుగుతుందనీ, ప్యాసయిన సంతోషంతో విద్యార్థులు పన్నును భారంగా పరిగణించరనీ ప్రభుత్వం గమనించిందా ?

శ్రీ భీమారావు : ప్యాసయే వారిసంఖ్య తక్కువ, తప్పేవారి సంఖ్య యెక్కువ కనుక తప్పేవారందరినుంచీతలా పదిరూపాయల చొప్పున వసూలు చేస్తే ఆదాయం నాలుగు

రేట్లు అధికంగానూ వస్తుంది; తప్పినందుకు విద్యార్థులను శిక్షించినట్లూ అవుతుంది. ప్రభుత్వం ఈ సూచనను అంగీకరిస్తుందా?

ఆర్థికమంత్రి : గౌరవసభ్యులకు హృదయపూర్వకంగా కృతజ్ఞత తెలుపుకుంటున్నాను. మీ రెండు సూచనలనూ సంతోషంగా పాటిస్తామని హామీ ఇస్తున్నాను. (సభలో నిర్విరామంగా చప్పట్లు).

ఈ సరళిలో ప్రశ్నోత్తరాలు నడిచేవి. శాసనసభా కార్యక్రమంలో కల్లా సజీవమైన భాగం ప్రశ్నోత్తరాలనే చెప్పాలి.

---

## సందిగ్ధ పరిస్థితి

నన్ను కాకులు పొడిచినట్లు పొడిచి చంపుతున్నారు మావాళ్ళు. ముఖం చాటుచేసే వీలులేకుండా వచ్చింది.

కోటిరెడ్డిగారి కుఱ్ఱవాడు జంతుశాస్త్రం తీసుకొని ఇంటర్మీడియేట్ ప్యాసవడంకూడ నా మెడకే వచ్చి చుట్టుకొన్నది. అతనికి మార్కులు మాత్రం 40కి తగ్గకుండా, 45 కు దాటకుండా వచ్చినయ్. సుతిమెత్తని కుఱ్ఱవాడు. పట్టుకుంటే కందిపోయేలా వుంటాడు. మరొకడి కాలికి రక్తంకారుతుంటే ఇతనికి చురుక్కుమంటుంది. అలాంటిసజ్జనుడికిఎం.బి.బి.ఎస్.లో సీటు ఇప్పించాలట! దానికోసం ఆరోగ్యశాఖా మంత్రిణి

గారిని కలుసుకోమని నన్ను మోచేతితో పొడుస్తున్నాడు కోటిరెడ్డి.

మురికిపూడి గ్రామవాసులు కత్తులూ కటార్లూ పుచ్చుకొని అర్ధరాత్రివేళ గుడిపూడి గ్రామంమీద విరుచుకు పడ్డారు. వూరు వెలుపల కాలువగట్టు మీద రెండుపక్షాల వాళ్ళూ తారసిల్లారు. భారతదేశ చరిత్రలో మూడవ పానిపట్టుయుద్ధం ఎంతప్రఖ్యాతిచెందిందో గుడిపూడి గ్రామచరిత్రలో ఈ దొమ్మీ అంత ప్రఖ్యాతి చెందింది.ఇరవైకట్టెలు అప్పడాల మాదిరిగా విరిగిపోయినాయి. నలభైమంది వీపులు జల్లెడ పొడిచినట్లు పొడిచి వదలిపెట్టారు. డెబ్భైమంది కట్లు కట్టించుకొని ఆసుపత్రిలో పడివున్నారు. వారిలో ముగ్గురికీ ఈ లోకంతో ఋణం తీరిందని అంతా అనుకున్న సంగతే. రక్తం ఎక్కించీ, ఆక్సిజన్ ఎక్కించీ డాక్టర్లు వాళ్ళను చావకుండా చూశారు. ఇంత భీభత్సం జరిగింతర్వాత పోలీసులు వూళ్ళమీదపడి దొమ్మీతో ఏమాత్రం సంబంధం లేనటువంటి, ఆ చాయలకే పోనటువంటి ఇద్దరు పెద్దమనుషులకు బేడీలు వేసి సబ్ జైల్లో పెట్టి, ముంతకూడు వేశారు నాలుగురోజులపాటు. ఇపుడువాళ్ళను వదిలించి, కేసు కొట్టివేయించవలసిన భారం నామీద పడింది!

వెంగళాయపాలెంలో పురాతన కాలంనుంచీ ఒక చెరువున్నది. ఆ చెరువుక్రమంగా పూడిపోయి నేలమట్టమయింది. దాన్ని ఎవరూ త్రవ్వించనూ లేదు, బాగుచేయించనూ లేదు. మాఋమిత్రకోటిలోని వాడైన పుల్లయ్య కళ్ళు ఆచెరువుమీద

ప్రసరించినయ్. ఆ చెరువు 15 ఎకరాల విస్తీర్ణం వుంటుంది. దాన్ని కాస్తాపోరంబోకుకింద భుక్తం చేసుకుంటాను; పైనుంచి మాటరాకుండా చూడమంటాడు పుల్లయ్య.

ఆ నిర్భాగ్య దామోదరుడు సుబ్బారాయుడు నాపాలిట నక్షత్రకుడై కూచున్నాడు. స్కూలుఫైనలు బొటాబొటీగా ప్యాసైనాడు. సర్వీసు కమిషన్ మార్కులైనా లేవు. పైగా పుట్టెడు నత్తి. ఇంగ్లషులో హంసపాదులు లేకుండా ఒక్క వాక్యం రాయలేడు. అతనికి ఉద్యోగం నేను చూపించిపెట్టాలి. ఉద్యోగం వచ్చేవరకు నాగదిలోనే మకాంపెట్టాడు. అతన్ని వదించుకోవడం అత్యంత అవసరంగా వున్నది.

ఇవన్నీ ఇలావుండగా మామామగారు ఉండుండి ఒక పనిచేశారు. కలెక్టరాఫీసుచుట్టూ ఒకటికి పదిసార్లు తిరిగి, రికార్డు గుమాస్తాను మంచిచేసుకొని తాను వందేమాతరం ఉద్యమంలో పాల్గొని ఒకటిన్నర రోజులు సబ్ జైల్లో వున్నట్లు సర్టిఫికెట్ పుట్టించుకొచ్చాడు. దానిని కవచంగా పెట్టుకొని ఆ వూరిలోని 10 ఎకరాల పోరంబోకును దత్తం చేసుకోవాలని పకడ్బందీగా ప్లానువేశాడు. ఎవరైనా అడ్డం వస్తే ఫలానా ఎం.ఎల్.ఎ. మా వాడున్నాడు జాగ్రత్త అని అనడం ఆరంభించాడు! 50ఎకరాలు ఉన్నయిగదా చాలవూ? ఈ పాడుపనికి తలపడడం ఎందుకూ?

కంట్రాక్టరు మహాలింగం పెద్ద వ్యవహారవేత్త అయినాడు. వేలు సంపాయిస్తున్నాడు; లక్షలు అప్పు చేస్తు

న్నాడు. సంపాదన చేసేవాడికి అప్పులెందుకు చేయవలసి వస్తుందో నాకు అర్థంకావడంలేదు. అసలు ఆ ఇచ్చేవాళ్లు గూడ ఇతని రాబడిని మించి ఎలా అప్పులిస్తారో గూడ తెలియటంలేదు. ఒకరికి తెలియకుండా ఒకరుచొప్పున వూళ్లో దాదాపు అందరూ అతనికి కొద్దోగొప్పో అప్పులిచ్చారు. ఇన్ని అప్పులు చేశానుగదా అని అతనేమీ దిగులుపడడు. అడవిలో వేటగాడు ఏ నిముషంలో పులివాత పడతానో అనే భయమైనా లేకుండా నిర్విరామంగా వేటాడుతున్నట్లు మహాలింగం అప్పులవాళ్ళవలన చీమ కుట్టినంత బాధనైనా పొందకుండా ఇంకా ఇంకా అప్పులుచేసి కొత్త కొత్త పథకాలు వేస్తున్నాడు. తిమ్మాపురం నుంచి ముట్లూరు, వెంగళాయపాలెం, టంగుటూరుల మీదుగా కుంభకోణానికి 180 మైళ్ళ దూరం. ఇంతదూరమూ ఒక బస్సు వేస్తాను, లైసెన్సు ఇప్పించమంటాడు. మన సేర్కాలో మనం బస్సు వేయించినట్లూ అవుతుంది; అది ప్రజాసేవకిందికీ వస్తుంది; తాను అప్పుల్లోనుంచి బయటపడనూ పడతాడు; కనుక ఈ పని చేయించి పెట్టమంటాడు. తనకు లైసెన్సుగనుక ఇప్పించకపోతే "ఇక నీవు బతకటం అనవసరం" అన్నట్లుగా మాట్లాడతాడు!

ఈ పరిస్థితులన్నీ సింహావలోకనచేసి ఆలోచిస్తే నాకు చాల ఆశ్చర్యమూ, విచారమూ కలిగింది. నేనొక్కణ్ణే కుంభకోణంలో వుంటున్నాను. సుశీలారాణి తిమ్మాపురంలోనే వుంటున్నాడు. అతను వెంబడి లేకపోవటంవలన నాకు దారి

రున్నా తోచటంలేదు. నేనునిజంగా ప్రజాసేవ చేస్తున్నానా? అని నాలో నేను అనేకసార్లు ప్రశ్నించుకొనివూరుకున్నాను.

నేను ఒక్క-పనిమాత్రం చేసిపెట్టాను. డిప్యూటీస్పీకరు తయారమ్మకు ఇంగ్లీషులో వచ్చే వుత్తరాలను చదివి తెలుగులో అర్థంచెప్పటానికి నమ్మదగిన కుఱ్ఱవాడు ఒకడు కావాలని అడిగింది. సరేనని సుబ్బారాయుణ్ణి ఆమెకు వప్పగించి వూరుకున్నాను. ఆమెకితను ఇంగ్లీషులో పాఠాలుగూడ చెప్పటం ఆరంభించాడట! అతనిపనికాస్త బాగానే వున్నది.

---

## పిడుగుపాటు

రెండు సంవత్సరాల ఆరునెలలు మహిళాపార్టీ,జనతా పార్టీలు చిలుకా గోరంకుల్లాగ కలిసి మెలసి పనిచేసినయ్. పడుగూపేకల మాదిరిగా ఒకదానినొకటి ఆడుకున్నయ్. దేశంలోని స్త్రీపురుషులందరూ ముచ్చటపడ్డారు. సంక్రాంతి పండుగను నవనవోత్సాహంతో జరుపుకున్నారు. ఈ అపూర్వమైన సామరస్యంవలన దేశం సస్యశ్యామలమైపోతుందని అభిజ్ఞులు భావించారు. ఈ రెండుపార్టీల నెయ్యమూ ఒక రకమైన వియ్యమేనని లోకం ఆశించింది.

ఇంతలో ఒక విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది. అలాంటి పరిస్థితి ప్రపంచచరిత్రలో ఏదేశంలోనూ సంభవించివుండదు.

ఏ రాజకీయవేత్తా ఇలాంటి అనుభవాన్ని పొంది యుండడు. ఎటువంటి చాణుక్యులకూ గూడ అందనటువంటి, ఎటువంటి డిప్లమసీవలనా ప్రయోజనం లేనటువంటి పరిస్థితి ఏర్పడింది.

మహిళా లెజిస్లేచర్ పార్టీ నాయకురాలు కమలాదేవి మా ఆరోగ్యశాఖా మంత్రిణి అని ఇంతకు పూర్వమే మనవి చేశాను. ఆమె భర్త ఒక ప్రముఖ హైకోర్టు న్యాయవాది. 15 సంవత్సరాలనుంచి వాళ్ళు అన్యోన్యంగానే కాపురంచేస్తు న్నారు. ఇలాంటి వాళ్ళ నడుమ వ్యవహారం బెడిసింది. అను మానం పెద్దరోగం అంటారు. ఒకరిపై ఒకరికి అనుమానం క్రమంగా ఆరంభమయింది. అది నిదానంగా పెరిగి, చిగిర్చి, పూతపూసింది. ఇద్దరూ ఏవో సందేహాలు పెట్టుకున్నారు. వాళ్ళవాళ్ళ సందేహాలే అబద్ధమేమోనని వాళ్ళు సందే హించలేదు. వాళ్ళ సందేహాలు నిజమని ఋజువు చేసే దాఖ లాల కోసం అన్వేషించడం ఆరంభించారు. ఇద్దరికీ నమ్మకం కుదిరింది వాళ్ళనడుమ ప్రేమకాస్తా అవసానదశలోకి వచ్చిం దని! ఇద్దరూ ఇక సహజీవనం గడపజాలమనుకున్నారు. ఒక నాటి ఉదయం మేజిస్ట్రేట్ కోర్టులోకి వెళ్ళి మంగళసూత్రాన్ని తెంచివేసి ఇక ఒకరి ముఖం ఒకరు చూచుకోమని ప్రక టించారు. "లా" ఒప్పుకున్నది-విడాకు లిచ్చుకున్నారు. ఆయన బార్ రూమ్‌లోకి వెళ్ళాడు. ఈమె ఇటు సెక్రటేరియట్ లోకి రివ్వున కారు వేసుకు వచ్చేసింది!

ఇది వాళ్ళ కుటుంబ వ్యవహారం. దీనివల్ల రాష్ట్ర

రాజకీయాలు తలక్రిందు లవుతాయని యెవరమూ అనుకో లేదు. అసలా ఆలోచనే యెవరి మనస్సులోనూ లేదు. ఒక్క అయిదంటే అయిదు రోజులు గడిచినయ్. వూళ్ళో గుసగుస లారంభమైనయ్. క్లబ్బుల్లోనూ కాఫీ హోటళ్ళలోనూ ఒకటే గోల, పక్షులు కిచకిచ మంటున్నాయి. కోయిలలు నిము షాని కొకటి చొప్పున గానం చేస్తున్నాయి. వీధుల్లో వదం తులు వ్యాపిస్తున్నాయి. అకస్మాత్తుగా ఆరవనాటి ఉదయం 8-30 గంటలకు టౌనుహాలులో ఆరోగ్యశాఖా మంత్రిణి కమలాదేవిని లెజిస్లేచర్ లేబర్ పార్టీ ఉపనాయకుడు రజనీ కాంతారావు వివాహం చేసేసుకున్నాడు! మా అందరికళ్ళూ జిగేలుమన్నాయి. మా కందరికీ ఒక్క గంట ముందుగా పెళ్ళిపిలుపు లందజేశారు. మేము ముస్తాబు చేసుకొని టౌను హాలుకి పోయేసరికి 28 సంవత్సరాల పెళ్ళికొడుకు 36 సంవత్సరాల పెళ్ళికూతురుమీద తలంబ్రాలుపోస్తున్నాడు!! చూడదగిన దృశ్యమది. మామిడిపళ్ళ భారంవల్ల చెట్టు పాంథులకోసం వంగినట్లు కమలాదేవి రజనీ కాంతారావుకు అందుబాటులో వుండటంకోసం ప్రయత్నిస్తున్నదా అని అని పించింది!

రేడియోలో విని ప్రజలంతా తెలుసుకున్నారు. రేడియో లేనివాళ్ళు మరునాడు పత్రికల్లో చదివి తెలుసు కున్నారు. ఇలస్ట్రేటెడ్ వీక్లీలో దంపతులఫొటోలు స్పష్టంగా ప్రకటించబడ్డాయి. వీరి వివాహ వార్త రాజకీయ రంగంలో

పిడుగు పడ్డంత ఆశ్చర్యం కలిగించింది. లాబీవర్గాలవారు తల్లడిల్లి పోతున్నారు. వివాహమనేది వ్యక్తిగత విషయమే కావచ్చు. కాని ప్రతిపక్షంలోని ఒక ప్రముఖ నాయకుణ్ణి ప్రభుత్వపక్షంలోని ఒక మంత్రిణి, అందులోనూ మహిళా లెజిస్లేచర్ పార్టీ నాయకురాలు వివాహం చేసుకున్నదీఅంటే జనతాపార్టీ సభ్యులకు వంటిమీద గొంగళి పురుగులు పాకుతున్నట్లనిపించింది. ఎవరికీ ఏమి చేయడానికీ తోచటం లేదు. ముఖ్యమంత్రి రంగాచారికి ఆనాడు అన్నం సయించలేదట. జనతాపార్టీ మంత్రివర్గం వుంటుందా వూడుతుందా అని అభిజ్ఞ వర్గాలవారు ఆందోళన చెందుతున్నారు.

స్త్రీబుద్ధి ప్రళయాంతకమని మనవాళ్ళు చెప్పనేచెప్పారు. లేడి కన్నులు ఎంత చంచలములో యువతుల బుద్ధులు అంత చంచలములు. పాముపడగ క్రిందనైనా వుండవచ్చునుగాని పడతుల పమిటెలకింద వుండలేము. ఆడవాళ్ళ మాటకూ నీటిప్రాతకూ అట్టే తేడాలేదు. పురుషులు నిర్మిస్తుంటే స్త్రీలు నిర్మూలిస్తారు. స్త్రీలు యెంత నవనీత శరీరులో అంత క్రూర మనస్కులు. రాజకీయాలలో మహిళల ప్రవేశం ప్రభుత్వాలకు శ్మశాన ప్రవేశం!

అనుకున్నంతపనీ జరిగింది. స్పీకరుకు ప్రతిపక్షనాయకుడు నారాయణరెడ్డి అవిశ్వాస తీర్మానం అందజేశాడు. మంత్రివర్గంమీదకు అది నారాయణాస్త్రంలాగ వస్తున్నది. ఆహార శాఖామంత్రిణి కమలాదేవి తన పదవికి రాజీనామా చేసింది.

డిప్యూటీ స్పీకరు తాయారమ్మను మాత్రం ఈ పెను తుఫానులో కొట్టుకుపోకుండా పట్టుకొనివుంచాం. మహిళాపార్టీలో చీలిక ఏర్పడింది. కమలాదేవి అనుయాయులు ప్రతిపక్షాన్నీ, తాయారమ్మ అనుయాయులు ప్రభుత్వాన్ని సమర్థిస్తున్నారు.

ఇంకా రెండురోజుల్లో అవిశ్వాస తీర్మానం చర్చకు వస్తుంది. బలాబలాలు ప్రదర్శించటంకోసం అటు వాళ్ళూ, ఇటు మేమూగూడా సతమతమైనాం... మా విద్యాశాఖా మంత్రిగారు బాలబాలికలకు ఓనమాల క్లాసులో యెలాంటి ఆటలాడిస్తారో స్టడీచేసి రావటంకోసం టర్కీదేశం వెళ్ళాడు! ఈ విశ్వాసరాహిత్యతీర్మానం స్పీకరుకు అందివ్వబడగానే 'నీవుచేసిన స్టడీ ఇహచాలులే, ఇక్కడ జీవన్మరణ సమస్య ఏర్పడింది, ఇక వున్నవాడివి వున్నట్లు వెంటనే దొరికిన విమానంలో ఎక్కి చక్కారమ్మ'ని కబురుచేశాం...... ఆయన విమానాశ్రయంనుంచి బెడ్డింగు పుచ్చుకొని సరిగ్గా ఓటింగు వేళకు నేరుగా శాసన సభలో ప్రవేశించాడు... మహిళా పార్టీలో ఇందిరాదేవి అని శాసనసభ్యురాలున్నది. సినిమా తెరమీద ఒక్కసారి కనిపించాలని పెద్ద అభిలాష గలది. రంగాచారిమాట చెలామణి అయ్యేటువంటి గిరిజా స్టూడియోస్ వారు తీయబోయే తదుపరిచిత్రం "కొంటెపిల్ల" లో హీరోయిన్ పాత్ర ఇప్పిస్తానని రంగాచారి ఇందిరాదేవికి ప్రమాణపూర్వకంగా మాట ఇచ్చాడు. ఆమె మా పక్షం తిరిగింది.

ఇది ఇలా వుండగా ఒక్క వారం రోజుల క్రిందట మా జనతాపార్టీలో రామానాయుడనే సభ్యుడు గోదావరినదిలో స్నానం చేయడంకోసంపోయి కాలుజారి కొట్టుకుపోయాడు. శవంగూడ పత్తాలేదు. చచ్చినవాడికోసం మేమేడుస్తుంటే, అతను ఎన్నికలపుడు చేసిన 30 వేల రూపాయల అప్పు తీర్చలేక నదిలో దూకాడని లేబర్‌పార్టీ వాళ్ళు ప్రచారం చేస్తున్నారు! చూడండి తమాషా... ఓటింగునాటికి లేబర్ పార్టీలో ఒక సభ్యుడికి క్షయరోగం వచ్చి బెంగుళూరు శానిటోరియంలో చేరాడు. అతను కదిలేస్థితిలో లేడని డాక్టర్లు చెప్పారు. అలాంటి వాడిని డిశ్చార్జి చేయించుకొని చిన్నకారులో కుంభకోణం తీసుకొచ్చి ఓటింగులో పాల్గొన జేశారు! ఓటింగు అయిన తరువాత అతను స్పృహతప్పి పడిపోతే, నిద్రవచ్చి పడుకున్నాడు లెమ్మంటారు లేబర్‌పార్టీ వాళ్ళు!

ఓటింగు జరిగినంతసేపూ ఐదేళ్లు వుండవలసినఉద్యోగాలు అర్థాయుష్షుతో అంతరిస్తాయని భయం వేసింది. అందరికళ్లూ స్పీకర్ పెదిమలమీద నిల్చివున్నయ్. మేమే కాదు; గ్యాలరీల్లో కిక్కిరిసిన వందలాది జనులూ, శాసనసభకు వెలుపల మూగిన వేలకొలది ప్రజా సామాన్యమూ ఆ స్పీకరు ఏమి వెల్లడిస్తాడోనని చెవులప్పగించి చూస్తున్నారు.

పిడుగుపడింది! రెండు ఓట్ల తేడాతో మంత్రివర్గం పతనమయింది. వెధవ రెండుఓట్లు! ఎవరిని అని ఏం ప్రయోజనం? కమలాదేవి బంకిని బోల్తాకొట్టించింది. పెండ్లి చేసుకున్నంత

మాత్రాన తాను ఉన్న కొంపకే నిప్పుపెట్టాలా? మొగుడు ముఖ్యమా, దేశం ముఖ్యమా? ఛీ!-ఛీ! జనతాపార్టీ సభ్యులు యావన్మందిమీ వంచిన తలకాయలు ఎత్తకుండా హాస్టలు చేరాం. దారీ తెన్నూ తెలియక ప్రశ్నార్థకంగా కూచున్నాం.

కమలాదేవి మాపాలిట శాంభవి అయింది. ఆమె వీధిలో దొరికితే అప్పడంలాగ నమిలి మింగుదామనిపించింది. ఎముకల్లో సున్నంలేకుండ శాస్త్రి చేద్దామనిపించింది. కాకులకూ గద్దలకూ విందు చేద్దామనిపించింది. కాకపోతే మా నోటికింది కూడు తీసివేస్తుందా? పరువుప్రతిష్ఠలను మంట గలుపుతుందా? రేపు శాసనసభ రద్దవుతే ఆ వీధుల్లో తిరిగే సుబ్బారాయుళ్ళు ఎంతో మేమూ అంతేగా?

మరునాటి ఉదయం గవర్నర్ కేదారనాథ్ సహానీగారు శాసనసభను రద్దుచేశారు. ఆరునెలలపాటు తానే సలహాదారుల సహాయంతో పరిపాలిస్తాననీ, ఆ తరువాత ఎన్నికలు జరిపిస్తాననీ ప్రకటించాడు.

లాభంలేదు. పట్నంలోవుంటే తిండి దండుగ. రాత్రి మెయిలెక్కి తిమ్మాపురం చేరుకోవటం శ్రేయస్కర మనిపించింది. షాపుకెళ్ళి ఇస్త్రీగుడ్డలు తెచ్చుకున్నాను. బెడ్డింగు చుట్టి పెట్టె సర్దాను. పగిలిపోయిన అద్దాలు, చిరిగిపోయిన పత్రికలు, విరిగిపోయిన దువ్వెనలు, పాతబ్లేడులు అక్కడే వదిలాను.

నేను వెళుతానని హోటలు వెధవ పసిగట్టాడు. గడపకు అడ్డంగా పొట్టవేసుకొని నిలబడ్డాడు. వాడికి మనం 125 రూపాయలు బాకీ. ఇంతకుపూర్వం మర్యాదగామాట్లాడే వాడు. ఇప్పుడదేమీ లేదు. "అయ్యగారు వూరికిపోతున్న ట్లున్నారు. మానోట మట్టిగొట్టకండి. డబ్బులిచ్చి దయ చేయండి" అన్నాడు. "ఉన్నవాణ్ణి ఉన్నట్లు ఈపళంగా నీకు డబ్బెక్కడ తెచ్చియిస్తాను? నోటు రాసిస్తాను తీసుకో" మన్నాను. "ఎందుకూ! నాలిగ్గీచుకోడానికా?" అన్నాడు వాడు.

ఇక ఏమి చేసేది? వెధవ 125 రూపాయలకోసం మాటలు పడవలసి వస్తున్నదే అనిపించింది. ఒక్క నిముష మాలోచించి బజారుకు వెళ్ళి రిస్టువాచీ, రాళ్ళ ఉంగరమూ తెగనమ్మి వాడిడబ్బు వాడి మొహాన పారేశాను. అదీగాక "వైధవ్యం" వచ్చిం తర్వాత ఆభరణాలతో పనేముందీ?!!

## వైరాగ్య లక్షణాలు !

చేతులూపుకుంటూ తోటి శాసనసభ్యులంతా ఎవరి వూళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు. పొలముంగట్రా వున్న వాళ్ళు ముల్లుకర్ర పుచ్చుకొని బయలుదేరారు. లెక్కశుద్ధి గలవాళ్ళు ట్యుటోరియల్ కాలేజీల్లో ఉద్యోగాలకోసం గాలిస్తున్నారు. డబ్బు వెనకేసినవాళ్ళు [illegible] ప్రాంతా

లకు వెళ్ళి సిమెంటు వ్యాపార మొకరూ, కాగితం వ్యాపార మొకరూ ఆరంభించారు. రాజకీయాలే కులవృత్తిగా పెట్టు కున్నవాళ్ళు పార్టీ కార్యాలయాలకు బూజుదులిపి కొత్త బోర్డులు చేయించి బయటకట్టి, కొవ్వొత్తి వెలిగించుకొని కూచున్నారు. ఆరునెలల్లో ఎన్నికలు నికరంగా ఆరంభ మవుతాయి గనుక ఈతడవ మాంచి మెజారిటీతో గెలవాల ని ఊపులో వున్నారు.

నా తలకాయ బొప్పి కట్టింది. నాకళ్ళు బరువులెక్కి-నయ్. నాచెవులు దిబ్బళ్ళు పడిపోయినయ్.నాచర్మం మొద్దు బారింది. నా కాళ్ళు లాగుతున్నయ్. నా మనస్సు దోవా తెన్నూ తెలియక తల్లడిల్లి పోతున్నది. నా హృదయం నా మీద "సమ్మె" చేస్తున్నది!

అవును. నా హృదయం నామీద సమ్మెచేస్తున్నది. నీతో మాట్లాడనుపో అన్నది. ఇవ్వాళ నీకు గుర్తువచ్చానా అన్నది. ఇన్నాళ్ళనుంచి నీవు నాముఖం చూడలేదుగదా అని నిలదీసి అడుగుతున్నది. ఇపుడుమటుకు నీవు నామాట వింటావని నమ్మకం ఏమిటని ఎదురు ప్రశ్న వేసింది. అవును. నిజమే. ఇపుడుమటుకు నాహృదయం ఇచ్చే ఆదే శాలను పాటిస్తానా? ఏమో నాకే నమ్మకం లేదు.

మిత్రులంతా నన్ను పరామర్శ చేసిపోదామని వచ్చారు. లాటరీలో డబ్బు పోయినవాళ్ళ మోస్తరుగా మొహాలు పెట్టారు. రెండు సంవత్సరాలనుంచీ నా మకాం

కుంభకోణం కావటంవల్ల తీరుబాటుగా వాళ్ళతో మాట్లాడి చాలా కాలమయింది. మహాలింగానికి బస్సుమాటు యిప్పించలేక పోయానని గుర్తుగా వుంది. నన్ను పనులు సాధించలేని మనిషికింద జమకట్టాడు. కొండయ్యమాత్రం ఆప్యాయంగా మాట్లాడాడు. ఇంతవరకు జీవితంలో ఒక వృత్తి అనేది లేకుండా తిరుగుతున్నాననీ, యిక యేదైనా ఒక వృత్తిని నమ్ముకొని వుంటాననీ, ఏదైనా దోవ చూపించిపెట్టమనీ అడిగాడు. సుశీలారావుగూడ వచ్చాడు. వూళ్ళు దూరం కావటంవల్ల హృదయాలుగూడ దూరమైనా యనిపించింది. తాను నన్ను తీసికెళ్ళి శిఖరంమీద కూచోబెడితే నేను దొర్లుకుంటూ వచ్చాననే అర్థంతో మాట్లాడాడు. కాలకర్మ వశాత్తూ మంత్రివర్గం పతనమైతే దానికి నేనెలా అడ్డుపడేదీ? తాను ఆశించిన ఆశలు అడియాసలైనట్లు మాట్లాడాడు. కాని యింతలోనే నేనేమైనా నొచ్చుకుంటానేమోనని మాట మార్చివేసి "పోనీలేగాని మనం కలుసుకొని చాలా కాలమయింది. రాత్రి మాయింట్లో భోజనంచేద్దాం రమ్మ"న్నాడు.

ఊహ తెలిసినప్పటినుంచీ నేనూ సుశీలారావూ కృష్ణార్జునుల మాదిరిగా మెలిగాం. గోలీలు ఆడుకున్నాం. దాగుడు మూతలాడుకున్నాం. మామిడిపండు గాని జామపండు గాని తెచ్చుకుంటే ఒక వైపునుంచి నేనూ, మరొక వైపునుంచి అతనూ కొరికి తినేవాళ్ళం. బళ్ళోపంతులు నన్ను ప్రశ్నలడుగు

తుంటే సుశీలారావు పాడిఅక్షరాల్లో నాకు జవాబు లందించే వాడు. హైస్కూలు పరీక్షలు జరుగుతుండేవి; సుశీలారావు రెండు గంటల పేపరును ముప్పావుగంటలో ఆన్సరుచేసి, మిగతాటైములో నాకు కాపీరాసి అందించేవాడు. సుశీలారావూ నేనూ, వాసానికి తీగెఅల్లుకున్నట్లు పెనవేసు కొని వుండేవాళ్ళం. ఆరాత్రి అతని యింట్లో కబుర్లు చెప్పు కుంటూ విందారగించాను. అతను నాతో మాట్లాడుతూ మాట్లాడుతూ "మసాలా" దినపత్రికలో సహాయసంపాదక ఉద్యోగం ఒకటి వచ్చింది; వారం రోజుల్లో వెళుతున్నా నన్నాడు.

నా కళ్ళవెంట గిర్రున నీళ్ళు తిరిగినై. సుశీలారావు ఉచ్ఛదశలోకి పోవటం మంచిదే గాని అతను దాదాపు శాశ్వతంగా దూరమవుతాడనే దుఃఖం కలిగింది. దుఃఖం అణచుకోలేకపోయాను. అతనిచేతిని నా చేతుల్లోకి తీసికొని గట్టిగాపట్టుకున్నాను. "ఎందుకు మమ్మందర్నీ వదిలేసి పోతు న్నావ్?" అని అడిగాను.

"వెంకటప్పయ్యా! దేశసేవ చేయాలనే కోరిక నాలో చిన్నతనంనుంచీ వున్నదని నీకుగూడా తెలుసు. ఆ దేశసేవ చెయ్యటానికి అధికారంలోకి పోవడం తప్ప వేరే గత్యంతరం లేదని నేను విశ్వసించాను. వయోజన ఓటింగు హక్కువలన దేశం చాలా ప్రయోజనం పొందగలదని అనుకున్నాను. కాని నేను అనుకున్నది తప్పని ఇపుడు తోస్తున్నది.

పూర్వం రాజరికాలు వున్న రోజుల్లో యథారాజా

తథా ప్రజా అన్నారు. రాజు ఎలావుంటే ప్రజలలా వుంటారని అర్థం. ఇది ప్రజాస్వామ్య యుగం. ఇప్పుడు యథాప్రజా తథారాజా అనటం సబబుగా వుంటుంది. ఇవుడు ప్రజలు ఎలాంటి వాళ్ళవుతే, వాళ్ళచే ఎన్నుకోబడే పరిపాలకులు అలాంటి వాళ్ళవుతారు. నిజానికి శాసనసభలోకి వెళ్ళినంత మాత్రాన సాధించగలిగిందేమీ కనిపించటంలేదు. పూర్వం రాజు ఒక్కడు బుద్ధిమంతుడవుతే, రాజ్యం బాగుండేది. ఇవుడు ప్రజలందరూ బుద్ధిమంతులైతే తప్ప వాళ్ళు ఎన్నుకొనే శాసనసభ్యులు బుద్ధిమంతులై రాజ్యం బాగుండదు. అందుచేత నేను ప్రజలకు సంస్కారాల నిచ్చి బాగుచేయదలచాను. ప్రజలను బాగుచేయటానికి పత్రికలు ఒక ఉపకరణం. ఇకనుంచి నేను దినపత్రిక సహాయ సంపాదకుడుగా పనిచేయటంద్వారా ఏమైనా సాధించగలనేమో ననుకుంటా" నన్నాడు సుశీలారావు.

నేను దీర్ఘమైన ఆలోచనలో పడ్డాను. మా అమ్మగారు యెన్నడో చెప్పిన విషయాన్ని సుశీలారావు యిప్పటికి గుర్తించా డనిపించింది. "ప్రజలను సంస్కరించాలి"అని అతను అన్నటునంటి మాట నా చెవులలో పునరావృత్తమవుతూ వున్నది.

ఇతరత్రా నా పరిస్థితి అంత సుముఖంగా లేదు.మహాలింగం తనకివ్వవలసిన 9 వేల రూపాయలబాకీ తక్షణం తీర్చవలసిందిగా మొఖాన చెప్పివేశాడు. అతనికి నేనేమో నోటు వ్రాయలేదు. తీర్చకపోయినా అతను కోర్టుద్వారా నాకాలు

గూడ కదల్చలేదు. కాని మనసు ఒప్పలేదు. నా జన్మలో ఒకరికి అప్పు ఎందుకుండాలి? నావలన ఒకడు ఎందుకు బాధ పడాలి? అనిపించింది.

ఇది యిలావుండగా మాఆవిడ ఉగాది పండుగకు పుట్టింటికి వెళ్ళివచ్చింది. వచ్చింతర్వాత ఖేదం కలిగించే ఒక వార్త తెచ్చింది. మా మామగారు తన అన్న కొడుకుల్లో చివరి వెధవను దత్తు చేసుకుంటాడట. ఇది నాకు చాలా విషాదాన్ని కలిగించింది. ఇకనుంచి మా మామగారిద్వారా చిల్లిగవ్వకూడ మనకు చేరదన్నమాట. అదీగాక తనకు నేనివ్వవలసిన 5000 రూపాయలూ సాధ్యమైనంత త్వరగా పంపమనిగూడ కబురు చేశాడు.

వీధిలోకి వెళితే మనుషుల్లో ఆప్యాయత కనిపించ లేదు. శాసనసభ రద్దవటంతో శాసన సభ్యులమీద ప్రజల కున్న గౌరవంగూడ రద్దయినట్లు కనిపించింది. "మళ్ళీనుంచుం టారా?" అని కొందరు మాత్రం అడిగారు. రామిరెడ్డి ముఠావాళ్లు నక్కను తొక్కినట్లు ఆనందపడుతున్నారు. నేను బాకీవున్నవాళ్లు మాత్రం "స్వగ్రామం పోయివస్తారా" అని అడిగారు!

తెల్లవారుఝామున నిద్రలేచి స్వగ్రామంపోయి డబ్బు తీసుకొచ్చి అప్పులు తీర్చాలని నిశ్చయం చేసుకున్నాను. నాటి రాత్రి కొండయ్యతో చాలసేపు హృదయమిచ్చి మాట్లాడుకొని నిద్రపోయాను.

# స్వప్నం

"తెరచాప యెత్తారు. గాలి హోరున వీస్తున్నది. ఒడ్డునున్న చెట్లన్నీ తలలు తిప్పుతూ మమ్మల్ని పిలుస్తున్నవా అనిపిస్తున్నది. కొండమీది నుంచి క్రిందికి వచ్చే సైకిలు మోస్తరుగా పడవ పరుగులు తీస్తున్నది. పసుప్పూ, కుంకుమా, అరటిపండ్లూ, జామపళ్లూ, రవికగుడ్డలూ, నదిలోకి విసరి వేస్తున్నారు. నీలి ఆకాశం నీటిలో ప్రతిబింబిస్తున్నది. ప్రభాకరుడు నదిలో దగ్గరకు వచ్చినట్లు కనబడుతున్నాడు. కళ్లు మిరుమిట్లు గొలిపేటట్లు ప్రకాశిస్తున్నాడు. నీటిని కోసుకుంటూ పడవపోతున్నది.

చాలాదూరం పోయాం. "యశోదా సదనం" దిగే వాళ్లున్నారా అని సరంగు కేకవేశాడు. పడవ ఆగింది. నలుగురు మొగవాళ్లు ఏడాది వెళ్లని పసిపిల్లలను పొత్తిగుడ్డలతోసహా ఎత్తుకొని పడవదిగారు. నేను వాళ్లను వెంబడించాను. దోవపొడవునా చెట్లూ చేమలూ దట్టంగా పెరిగి వున్నాయి. ఒక నందగజాలు నడిచాము. ఆకుపచ్చని ఆకుల మధ్య పసుపుపచ్చని పళ్లతో కళ్లకు పండువగానున్ననారింజ తోట కనిపించింది. ఆ భవనం వాకిలిముందు నాలుగైదేళ్ల వయస్సుగల చాలామంది బాలబాలికలు కాసెపట్లువేసుకొని గుంప్రదంగా ఆడుచున్నారు. ముఖానాయంత బొట్లు పెట్టుకొని దొండపండురంగు చీరెకట్టుకొని ఒక పండు ముత్తైదు వాళ్ల

కొక కథ చెపుతున్నది. పిల్లలంతా కథలో నిమగ్నులై వింటున్నారు.

"అప్పు డేమయిందనుకుంటున్నారూ?...రాజుగారిచేత ఏ పాపమెరుగని చంద్రమతికి ఉరిశిక్ష వేయబడింది. కాళ్ళూ చేతులూ తాళ్ళతో కట్టివేసి ఆమెను ఉరిస్తంభం దగ్గరకు తెచ్చారు. కాటికాపరియైన వీరబాహుడు ఆమెను నరికి వేయాలి. చంద్రమతి తన భార్యేగదా అని వీరబాహుడు వెనుకాడలేదు. తన కర్తవ్యం తను నెరవేర్చదలచాడు. చంద్రమతిని చంపటానికి ఖడ్గం ఎత్తాడు" అనంగానే వింటున్న పిల్లలంతా వలవల యేడ్చారు. చొక్కాలతోటీ గౌనులతోటీ కన్నీళ్ళు తుడుచుకుంటున్నారు. ఆమె పరమ సంతోషంతో మళ్లీ చెపుతున్నది. "కాని చంపలేదు. ఇంతలోకి ఆక్షణంలో విశ్వామిత్రుడు వచ్చి హరిశ్చంద్రుడి సత్యసంధతకు మెచ్చుకొని చంద్రమతిని విడిపించి, పాము కరచి చచ్చిపోయిన లోహితాశ్యుని బతికించి హరిశ్చంద్రుడి రాజ్యం హరిశ్చంద్రుడి కిచ్చాడు" అనంగానే భలేభలే అని పిల్లలు కేకలు వేశారు. 'మాతా! ఇంకో గథ చెప్పు, మాతా ఇంకోకథ చెప్పు' అని అడిగారు.

మమ్మల్ని చూచి ఆమె మాదగ్గరకు వచ్చింది. కాళ్లు కడుక్కోడానికి నీళ్లు తెప్పించింది. తల్లీతండ్రీ లేని అనాథలు వీళ్లు అని ఆ నలుగురు పిల్లల్నీ ఆమెకు వప్పగించారు. ఆమె

వాళ్ళను స్వయంగా తీసుకొని వెళ్లి ఉయ్యాలలో పడుకో బెట్టి, పాలుపట్టి ముద్దుపెట్టుకున్నది.

సాయంకాల మయింది. ప్రభాకరుడు లేత గులాబి రంగులోకి వస్తున్నాడు. మాత పిల్లలను పిలిచింది. ఒకపిల్లను చంకనెత్తుకొని నన్ను చూపిస్తూ ఇలా అన్నది. "అబ్బాయిలూ! ఇవ్వాళ మీ అన్నయ్య వచ్చాడు. ఇక యివ్వాళ నుంచీ మీ అన్నయ్యే మిమ్మల్ని ఆడిస్తూ, లాలిస్తూ వుంటాడు. ఇవ్వాళ మీచేత ఆటలాడిస్తాడు ఆడుకోండి" అని అన్నది. "అమ్మాయిలూ! రండి మఱ్ఱిచెట్టుకిందికి పోయి దాగుడుమూత లాడుకుందాము రండి" అన్నది!

పది పన్నెండుమంది బాలురు పాలుకారే బుగ్గలతో నాచుట్టూ చేరారు. అన్నయ్యా! ఆడించు! అని అమాయకంగా అన్నారు. ఇంతమంది తమ్ముళ్ళను చూస్తే నామీద నాకే ఈర్ష్య కలిగింది. మఱ్ఱిచెట్టు కిందికి వెళ్లి ఆటలాడించాను. నేనుగూడ ఐదారేళ్ళ బాలుణ్ణి అవుతే బాగుండు ననిపించింది.

భాస్కరుడు పారిజాత పుష్పపు వన్నెలోకి వచ్చాడు. మరొక ఖండంలోవున్న మానవాళికి కాంతి నివ్వటంకోసం వెళుతున్నాడు. యశోదాసదనం ప్రాంగణంలోకి వచ్చాం. మాత పిల్లలందరినీ కూర్చోపెట్టింది. నేనుగూడ ఒక పక్కన ఒదిగి కూచున్నాను. మాత శ్లోకం చెపుతున్నది. ఒక్కొక్క

మాటే విడదీసి చిన్నచిన్న భాగాలుగా చెప్తున్నది. అందరూ గొంతులు కలిపి అంటున్నారు.

శ్లో॥ యోన హృష్యతి నద్వేష్టి న శోచతి న కాంక్షతి
శుభా శుభ పరిత్యాగీ భక్తి మాన్యః సమేప్రియః॥
సమః శత్రౌచ మిత్రేచ తథా మానావ మానయోః
శీతోష్ణ సుఖదుఃఖేషు సమః సంగ వివర్జితః ॥
తుల్య నిందా స్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్
అనికేతః స్థిరమతిః భక్తిమాన్మే ప్రియోనరః ॥

నేనుగూడ వాళ్ళతో కలిసి శ్లోకాలు పలుకుతున్నాను. ఆ శ్లోకాలు అంటుంటే నావళ్లు పులకరిస్తున్నది. ఆ పదాలను అంటూనే పిల్లలు ఏదో ఉత్సాహాన్నీ, ఆనందాన్నీ అనుభవిస్తున్నారు.

సాయంకాలం భోజనం వేళ అయింది. ఇరవైమంది పిల్లలూ నలుగురు నలుగురు చొప్పున ఒక్కొక్క విస్తరి చుట్టూ కూర్చున్నారు. మాత, నేనూ, మరి ముగ్గురూ దాదులూ ఒక్కొక్క విస్తరిదగ్గరే కూర్చొని అన్నం కలిపి, నెయ్యివేసి ముద్దలుచేసి ఒక్కొక్క పిల్లకే చేతులలో పెట్టాం. వాళ్లు మహదానందంతో తింటున్నారు. చిరునవ్వులు చిలుకుతున్న వాళ్ళ ముఖాలు చూస్తే నాకే ఆనందం కలిగింది.

ఆ మాత దగ్గర, ఆ పిల్లలతో అక్కడే వుండిపోదా మనుకున్నాను. ఆ పిల్లలకు ఏమేమిటో చెప్పాలనీ, వాళ్ళను ఒక్కొక్క రత్నంలా తయారు చేయాలనీ అనుకున్నాను."

ఈ కాంక్ష నా మనస్సులో ప్రవేశించగానే ఒక పెద్ద శంఖనాదం వినబడింది. కళ్ళు తెరచి చూశాను. గదిలో మిణుకు మిణుకుమంటూ దీపం కనపడింది. తలుపుతీశాను. ప్రక్కవీధిలో పెండ్లి జరుగుతున్నది. తాషామర్పా వినవస్తున్నది. గడియారం చూస్తే 4 గంటలయింది. వెంటనే లేచి కాలకృత్యాలు తీర్చుకొని స్నానంచేసి గుడ్డలు వేసుకొని స్వగ్రామం బయలుదేరాను.

కలలో చూచిన మాతను ఇంకొక్క గంటలో కలుసుకొనబోతున్నాను. బస్సు బయలు దేరబోతున్నది. వెళ్ళి వస్తాను!

